# పురాణవిద్య

గ్రంథకర్త:

డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు

ప్రచురణ:

మలయకూటం

శ్రీ వేంకటేశ్వరపురం

అనంతపురం.

# PURANA VIDYA

*by*

**Dr. Thummapudi Koteswara Rao**

© Auother

Year of Publication : 1997

Copies . 1000

Price : **Rs. 50/-**

This book is Published with the Financial Assistance of

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

Under their scheme "Aid to Publish Religious Books"

ప్రతులకు :

1. విశాలాంధ్ర పబ్లిషర్స్,
2. శ్రీ వై. రాధాకృష్ణయ్య,
   Insta Images
   Hotal Dwaraka Buildings,
   Lakdikapool,
   Hydarabad.

Printed at :

Lakshmi Graphics.
48-B, Ramanuja Iyer Street,
Chennai-600 021.



ఎక్కడో ఊర్ధ్వలోకాల్లో
పసిడి వేగిస పూలకాంతితో
వెలిగే త్రికోణదీపాన్ని
నా హృదయద్వారం గడపలో నాటిన
ధర్మపత్ని

**శ్రీమతి శాంతకుమారికి—**

శాంత సితబిందు కర్ణికాచారు వగుచు
అష్టదళ పద్మసిందూర వృష్టియేదొ
ఆత్మలోయల లోతులయందు కురియు
నేను నీవన్న చీకట్లు లేనిచోట

# కృతజ్ఞతలు

అల్పకాలవ్యవధిలో ముద్రణ పూర్తి చేసిన
లక్ష్మీ గ్రాఫిక్స్, (మద్రాసు) అధినేత
మిత్రులు శ్రీ బ్రహ్మంగారికీ,
ముద్రాశాల కార్మిక సోదరులకు
కృతజ్ఞతా సహస్రం.

— రచయిత.

# విషయానుక్రమణిక

# "ఆత్మనః కళాం వందే"

సర్వస్యాత్మ స్వరూపం, ముకుర నగరవత్ స్వస్వరూపం, స్వతంత్ర
స్వేచ్ఛాత్మ స్వశక్త్యా కలయతి, ధరణీతః శివాంతం సదాయా
దృగ్దేవీ మంత్రవీర్యం సతత సముదితా శబ్దరాశ్యాత్మ పూర్ణా
హంతానంత స్ఫురత్తా జయతి జగతి సాశాంకరీ స్పందశక్తిః

అని క్షేమరాజు దేవిని స్తుతిస్తూనే ఆమె తత్త్వాన్ని ఆవిష్కరిస్తున్నాడు. ఆమె సదాశివునియందున్న సంపూర్ణ అహంతాభావం. స్ఫురత్త, స్పందము చమత్కార మనీ అన్యనామాలు. ఆమె అద్దంలో నగరంలాగ - జగత్తును తానన్న గోడపై తన రూపే వ్రాసుకుంటున్నది. భూతత్వం నుండి శివునివరకున్న 36 తత్త్వాలూ ఆమే.

ముకుర నగరవత్ - అన్న మాట మాయావాదులది. దానినే గ్రహించి దృష్టాంతంగా ఆ వాదాన్ని పరాస్తం చేశారు కాశ్మీర ప్రత్యభిజ్ఞా దార్శనికులు. (చూ. శివసూత్రాలు - ప్రస్తుత గ్రంథకర్తదే)

ఈ అధ్యాయం రాబోయే గ్రంథానికి భూమిక. హిందూ దేవాలయ వాస్తువు శిల్పవిగ్రహ నిర్మాణం ద్వారా ఆత్మకళా నిష్కృతి ఎలా జరుగుతుందో. శ్రీ జ్ఞాన ప్రసూనాంబిక: శ్రీ కాళహస్తి గుడి నిర్మాణంలో ఆధ్యాత్మికతను అంచనా వేస్తూ తద్వారా పురాణవిద్య ఆత్మకళా స్వరూపానికి పీఠిక కట్టటం ప్రస్తుతాధ్యాయ సారాంశం.

1969లో ఈ గ్రంథకర్త శ్రీ కాళహస్తి కళాశాలలో ఉపన్యాసకునిగా ఉన్నప్పుడు ఆ మహాలయానికి కుంభాభిషేకం జరిగింది. ఆ సంచికకు వ్రాసిన జ్ఞాన ప్రసూన అన్న వ్యాసమే యీ భూమిక.

హిందూ దేవాలయ నిర్మాణం మీద ఎన్నో ఉద్గ్రంథాలు రావటం పండిత పరిచితమే. కానీ యీ వ్యాసకర్తకా నాటికా గ్రంథ పరిచయం లేదు. ఈ వ్యాసం వ్రాయమన్నది ప్రధాన గురుకులులు (పూజారి) కీ. శే. పరశురాము గురుకుల్‌గారు ఏమి వ్రాయాలో తెలియక కొట్టుమిట్టాడుతూంటే ఆ మహాజ్ఞాన స్పందశక్తి అంత

శ్చైతన్యం నుండి ఒక భావకిరణాన్ని పైకి ప్రసరింపజేసింది. ఆ అనుగ్రహ విశేషమే యీ రచన.

జ్ఞాన ప్రసూనమంటే ఆధ్యాత్మిక జ్ఞాన పద్మం. సహస్రారం. నేనెవరిని? అన్న ప్రశ్నకు లభించిన జ్ఞానం పేరే ఆ దేవి. ఆ జ్ఞానమే ప్రసూనం.

తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామపి ఉపరి కమలానాం తవ కళాం
మహాపద్మాటవ్యాం మృదితమల మాయేన మనసా
మహాంతం పశ్యంతో దధతి పరమానంద లహరీం

అంటూ శ్రీ శంకరులు సౌందర్యలహరిలో గానం చేసిన తల్లి.

సూర్యచంద్రాగ్ని రూపమై షట్కమలాల్లో సహస్రారంలో మెరుపు తీగ లాగ అభివ్యాపించిన ఆ చిత్కళను మహాత్ములు దర్శిస్తున్నారట.

ఈ మహాస్తోత్ర భావాన్ని ఆ విగ్రహ-వాస్తుశిల్పి కళామూర్తిగా ఎలా మలిచాడో చెప్పే ప్రయత్నానికిది ఫలితం.

వేద-మంత్రార్థం చెప్పటానికి ఋషులు; ఆచార్యులు రెండు చక్రాల రథాన్ని వన్నారు.

1. పరోక్ష విద్య, 2. నిదాన విద్య (ప్రతీకా విద్య) శబ్ద ధాతు విచారణ చేయగా వచ్చే అర్థం మొదటిది. ప్రసవము ప్రసూ - కనేది; పువ్వం. కాయను-సంతానాన్ని యిస్తున్నది కనుక. ఆ ఫలమే పైన ఉదాహరించిన శంకరుల శ్లోకంలో చెప్పబడింది. రాజసూయము-శబ్దం కూడా 'సూజ్' ధాతు జన్యమే. క్షత్రియుని శరీరం నుండి రాజును కనే ఒకానొక క్రతువది. అని శ్రీ ఆనందకుమారస్వామి గారి మాట. (చూ. శ్వేతచ్ఛత్రం-ప్రస్తుత గ్రంథకర్తదే.) కనుక ఆత్మ అన్న పువ్వు ఫలంగా నీ చేతికందించేది దేవి.

2. నిదాన విద్య - పువ్వు లక్షణం ఉన్మేష - నిమేషాలు. వికసించటం ముడుచుకోవటం. సృష్టిని ఉన్మేషమనీ, ఉద్యోతమనీ కాశ్మీర స్పందశాస్త్ర వాదుల మాట. నిమేషమంటే వికసించిన సృష్టి మరలా తన స్వస్థానానికి తాను పోవటం. ఈ రెంటినీ నిర్వహించేది తానే. ఆరోహణ, అవరోహణ రెండూ తానే నిర్వ

హిస్తున్నది. కనిపించని భావం-తత్త్వం పదార్థంగా వ్యక్తం కావట మున్మేషం. అన్వేషణపరుడైన యోగి లోపలకు ముడుచుకొని స్వస్థానాన్ని ప్రతి+అభిజ్ఞ (re-Cognition) తిరిగి తనను తాను గుర్తెరగటం. రమణమహర్షులు నేనెవరి నన్న గ్రంథ తాత్పర్యం. వారి మార్గం శంకరాద్వైతమైనా - ఇది శాక్తేయమైనా ఫలమొకటే - ఆత్మదర్శనం.

ఆత్మ సృష్టిగా పరిణమించటానికి కారణమైనదీ తానే. ఇచ్ఛా-జ్ఞాన-క్రియా శక్తి రూపిణియై ఈ సమష్టి దశనుండి వ్యష్టి దశలో భక్తుని ఆత్మను-పద్మాన్ని వికసింపజేసేది తానేనని శ్రీ విద్యా తంత్ర సంప్రదాయం. శ్రీ అరవిందులూ నేడిదే అన్నారు.

'A mother wisdom works in Nature -
To pour delight on the heart of toil and want
And make dumb matter Conscious of its god"

(చూ. 'సావిత్రి').

కనుక వికాసమన్నది పుష్పగుణంగా, ప్రతీకగా గ్రహించి విచారించాలి. తప్ప వాటికి వాచ్యార్థం భౌతిక - చారిత్రకార్థాలు లేవు. వెతికితే ప్రయోజనం పరిశోధన పరిధికే ఒరుగుతుంది తప్ప 'విమర్శ' (దేవి) పరిధిలోకి రాదు.

సమష్టి దశలోని మహాపద్మం విశ్వం. ధాత్రి అంటే పద్మమనే అర్థం. వ్యష్టి దశలో సహస్రార కమలం.

మెదడు క్రింది భాగమునుండి గుదస్థానము వరకు మానవ శరీరమున కాధార మైన వెన్నుపాముున ఆరు చక్రాలున్నవని యోగ శాస్త్రం. అన్నిటి కాధారం మూలాధారం. ఇది గుద స్థానం. జననేంద్రియము క్రిందుగా స్వాధిష్ఠానం. నాభి మణిపూరము. హృదయ మనాహతము. కంఠ మూలమున విశుద్ధము. భ్రుకుటి ఆజ్ఞ, మాడుపట్టు సహస్రారము, వేయి రేకుల పద్మము. ఇదే శ్వేత పద్మము. జ్ఞానపద్మము. ఈ శ్వేతపద్మం దైవ స్థానం. ఇందుకే పద్మం దేవతల కాసనంగానో, పాదపీఠంగానో, దృశ్య కళల్లో గమనిస్తున్నాము. ఈ పద్మ వికాసం పేరు ముక్తి. దీని పేరు దర్శనం. జ్ఞాన ప్రసూనాంబిక అంటే తెలివి పువ్వునిచ్చు తల్లి. తెలివిని పువ్వుగా వికసింప చేసేది ఆధ్యాత్మిక జ్ఞానమే ప్రసూనము - అదే తల్లి.

మూలాధారం పృథ్వీ తత్త్వం. ఇవి ఘనీభూత భౌతిక ద్రవ్య స్థితి పైకి పోయిన కొలది జల-అగ్ని-వాయు-ఆకాశ తత్త్వములు స్వాధిష్ఠానాదులు. ఈ భౌతిక సృష్టి కాధారములైన పంచ భూతములే చక్రాలు. ఇలా సృష్టి చేస్తూ వచ్చి దేవి మూలాధారంలో మూడున్నర చుట్లు చుట్టుకుని సర్పాకారంలో బ్రహ్మద్వారంలో తలదూర్చి నిద్రిస్తున్నదట. అంటే జ్ఞానకమలం ముడుచుకోవటం. అప్పుడు జాగ్రదవస్థ. అంటే లోకం. జ్ఞానకమలం వికసించటం తత్త్వ దర్శనం. అపుడీ లోకము లేదు కాబట్టి దేవి క్రిందికి మాయగా సృష్టి నిర్మాణశక్తి వచ్చినది. ఆ మాయ ఒక కొన. పైకొన జ్ఞానశక్తిగా లోకానికి, వెన్నునకు ఇరువైపుల నున్నది. కుండలిని అంటే కుండలీకరిస్తున్నది. దేనిని? దివ్య జ్ఞానాన్ని. ఇంతేకాక అవ్యక్త-అనంత - నిర్గుణ తత్త్వాన్ని చీల్చి వ్యక్త శాంత సగుణ భౌతిక ద్రవ్యాలుగా చేసే శక్తి మాయాశక్తి = కొలుచునట్టి శక్తి (measruig out Principle) మాయ. కొలతకు లోగినది సాంతము. అందనిది అనంతం నిర్గుణం. జ్ఞానశక్తి సహస్రారం నుండి దిగిదిగి సాకార సాంత ద్రవ్యమయ లోకాలను నిర్మించింది. దీనికి చివరిలోకం భూమి. అంటే ఘనీభూత ద్రవ్యం ఈ కుండలిని పైకి పోవటం లయమార్గం. ఆరు చక్రాల వరకే దేశకాలాలున్నవి. సహస్రారం వాని కతీతం. ఇది పార్వతీ పరమేశ్వర ద్వంద్వమునకు నివాసం.

వెన్ను కెడమప్రక్క ఇడానాడి(గంగ). కుడిప్రక్క పింగళనాడి(యమున), వెన్నుపూసల నడుమ సుషుమ్న నాడి (సరస్వతి) అన్న మూడు నాడులు మూలాధార ఆజ్ఞా చక్రాలను కలిపి కట్టిన త్రాళ్ళు. ఇవి స్థూలస్వరూపాలు కావు. భౌతిక దృష్టి కందనివి. యోగదృష్టికి మాత్రమే తోచేవి. ఈ మూడు నాడులు భ్రుకుటిలో సంగమిస్తున్నవి. ఇదే త్రివేణీ సంగమం. సుషుమ్న క్రింది ద్వారమే బ్రహ్మ ద్వారం. యోగి ప్రాణాయామాది అభ్యాసాలతో నిద్రించే కుండలినిని లేపితే ఆమె ఊర్ధ్వముఖంగా గమిస్తూ ఆరు చక్రాలను భేదించుకుంటూ పోయి సహస్రారంలో వ్యక్తమైన శివునితో సమ్మేళన మందుతున్నది. ఈ ఊర్ధ్వ గమనమే లయయోగం క్రిందికి ప్రసరించటం సృష్టి. ఇది వ్యష్టి రూపం. దేనికది వేరుపడ్డ దశ. పైకి పోవటం సమష్టి అన్న ఏకమైన అద్వైత స్థితి. ఇదే జ్ఞానమంటే. అది బంధము. ఇది ముక్తి. లయ యోగమే కుండలినీ యోగం. ఇది పైరీతిగా జ్ఞానంలో పర్యవసిస్తున్నది. శక్తి తత్త్వాన్ని ఆరాధిస్తున్నది. ఇందుకే భక్తునకు జ్ఞానమే తల్లి.

పైనుండి క్రిందికెలా రావాలి? ఇది సమష్టి దశలోని శివుని ప్రశ్న. క్రిందికి వచ్చిన నేను పైకెలా పోవటం? ఇది వ్యష్టి దశలో జీవుని ప్రశ్న. రెంటికి ఒకటే సమాధానం. జ్ఞానమొకటే మార్గం. దేవికి 'త్రిశికా' అన్నదొక నామం. (త్రి+శిఖా) మూడు శక్తుల కధీశ్వరి. ఆ మూడు ఇచ్ఛా-జ్ఞాన-క్రియా శక్తులు అని మహామహేశ్వరాచార్యులు శ్రీ మదభినవ గుప్తపాదులు పరాత్రిశికా వివరణంలో అన్నారు.

ఈ మూటికీ ప్రతీక త్రిశూలమని వారే. సృష్టి వాంఛ, ఇచ్ఛ. పరతత్త్వంలో ఈ స్పందం కలిగితే ఆతాలి కదలిక పేరు ఇచ్ఛాశక్తి.

నిర్మాణ సూత్రం :- మార్గం చూపిన శక్తి పేరు జ్ఞానశక్తి. సృష్టించటం క్రియాశక్తి వంతు. సృష్టి యిలా వ్యష్టిగా-భేదాత్మకంగా నిర్మించటానికి పథక మెత్తిన దేవి పేరు జ్ఞానప్రసూనాంబిక. ఇది సృష్టిగా పూర్వము పరతత్త్వమన్న బిందువు లోపల ఎక్కడనో కదలిన కదలిక—దానిని పొందిన మనస్సు. అదీ, కలవాడూ వేర్వేరు కాదు. ఇద్దరూ ఒకటే. మన ఊహాపోహాలు—అవి జరిగే మనస్సూ మనమే. ఇందుకే శక్తికి-శక్తిమంతుడు-శక్తి గలవాడైన శివుని కభేదం. రెండూ రెండు తత్త్వాలు కావు. కలిసి సంపూర్ణ తత్త్వం. అతనిలోని స్వాతంత్ర శక్తి. సకలము నిర్మించు మహాశక్తి దానికడ్డం లేదు. అదే స్పంద శక్తి. అది లేనిదే సృష్టిలేదు. ఇందుకే ఆదిశంకరులు శివశక్తి సమ్మేళనంచేతనే సృష్టి జరుగుతూందని సౌందర్యలహరి ప్రథమ శ్లోకంలోనే అన్నారు కదా!

లయ యోగంలో యోగి భౌతిక మాయా తత్త్వాన్ని జ్ఞానతత్త్వంలో లయిస్తున్నాడన్నాం కదా! ఇది జ్ఞానమార్గంలో కాబట్టి శివుని జీవుని చేసేది. జీవుని శివుని చేసేది జ్ఞానశక్తి కనుకనే జ్ఞానప్రసూనాంబిక అంటే ఇరువురను కలిసి కట్టిన మహాశక్తి త్రెంచరాని, తెగని సూక్ష్మ సూత్రం. దాని పేరు కుండలినీ శక్తి. అది బిసతంతు తనీయసి. అది సన్నని తామర పోగంత.

శివ ద్వంద్వానికి నివాస స్థానం కైలాసం. అది తెలుపు. శీతము. అంటే సహస్రారం. దీనిని చంద్రమండలమనీ, అమృత సముద్రమనీ తత్త్వగ్రంథాలు వర్ణిస్తున్నవి. అది తెలుపు. చల్లనిది. దివ్యచైతన్య స్థానం. శుద్ధ సత్త్వోపేతమైన మనస్సునకు నిదానం-ప్రతీక కైలాసం. శ్రీ కాళహస్తి దక్షిణ కైలాసం. అంటే జ్ఞానక్షేత్రం. సహస్రారం. అందుకని ఆ తల్లి జ్ఞాన ప్రసూనాంబిక.

కైలాస శబ్దార్థమేమిటి?

(1) కేళీ సమూహం కైలము. దానికాశ్రయమైనది కైలాసము.

(2) శిఖర భాగమందు శివద్వంద్వము యొక్క లాస్యము (నృత్యము) కలది.

(3) జల భూములందుండు స్ఫటికము కైలాసము. ఇట్లు లింగాను శాసనము నిర్వచిస్తున్నది.

ఆ నిత్యద్వంద్వక్రీడయే సృష్టి. స్థితి లయాదులు. అదే లాస్యము. నాట్యము శుద్ధానంద సంకేతం. (ఇందుకే నాట్యమే రసమని గుప్త శ్రీపాదుల దివ్యవాణి ఆలంకారిక దృష్టితో ఆవిర్భవించింది. భారతీయ కళల్లో రసమంటే నాట్యమే) ప్రతి శిల్పమూ భంగిమా సుందరమే. స్త్రీ పురుష విగ్రహాలన్నీ ఏదో ఒక భంగిమతో కూడుకొన్నవే. జ్ఞానప్రసూనాంబికా విగ్రహం త్రిభంగిమా మనోజ్ఞం. స్త్రీ సౌందర్యమునకు త్రిభంగిమ నొక దివ్యసంకేతంగా నిర్మించుకొన్న కళాతపస్వి భారతీయుడు. త్రిభంగిమలో తామరతీగ వంపు లున్నవి. భౌతికదృష్టితో యివి స్త్రీతనూ సౌందర్య వ్యంజకములు. తాత్త్విక దృష్టితో జ్ఞానప్రసూనపుకాడ ముచ్వంపులు, త్రిగుణములకు త్రిశక్తులకు నిదాన ములు. త్రిభంగిమ సౌందర్య ప్రతీక. అదే దేవీతత్త్వమని పూర్వమే చెప్ప బడినది. ఈ దేవీ విగ్రహ మెంత సుందరమైనది! జ్ఞాన కమలము విచ్చుకుంటే దర్శింపబడ్డ తత్త్వమంత సమ్మోహకంగా వుంటుంది కాబోలు! ఈ సూక్ష్మతత్త్వ మూర్తి అంత జగన్మోహనంగా వుంటుందేమో! ఆ తెలియని దానికీ విగ్రహం ప్రతిమ-మూర్తి!

తత్త్వం స్ఫటికం వంటిది. స్వచ్ఛత కది ప్రతీక. లోకం రంగు కలది, ఇదీ జపాకుసుమమువలె ఎఱ్ఱనైనది. దీని సంసర్గమున దానికీ - తత్త్వమునకూ రంగంటినది కాని దానికి సహజంగా రంగు-రుచి-వాసనలు లేవని చెప్పే వేదాంత వాక్యం ప్రసిద్ధమే. కాబట్టే కైలాసమంటే దేశ కాలాతీత శుద్ధ చైతన్య నిలయం, ఇది శ్రీ కాళహస్తి. దీనిని అంటే లయ యోగ దృష్టిని—దానికి ఫలితమైన జ్ఞాన ప్రసూని దర్శనమునూ ఈ దేవాలయ నిర్మాణ పద్ధతి క్షేత్రము యొక్క ఉనికీ సూచిస్తున్నది.

సువర్ణముఖరి ఉత్తరవాహిని—అంతర్వాహిని. దీనికి తూర్పున (కుడి ప్రక్కన) గుడి ప్రథమద్వార ముత్తరదిశన, లోగుడికి గుమ్మము దక్షిణదిశ, స్వామి పశ్చిమ ముఖుడు కాగా దేవి తూర్పుమొగమై ఉన్నది. దేవాలయ ప్రాంగణంలో ప్రథమమూర్తి పాతాళ విఘ్నేశ్వరుడు. దాని కెదురుగా నదికి దారిగా ఒక ద్వారం, చివరి మూర్తి షణ్ముఖుడు. తదుపరి ప్రదక్షిణ క్రమాన దేవి, చివర శివతత్త్వం. ఈ నిర్మాణం లయ యోగ విషయాని కనుగుణంగా ఉండడం ఆశ్చర్యం. క్షేత్ర మంటే ప్రకృతి—శరీరం. ప్రకృతి శివుని శరీరం. ఇది సమష్టి దశ. మనకు శరీరం. ఇది వ్యష్టి దశ. దేవుని యొక్క ఆలయం దేవాలయము, ఎవడు దేవుడు? శివుడా? జీవుడా? ఇర్వురున్నారు గనుకనా? ఉన్నారనుకొంటే అప్పుడొకనికి శరీరం గుడి, మరొకనికి ప్రకృతి. ఇర్వురొకటే యనుకుంటే శరీరమే గుడి. గర్భగుడి హృదయం లేక సహస్రారం. అక్కడ శుద్ధచైతన్య మున్నది. లోరూపు చూడలేక గుడికి వెళుతున్నాం. కాని అదీ యోగాభ్యాసమే. కనుక విధిమైనది, అది సంకేతం. దేనికి? లోచూపునకు. చక్రాలు లోనున్నవి కదా! వాటి వైపు చూపు త్రిప్పుకోటానికి. ఈ దృష్టిని ఈ గుడి బోధిస్తూంది. అంటే సాంతరమైన భావం బాహిరమైన క్రియగా రూపొందుతున్నది కదా. అట్లే క్షేత్రం = శరీరం. కాబట్టి రెండూ ఒకటే! ఇందుకే ఇంటికంటె గుడి పదిలం. ఆధ్యాత్మిక భద్రతాస్థానం గనుక. విగ్రహం మనలో లోపలి ఆత్మకు మూర్తి.

సువర్ణమనగా మంచి కాంతి—రంగు గలది. బంగారం ముఖరము = మ్రోత, మ్రోగేది. సువర్ణ ముఖరి బంగారంలాగ. ఆభరణాలట్లందంగా మ్రోగేది. పతివ్రతలైన[1] స్త్రీ యొక్క బంగారు నగలవలె మ్రోగేదని తాత్పర్యం, ఉత్తర మనగా ఊర్ధ్వము. దక్షిణ మనగా క్రింది. సృష్టి దక్షిణముఖము. లయ ముత్తర దిశ. ప్రవాహం గమనానికి సంకేతం. గమనం రెండు విధాలు. పైకి—క్రిందికి = సృష్టి—లయము.

జగత్తు అంటే గమించేదని. ఎక్కడకు? ఆనందము వైపున కని శ్రుతి. జగత్తునకూ నదికీ పోలిక. ఊర్ధ్వగమనం యోగమార్గం. కుండలిని పైకి ప్రాకటమే ఊర్ధ్వవాహిని. ఇది స్వర్ణముఖరి. ఇది అంతర్వాహిని. సరస్వతివలె, ఇది యోగశాస్త్రంలోని సుషుమ్న. పైకి కనిపించదు. ఇడాపింగళలే సూక్ష్మములు కాగా

1. జ్ఞానదాయిని. ఉమ ఇంద్రునకు ప్రత్యక్షమైనప్పటి మంత్రవాక్యం—
"బహుశోభమానాం = ఉమాం = హైమవతీం."

ఇది మరీ సూక్ష్మం వెన్నులో నుండి ప్రయాణిస్తున్నది. కనుక అంతర్వాహిని. లేక సుషుమ్నలో నుండి పైకి పోయే కుండలినియే అంతర్వాహిని. ఎట్లన్నను ఒక్కటే. కుండలిని ఊర్ధ్వగమనం చేసేవేళ విచిత్ర ధ్వనులు వినిపిస్తాయట. అది ప్రేమ కనుక ఝుస్ అన్న ధ్వనిగా కవులు చెప్పిన మాట.

నది బుస బుస పొంగుతుంది. రెంటిలోనూ 'బుస' వాదమున్నది. కాక కుండలినీ నాదం భ్రమర నాదం. భమ్-మ్-మ్ వంటిదని యోగగ్రంథములు వర్ణిస్తున్నవి. సువర్ణంలాగా మ్రోగటమంటే నడక సవ్వడి కదా. లేక సువర్ణమనగా మంచి అక్షరము. దేవి సర్వవర్ణాత్మక, సర్వమంత్రాత్మక. ఇందుచే కుండలిని నిలా షట్చక్ర నిరూపణమన్న గ్రంథము వర్ణిస్తున్నది.

"కుండలి పైకి మదించిన తుమ్మెదల మ్రోతతో ఎగబ్రాకుతుంది. ఆమె కోమల కావ్యరచనగా ఆవిర్భవిస్తున్నది. ఆమె మూలాధార గహ్వరంలో ఉన్నది" దీని వ్యాఖ్యలో వ్యాఖ్యాత కాళీచరణుడు "ప్రాణుల దేహ మధ్యమందున్న కుండలిని సర్వవర్ణస్వరూపిణియై గద్య పద్య భేదములతో నావిర్భవిస్తున్న" దన్నాడు. (చూ. Serpent Power. p.p- 225-26.)

అక్షరం జన్మించటానికి ముందు నాదం పుట్టింది. అది సామాన్య స్పందన, స్పందమంటే కదలిక కనుక దీని నుండే నాదం పుట్టింది. సామాన్య నాదము (Universal Sound) ప్రత్యేక ధ్వని (Particular Sound) గా ఏర్పడి విభక్తం కావడమే అక్షరజన్మ. కాబట్టి సామాన్య స్పందము నుండి అక్షర సమామ్నాయం పుట్టింది. సర్వబీజాక్షరముల చివర బిందు ధ్వని-మ్ధ్వని—ఉన్నది. (ఓమ్-ఐమ్-హ్రీం-శ్రీం) ఆ సామాన్య నాదం అవ్యక్త స్పందం. కుండలిని నడకల సవ్వడి, సువర్ణమంటే ఓంకారం. దాని నుండి సర్వాక్షర సంపుటి సర్వ జగత్తు పుట్టినది. ఈ సామాన్య స్పందము లేక నాదము నది యొక్క కదలికలో నున్నది. అలల కదలికలో మ్—మ్ ధ్వనియే బిందునాదము. మకార ధ్వని. కదలిక నుండి నాదము పుట్టిందన్న సృష్టి తొలిదశను సూచిస్తున్నది. స్తబ్ధసలిలము ఏకార్ణవము—సృషికి పూర్వమందున్నదట. అందులో క్షోభ పుట్టి స్తబ్ధసలిలము క్షుబ్ధమై విశ్వావిర్భూతి జరిగినట్లు వేదం. ఆ క్షోభ పేరే స్పందము. దాని ధ్వని సామాన్యనాదము. అది భౌతిక జలచలనమున నున్నది. కుండలిని నడక సూక్ష్మదశ.

దానికే భౌతిక సంకేతం చెప్పుకుంటున్నాం. కనుక జలగమనంలోని నాదమే సూక్ష్మమైన కుండలి నడక సవ్వడి. దీనినొక మహాత్ముని దివ్యశ్రవణమిట్లు ధ్రువపరుస్తున్నది.

"When rightly uttered this great Syllable (ఓం) has an awe—inspiring effect As I heard this Mantra Chanted by some hundred Buddhist monks (one after another) in a Northern monastery, it seemed to be the distant murmuring roll of some Vast Cosmic Ocean."

(Śakti Śākta p 489)

ఇట్లే 'వర్ణమాల' (garland of letters) అన్న గ్రంథ పీఠికలోనూ ఇతడే "సముద్ర ధ్వనిలో మంత్రనాదము విన్నాను" అన్నాడు. మంత్రధ్వనికి జలధ్వనికి సంబంధముంది. కాబట్టి సువర్ణముఖరి అంటే మంత్రనాదం.

ఇంకా సువర్ణముఖి అంటే సువర్ణధ్వని ముఖంగా కలది లేక ముఖము నందున్నది అంటే పై అర్థమే కాక సువర్ణము-బంగారుకాంతి ముఖమునందు కలదని సమన్వయించుకోవచ్చు.

వెన్నుపాముస నొక విధమైన గోధుమవన్నె పదార్థ మున్నదని యోగ శాస్త్రమూ, అధునిక విజ్ఞానశాస్త్రమూ చెప్పినట్లు గురువులన్నారు. అదే మెదడులో వున్నదట. వెన్నుపాము చివర ఇది ఎక్కువగా వుంటుందట. అది సూక్ష్మపదార్థం. వెన్నును మేరుపర్వతమనీ మేరు దండమనీ అంటారు. అంటే బంగారుకొండ ఎందుకంటే బంగారుద్రవమందున్నది కనుక. ఇది సర్వదేవతలకు నిలయం. ఇదే పినాక మన్నాం. త్రిపురాసుర సంహారంలో దీనినే శివుడెక్కుపెట్టింది. తారక సంహారంలో శివుని కుమారుడు దీనినే వాడుకొన్నాడని పురాణం. యోగి దీన్ని అధికం చేస్తాడట. పై కథలలోనిదే గుట్టు. కాబట్టి సువర్ణముఖి అంటే మేరు పర్వతం. పినాకము. వెన్నుపాము. దీన్ని తెనుగున 'మొగిలేఱు' అంటారు. మొగలి పువ్వులోని సువర్ణకాంతిని గ్రహిస్తే మొగిలేరంటే సువర్ణకాంతి గల నది. అనగా వెన్నుపామని అర్థం. కానీ సంస్కృత భాషలో నున్న ఆ మాటలోని గూఢార్థ మిందులో రాదు. అదే దేవతా భాష అంటే. శబ్దమును విచారిస్తే అది తాత్త్వికరహస్యాన్ని విప్పుతుంది. ఆ శబ్దం దేవతా శబ్దం. దేవత అంటే శక్తి—

భావం. దానిని స్పృశించే భాష దేవతాభాష. సంస్కృత వరాహావతారం. పందికథ కాదు. వరాహమంటే పందికాదు. దాని ధాతువును విచారిస్తే మహార్థం వ్యక్త మౌతుంది. ఇంతకూ సువర్ణముఖరి తెలుగులో మొగిలేత్తైనదంటే మొగలి=సువర్ణము. ఎలా? మొగలి కాంతి సువర్ణకాంతే కనుక. పైగా 'కాంచన కేతకి' అని ఒక మొగలిభేదమున్నది. బంగారు మొగలి అని అర్థం కనుక ఇలాగూ చూచుకోవచ్చు.

(ఆ నది కిరువైపులా మొగలిపొద లుంటాయి కనుక మొగిలేరంటారు)

స్వామి పశ్చిమముఖుడు. పైన చెప్పిన మూలాధారం నుండి పైకి వచ్చే స్వర్ణముఖిని—కుండలిని చూడటమన్నమాట. పశ్చిమ దిశ క్రిందివైపు. దాని కెదురుగా నిల్వడమంటే జీవుని లేక సృష్టిని ఉద్ధరించటాని కున్ముఖుడు కావటం కుండలిని ఉత్తరానికి లేక తూర్పునకూ చూస్తుండగా ఈయన ఆమె వైపుకు తిరిగి ఉన్నాడు. జ్ఞానప్రసూనాంబిక తూర్పుమొగమై వుండడమంటే స్వామి కెదురుగా రావటం. ఇలా దంపతు లిరువురు 'ఎదురు బొదురు'గా వున్నారు. మూలాధారంలో కుండలినీ శక్తి పైనుండి క్రిందికి వస్తూ తన శక్తులను తానే కుండలీకరించు కుంటూ వచ్చి సృష్టియైనది. కాబట్టి కుండలిని=మాయాశక్తి. ఈమె యోగిచే నిద్ర మేల్కొలుపబడి పైకి వచ్చి వచ్చి జ్ఞానకమలమై వికసిస్తున్నది. కనుక సృష్టికి—జీవునకు క్రింద మాయ పైన జ్ఞానశక్తులున్నవి. వెన్నుపామునకు మొదట కుండలిని—సువర్ణముఖి—పైన జ్ఞానప్రసూనాంబిక ఉన్నారని అర్థం. రెండూ ఒకటే. ఒకటి స్థూల వికాసం=మాయ. రెండు సూక్ష్మవికాసం=జ్ఞాన శక్తి. రెండూ రెండు రకాల ఉన్మేషాలు. ఇవే పైన పద్మములనబడ్డవి. కాబట్టి 'ఏరు' (కుండలిని) జ్ఞాన శక్తి రెండూ స్వామి కున్ముఖములుగా వునవి. (ఇక్కడ ఉత్తరము—తూర్పు ఒకే దిశను అనగా ఊర్ధ్వదిక్కును సూచించు నట్టివి) పశ్చిమం క్రింది చూపు. కావున దాంపత్యంలో వలె ఒకరి మొగము ఒకరు చూచుకోవటమన్నమాట. ప్రకృతి—పురుషులు నిత్యమూ భూమ్యాకాశాల్లాగ చూచుకోవడం.

ఇరువురూ ఒకరి ప్రక్క ఒకరున్నారు. ఇద్దరూ ఒకరి కుడిప్రక్కన మరొకరున్నారు.




శివశక్తి ద్వంద్వం సమానసంబంధమందున్నదని భావం. రెండూ మహాశక్తులు సమంగా వున్నవి. అంటే సృష్టిలేదు. ఇది విశ్రాంతి స్థానం. ఇదే ముక్తి. కుండలిని సహస్రారంలో శివునితో మేళవించటం, రెండూ సమాన దశను పొందటం, శక్తి పెరగటం సృష్టి వికాసం. సమత విషమత్వమందటం సృష్టి. విశ్రాంతి దశ నిష్పంద దశ. కదలిక లేని చెఱువు వంటిది. కదలిక లేని దీపశిఖ వంటి దశ, కుండలిని వచ్చి స్వామితో ఏకమైన దశ. స్వచ్ఛమైన జ్ఞాన పరమార్థ దశ. ఇంతే కాక కుడిప్రక్క శక్తి వికాసదశకు సూచన. క్రియ కున్ముఖమైన దశ. మనుష్య శరీరంలోనూ కుడి ప్రక్కకు ఎడమ ప్రక్కకు భేదమున్నది. కుడి పురుషత్వము. ఆక్రమణ సామర్థ్యము. పటుత్వమునకు ప్రతీక. ఇక్కడ ఇద్దరు కుడిప్రక్క నుండటమంటే ఇద్దరకు ప్రాధాన్యమున్నది. అన్ని క్షేత్రాలలోనూ ఇలా వుండదు. ఇందుకే ఇది మహాక్షేత్రము.

పాతాళ విఘ్నేశ్వర స్థానం. మూలాధారం. ఇది పృథివీ తత్త్వం. ఇక్కడ బీజాక్షరం 'లం'. ఇది ఏనుగుమీద ఉంటుందట. ఏనుగంటే బలసంకేతం. స్థూల తత్త్వానికీ—విస్తృతికీ సంకేతం. వినాయకుని పొట్ట పెద్దది. అది విస్తృత

స్థూలదృష్టికి సంకేతము లేక యోగికి కుండలిని[1] లేచిన దశలో పొట్ట ఉబుకు తుంది. పెద్దదవుతుంది. ఈ పొట్ట—వినాయకుని పొట్ట. పాతాళ విఘ్నేశ్వరుడు సువర్ణముఖీ ఒకే మట్టంలో (level) ఉన్నారు.

కుమారస్వామి స్థానం ఆజ్ఞాచక్రం. ఇక్కడ నున్న దేవి చిత్రవర్ణాత్మిక అని చెప్పబడుతున్నది. అనేకములైన రంగులు కలది. నెమలి ఈకలు—చిత్ర వర్ణములు కలది—నెమలి కుమారుని వాహనం. విశుద్ధ చక్రమే క్రౌంచపర్వతం. దానిని భేదించినవాడు కుమారుడు. క్రౌంచ రంధ్రము నుండి హంసలు భూమిపైకి వస్తాయన్న కవి సమయంలో ఈ యోగశాస్త్ర రహస్యమే ఇమిడి ఉన్నది. విశుద్ధ చక్రమే భారతీస్థానము. ఆమె వాహనమే హంస. అంటే జీవుడు. అతడు పైకి పోవటం క్రౌంచ భేదనం విశుద్ధిని చీల్చటం. ఆజ్ఞ యందున్న దేవి ఆరుముఖాలు కలది. ఇదే కుమారస్వామి. ఆజ్ఞ అంటే సహస్రారంలోని గురుపైన పరమేశ్వ రాజ్ఞ ఇక్కడ వినిపిస్తుంది కనుక ఆ పేరని శాస్త్రం. కాని ఆ+జ్ఞ అంటే పరోక్ష విద్యాదృష్టితో చూస్తే గొప్ప జ్ఞానం అని అర్థం వస్తుంది. (జ్ఞ=తెలివి. ఆ= మిక్కిలి) కుండలినీ దేవి ఇక్కడకు వచ్చినంతనే జ్ఞానశక్తి అవుతున్నది. కనుక ఆజ్ఞాచక్రం చీల్చటం. ఆజ్ఞాకమలం వికసించటం మోక్షమార్గద్వారం తెరువు కోవటం కనుక ఆజ్ఞాచక్రమే ప్రసూనాంబిక. అందున్న జ్ఞానశక్తి ఆ ద్వారం దాటినంతట ముక్తి స్థానమున్నది. ఇక్కడ గుడిలో కుమారస్వామి స్థానం (ఆజ్ఞ) తర్వాత దేవీ శివులు. శివుడు ప్రకాశాంశ. దేవి విమర్శాంశ. రెండూ కలిసి సృష్టి నిర్మాణకారణమని శ్రీవిద్యా గ్రంథాలంటున్నవి. పరంజ్యోతిలో ఆ రెండూ రెండు దళాలు. ఇది సంపూర్ణ తత్త్వం. ప్రకాశ తత్త్వము. నిర్గుణం. జీవుడు దానిని దానినిగా చూడలేక కొన్ని గుణాల నారోపించి చూస్తున్నాడు. ఈ జీవలక్షణ ప్రతిబింబాలే శ్రీ, కాళ, హస్తులు. మూడూ లింగంలో ప్రతిబింబిం చాయి. శుద్ధచైతన్యం జీవస్వరూప గుణాలచే ప్రతిబింబించిందని తాత్పర్యం.

---

1. ఈ విషయం మా గురువులో చూచాను. ఎందుకు మీ పొట్ట ఇంత ఉబికి ఉన్నదంటే వారన్నారు. స్థూల కుండలిని ఉద్బుద్ధ దశలో వున్నదని. తర్వాత సరిగ్గా 12 ఏళ్ళకు ఆ లేచిన కుండలిని స్వస్థానానికి చేరుకోవటంతో పొట్ట ఉబుకు తగ్గిపోతుంది. నేను చూచిందిది. ఇదే సౌందర్యలహరిలో 10 వ శ్లోకంలో వర్ణింప బడింది.

లింగము శుద్ధ చైతన్య సంకేతం. అవి జీవునకు దగ్గరగా రావటమే దీని గుణాలు. పరతత్త్వం జీవునుద్ధరించాలన్న తలంపున ఉన్ముఖం కావటమే లింగంలో ఈ గుర్తుల కర్థం. అట్టి మహాచైతన్యం దర్శింపజేసే జ్ఞానమే తల్లి. ఈమె స్వామి లోని 'స్ఫూర్తి' అని ప్రారంభ శ్లోకమంటున్నది. అంటే 'నేను' అన్న భావమును కల్గించేది. ఆ స్పందము 'నేను' అన్న భావము, కదలిక, తాను అద్దంలో తనను చూచుకుంటూ తానిలాటివాడననుకోవటం నిర్గుణచైతన్యం. విమర్శాంశలో ప్రతిబింబించి తనను తాను చూసుకొని 'నేను' అనుకోవటం, ఇది సృష్టికి ప్రథమ సోపానం. భారతీయ శిల్పంలో స్త్రీ అద్దం చూచుకొన్నట్లున్న బొమ్మ లనేకము లున్నాయి. అద్దం దేవికి ప్రతీక. ఆలయంలో దేవీ అర్చనలో అద్దం చూపించట ముంది. అంటే తన స్వరూపం తాను దర్శించుకోవటం. దాని పేరే ఆత్మదర్శనం, అదే జ్ఞానం. అది వికసించిన స్థితి ప్రసూనం. అదే తల్లి. ఆమె దర్శించటమే తనను తాదర్శించుకోవటం. తనను తాను చూచుకోవటం. తన స్వరూపమును తానెఱుగకొనుట. దీనికి తల్లి అనుగ్రహముండవలె. దాన్నే శక్తిపాతంగా గ్రంథాలు చెబుతున్నాయి. ఆ తల్లి—ఆ పూవు విశ్వమున కెత్తిన తెల్లని **గొడుగగుగాక!**

ఏ మూలంబడి నిద్రపోయెదవొ? గాఢీ అజ్ఞతాహంకృతీ
వ్యామోహాంధ తమస్సు నల్దెసల తీవల్ సాగి పూలయ్యె, నీ
పై మేల్కొక ఉషః ప్రసాధనము లేవమ్మా! జగత్ప్రాంగణ
శ్రీమన్మంగళవల్లి! మేలుకొనవే! శ్రీజ్ఞానసూనాకృతీ!

# 1. పురాణ లక్షణం

క్రీ.శ. 5వ శతాబ్ది నాటి అమరకోశం పురాణ లక్షణ నిర్వచనం చేసింది.

"పురాణంతు పంచ లక్షణం"—అని ఐదు[1] లక్షణాలు మాత్రమే అని ఎందుకు చెప్పాలి—షల్లక్షణాలు (షల్లింగాల్లాగా) చెప్పవచ్చును. సప్త లోకాలుగా—సప్తలక్షణాలుగాను చెప్పవచ్చును. దశ-ఏకాదశ-ద్వాదశ ఏదైనా అనవచ్చు కదా?—పంచ సంధులు-పంచ భూతాలు-పంచ ముఖాలు (శివునకు) ప్ర+పంచ—విషయంగా ఇది విశ్వవ్యాప్తమైన సంఖ్య (లేకపోతే షేక్సుపియర్ నాటకాల్లో పంచాంకాలే ఎందుకుండాలి. మరీ ఆశ్చర్యం—ఒక పాశ్చాత్య నాటక శాస్త్రవేత్త—పతిక్రీడను పంచాంగాలుగా—పంచ సంఖ్యాత్మకంగా అద్భుతంగా వర్ణించాడు (వివరించటం శాస్త్రీయం వర్ణించటం కళాత్మకం)—కనుక పంచ సంఖ్య-ప్రత్యేకార్థం కలదన్న మాట. సరే.

1. ఆ లక్షణాలు—(వివరణ కూడ రకరకాలుగా వుంది. ఇవి ఈ వ్యాస కర్తకు దోచినట్టిది.)

1. సర్గం = సృష్టి.
2. ప్రతిసర్గం = ప్రతిసృష్టి.
3 వంశము—1. సూర్య, 2. చంద్ర, 3. అగ్ని వంశాధికం.
4. వంశానుచరితం - క్షత్రియ (1+2) బ్రాహ్మణ, 3. వంశ విస్తృతి.
5. మన్వంతరం—మహాకాలం.

---

1. ఆధునిక పరిశోధకుల ప్రకారం పురాణ శ్లోకాలు (మొత్తం 18 పురాణాల్లో) 4,00,000.

నేటి పరిశోధకులు ఇందులో 10,000 శ్లోకాలకు మాత్రమే ఈ లక్షణం అన్వయిస్తుందన్నారు.

ఐదు లక్షణాలకే పురాణ వాఙ్మయమంతా ఒదగదు. కానీ అది ప్రధాన లక్షణం. అదే పురాణాన్ని ఇతర వాఙ్మయశాఖల నుండి వేరుచేసేదని మరొక సమర్థన. (చూ. దేవీ మహాత్మ్యం—Thomas B. Coburn—p. 23)

ప్రతిసర్గమంటే—ప్రళయానంతరం జరిగే పునఃసృష్టిగా వ్యాఖ్యాతలు. ఎందుకంటే—పంచబ్రహ్మ సిద్ధాంతంలో అనుగ్రహమన్న పంచమ కృత్యమైన పునఃసృష్టి విషయం చెప్పబడినది కనుక.

ఇదీ అలాగే, కానీకాదు—సృష్టి రెండు దశల్లో జరుగుతుంది. 1. మానస సృష్టి, 2. మైథున సృష్టి. మొదటిది రెండవ దానికి Blue print, నమూనా, మూస-మనస్సు-(ఆలోచన)లో కదిలే భావరూపం. కారణసృష్టి. ఇది విష్ణు మనోగతాంశంగా పురాణాలు. ఆ పథకానుసారంగా నేర్పుగా బ్రహ్మ చేసిన పదార్థ సృష్టి ప్రతిసర్గం అంటే—

బృహదారణ్యకంలో శతరూపా-ప్రజాపతి వృత్తాంతం భావసృష్టి విషయం (తర్వాత[1] పుటల్లో ఇది వివృతమౌతుంది) అది వ్యక్తి మిథున-విషయం కాదు. ఏకమైన పరబ్రహ్మ సృష్ట్యర్థం రెండుగా స్త్రీ-పురుషుల సూత్రాలుగా—చీలిన భావ దశ, ఆభావం వ్యక్తమై స్త్రీ-పుమాత్మకంగా పదార్థ సృష్టిగా పరిణమించడానికి చాలాకాలం పడుతుంది. ప్రతికర్మకు పూర్వరూపం ఆలోచన-మనస్సే కనుక అది కార్యాచరణగా పరిణమించడానికి కాలం పడుతుంది ఇది లోకానుభవమే. మనస్సే లోకం—నీ మనస్సే నీవు-నీ జీవితమూ. తదన్యం కాదు. నీ చుట్టూవున్న వాతావరణమంతా నీ అంతశ్చైతన్యంలోని—సూక్ష్మసంకల్పం సృష్టించుకొన్నదే. ఈ నాటి వాతావరణ కాలుష్యమంతా మానవ మేధా విలసనమే. కనుక సర్గం విష్ణు సంకల్పం, భావరూపం. బ్రహ్మ దాన్ని పదార్థ జగత్తుగా మలిచిన శిల్పి, ఈ విషయమే పురాణాల్లో చెప్పిన కథాసారం.

బ్రహ్మ విష్ణు నాభికమలం నుంచి పుట్టి తన మూలం అన్వేషించి తెలియక శోకిస్తే అగాధ ఏకార్ణవం (ప్రళయ సముద్రం=సృష్టి కారణతత్త్వం)లో తప-తప 'తపస్సు చేయి' అని విన్పిస్తే తపోమార్గంలో విష్ణు నాభిని బ్రహ్మ చేరుకోగా వేదాన్ననుసరించి (సృష్టి, జ్ఞానరాశి) పదార్థసృష్టి చేయమన్న తండ్రి (భావ) ఆదేశానుసారంగా కొడుకు ఈ పదార్థ సృష్టి చేసాడని కథ. భావం పదార్థంగా పరిణమింప చేయటంలో నవదశలున్నాయి. తత్కర్తలే ప్రజాపతి నవకం, నవసంఖ్య సృష్టి

సంకేతం. దశసంఖ్య సృష్టి కతీతంగావున్న తత్త్వ సంకేతం. ఎందుకంటే త్రిగుణాల యొక్క త్రిగుణీకృతి. త్రికోణ త్రిగుణీకృతి—3×3=9—ఇవే నవకోణాత్మక శ్రీవిద్య=సృష్టి విద్య. బిందువు-నిర్గుణం (స్త్రీ పురుష తత్త్వరహిత) తత్త్వం; అవి త్రిగుణాలు కావటం పేరే త్రికోణం, ఇది ప్రథమ వికారం. ఇది మూడు మెట్లమీదుగా క్రిందికి పస్తేకాని పదార్థసృష్టి లేదు. (భాగవత కథ—శ్రీ కృష్ణావతార ఘట్టం) కనుక సృష్టి=9, నవనిత్య నూత్నతాగుణంచేతనూ నవమే. ఇందుకే పురాణాల్లోనూ త్రిగుణాత్మక వివేకముంటే కొన్ని సత్త్వగుణాత్మకాలు కాగా కొన్ని రజోగుణాత్మకాలు, కొన్ని తమోగుణాత్మకాలు. ఇవే మనస్తత్వ శాస్త్రంలోని జాతులు. (Psychological Types) భాషలు-మనుషులు కూడా ఇంతే. కనుక త్రిగుణ త్రిగుణీకృతి ఏకవస్తువు మూడై అది మూడు మూడు దళలుగా అవతరించి పదార్థ సృష్టి కావటం పేరే—సృష్టి విద్యకు సంకేతమే నవ, ఈ ప్రతిసర్గానికి దేశ-కాల-వ్యక్తులు త్రిసంఖ్యాకమైనది ఏర్పడాలి. మన్వంతరం అంటే మహాకాలం. భౌతికకాలానికి మూడుగా పరిగణింపబడే—భూత-వర్తమాన-భవిష్యత్తులు—ఆధారమైన కాలసూత్రం.

వంశం:—బ్రహ్మము ఏకతత్త్వం. అది రెండుగా చీలి బ్రహ్మ క్షత్ర తత్త్వాలేర్పడ్డాయి. బ్రహ్మ పురుషుడు. క్షత్ర-స్త్రీ తత్త్వం. మొదటిది నక్షత్రం. రెండవది క్షత్రం నశించే పరిణామశీలమైన పదార్థ భావమని ఉపనిషత్తుల్లో చెప్పబడింది.

బ్రహ్మమునకు బ్రాహ్మణ క్షత్రియులు అన్నమని కఠోపనిషత్తు. ఏకం ద్వంద్వమైన స్థితి ఇది.

భారతంలో అగ్నివంశ కథనం అరణ్యపర్వంలో చెబ్బబడింది.

వేదరహస్యంలో శ్రీరవిందులు చెప్పారు—వేదంలో తరచుగా కన్పించే ఋషులు సృష్టిలోని మూలభావ సంకేతాలని (చూ. వేదరహస్యం) ఆర్కిటైపల్ ఇమేజెస్‌గా మనస్తత్వ శాస్త్రం పేర్కొంటున్నది.

వంశాను చరితం—వంశం ప్రథమభావరూపం Arche Type. వ్యక్తి రూపాలకు ప్రాగ్రూప స్థితి అది. మనస్తత్త్వ శాస్త్రంలో చెప్పబడిన ప్రాగ్రూపం వాదం ఇదే. తల్లి-తండ్రి అన్న ద్వంద్వం ఏర్పడడం పదార్థసృష్టి కాగా వాటికి

భావ రూప స్థితి—మనోదశ. ప్రతి స్త్రీ ఆదిమ శతరూప. ఇక్కడ ప్రతిపురుషుడు ఆదిమ రూపమైన ప్రజాపతి రూపమే. భావం వ్యక్తీకృతి పొందటం భావసృష్టి పదార్థ సృష్టి కావటం ఈ విషయం పురాణం వర్ణిస్తుంది. కనుక పురాణం అంటే అతి ప్రాచీనమైన సృష్టి కథ. ఏది ప్రాచీనమో[1] అదే నవీనము. ఏకశబ్దంగా గ్రహిస్తే పురాణం అంటే ప్రాచీనం. సమాసంగా గ్రహిస్తే "పురా అపి నవం భవతి" ప్రాచీనమైనా క్రొత్తదే. ఇది భావం. అది పదార్థం. కనుకనే ప్రాచీన భావాలే పునః పునః నూత్నభాషలో వ్యక్తమౌతున్నాయి.

సర్గము-ఆదిమ తత్త్వం. దీనిపదార్థరూపం ప్రతి సర్గము, వంశము భావ రూపమైన దానిని వంశాను చరితంగా—మన్వంతరం ద్వారా-ప్రపంచంగా పదార్థ సృష్టిగా పరిణమింపచేసేది కనుక — సర్గం సూక్ష్మభావం, వంశము-అసూక్ష్మభావం ద్వంద్వంగా—స్త్రీ=(శతరూప) పురుషలుగా (ప్రజాపతి) ఏర్పడిన స్థితి ఇదే బ్రహ్మ (పురుష) క్షత్రతత్త్వం (స్త్రీ)గా చెప్పబడినది.

(వివరాలకు చూ. The Sprintual and temporal Authority in the theory of Indian Government—*by Ananda Kumaraswamy*)

ఇది మన్వంతరం (మహాకాలం) ద్వారా వంశానుచరితంగా (రామ=సూర్య; పాండవ=చంద్ర వంశ కథలుగా) ఏర్పడటం పేరు ప్రతిసర్గం (మైథునీ సృష్టి).

లోకమంటే ద్వంద్వం 1. నివృత్తి ముఖం-బ్రహ్మతత్త్వం (బ్రాహ్మణుడు) వేదాంత, తత్త్వ శాస్త్రమార్గం 2. ప్రవృత్తిముఖం—క్షత్రియుడు (స్త్రీ) రాజనీతి శాస్త్రం (ఇతరాలున్ను) వేదాంత శాస్త్రము రాజనీతి, కామశాస్త్రము విరుద్ధాంశాలు వీని సమన్వయం దాంపత్యం. ఇదే భారతీయ రాజధర్మం పునాదిగా The Spiritual Authority and Temporal Power అన్న శ్రీ ఆనంద కుమారస్వామిగారి గ్రంథం చెప్పింది. ఇదే అర్ధనారీశ్వర తత్త్వంగా మత మారాధించిన మహాతత్త్వం.

---

[1] వేదంలో పురాణశబ్దం ఏకవచనంలో ప్రయుక్తం కాగా రాను రాను బహువచనంలో స్థిరపడటంవల్ల పురాణం ముందుకాలాల్లో ఏకరాశిగా వుండగా వేదవ్యాసుడు (ఈ విద్యా ప్రస్థానానికి మూల ఋషి) 18 గా విభజించినాడన్న ప్రథ పుట్టింది. ఇది పురాణ జన్మగా చెబుతున్నారు. చూ. దేవీ మహాత్మ్య పీఠిక by Coburn. ఈ 18 సంఖ్య యజ్ఞంలో పురోహితులు. యజ్ఞమంటే సృష్టి.

ఇతిహాసం పూర్ణ మానవ జీవితాన్ని ప్రవృత్తి—నివృత్తి ముఖ సమన్వయ రూప పూర్ణవృత్తాన్ని చిత్రిస్తే భారతేతిహాసంలో దైవం మనిషిగా జన్మించి మరలా దైవంగా పైకిపోవడం చిత్రితమైనది. రామాయణం దైవం మనిషిగా వచ్చిన కథ చెప్పి మరలా మనిషి దైవంగా స్వస్థానగతుడైన కథ చెప్పగా భారతం దైవం మనిషిగా వచ్చి నానా యుద్ధాలు చేసి—కర్మప్రవృత్తుడై తుదకు దైవమైన కథ చెప్పింది. అది ప్రవృత్తి—ఇది నివృత్తి. అది ఆత్మ = పదార్థంలోకి అవతరించిన అంశం ప్రధానంగా కలది. ఇది పదార్థగత చైతన్యం మహాచైతన్యంగా పరిణతి నొందడం ప్రధానాంశంగా కలది. అది సూర్యవంశం—ఆత్మ చైతన్యం, ఇది చంద్ర వంశం—పృథ్వీ చైతన్యం. రెండు కలిపి మహాచైతన్య అవరోహణ ఆరోహణల కథ) పురాణం సంపూర్ణ విశ్వచక్రభ్రమణాన్ని వర్ణిస్తుంది. ఈ చక్రంలో పై అర్ధవృత్తం—వంశం; క్రింది అర్ధవృత్తం వంశాను చరితం, భ్రమణం మన్వంతరం, నాభి సర్గం. ప్రతిసర్గం నేమి. ఇది పురాణ చక్రం.[1]

బృహదారణ్యకంలో—ఐతరేయంలో సృష్టికథ చెప్పబడింది. దేవతా సృష్టి చేసిన బ్రహ్మమును దేవతలు పరివేష్టించి మా భాగాలు (అన్నం) మాకివ్వమని అడిగితే పరమాత్మ సృష్టిలో మానవ (జీవ) శరీరాల్లో వారి స్థానాలు వారి కిచ్చాడని. ఈ దేవతా సృష్టి; సర్గం (ఇదొక వివరణం) ఇదే హిరణ్మయాండమైన విశ్వ చక్రంలో పై అర్ధవృత్తం. అదృశ్య కారణభావరూపంలో ముద్దగా వుంటుంది భారతం సంభవ పర్వంలో ఈ కారణ జగత్తే వర్ణింపబడ్డది. మానవ సృష్టి అన్నా ఇదే—స్వర్గారోహణం తుదిమెట్టు. ఆరోహణంలో ధర్మరాజు యమునిలో లీనం కావడంలో ఆత్మపదార్థంలోకి అవతరించి తిరిగి ఊర్ధ్వప్రయాణం చేసి స్వస్థానగతి పొందింది.

ఐతరేయంలో వివిధ చరాచర సృష్టిచేసి చివరకు మనిషిని తన ప్రతి రూపంగా సృష్టించిన ఆత్మ అచేతనమైన పదార్థంలోకి బ్రహ్మరంధ్రం ద్వారా అనుప్రవేశించేసరికి అది—సచేతనమైనదన్న కథ వుంది. ఈ అనుప్రవేశవిద్యలో

---

వేదవిద్య కూడా చక్రరూపముగా అభివర్ణితమైనది. నాభి-నేమి వ్యాసాతే ఋగ్యజుస్సామములు.

పదార్థంలోకి ఆత్మ ప్రవేశించడాన్ని వర్ణించింది. ఇదే సర్గం = దేవతాసృష్టి (విశ్వపాలక శక్తుల) సర్గం. మానవ—జీవపదార్థ సృష్టి ప్రతిసర్గం.

యమ-సూర్య-ప్రజాపతి—వంటి నామాలు ఉపనిషదర్థంలో ఆత్మసంకేతాలు. కఠంలో యముడు ఆత్మతత్త్వ బోధకుడు. పురాణయముడు వేరు. కనుక దేవతలు-మానవులు-జంతువులు (గజేంద్రమోక్షం) రాక్షసులు-రాజులు వేదవేత్తలు ఒకటేమిటి అనంత విశ్వరంగస్థలంమీద—అన్నీ పాత్రలే—అందరూ పాత్రలే. దేశ కాల యవనికపైన జరిగే రంగులరాట్నం వర్ణనం పురాణం. భావం-కాలం దేశ-వ్యక్తి సృష్టి ఈ మూడు పురావస్తు సూత్రాలు. అవతార కథలన్నీ మూల పదార్థం నుండి వస్తూ విశ్వస్థితికి పట్టిన దుర్గతిని తొలగించి మరలా మూలదశకు పోవటం. దీనికి ప్రతినిధులుగా రాజులు-రాజ్యస్థితి రాజనీతి ప్రజాధర్మాలన్నీ పురాణం చెప్పిందే. దుర్గ నగర నిర్మాణ విషయాలన్నీ శాస్త్రవిద్యలన్నీ—అందులోవే. తర్వాత ప్రత్యేక శాస్త్రాలుగా వచ్చాయి లేదా వీటిని సంగ్రహించి పురాణ కవి ప్రజల అందుబాటులోకి తెచ్చాడు. పురాణం ప్రథమంగా ప్రధానంగా ప్రజావిద్య. శ్రోతగ్రామం, వ్యక్త పౌరాణికుడు. ఊరు ఊరంతా శ్రోతే. వాని కందుబాటులోకి మహావిద్యను—అనేక విషయాలు జీవితానికి సంబంధించిన ధర్మాధర్మ విషయాలను—తెచ్చిన ప్రజాకవి పురాణకర్త. భాష సరళం కావటంతో శ్రోతకు విషయం సులభంగా అందుబాటులోకి రావటంవల్ల పైమాటకు ఊత మేర్పడుతున్నది.

## జన్మ

పురాణ ప్రారంభకుడు వేదవ్యాసుడన్న సంప్రదాయోక్తి కర్థమేదని కొందరు విపర్శకులు తర్కించి అవిద్యా వ్యాపకుడతడు కనుక జనకుడు కనుక ఎవర్ు పురాణం వ్రాసినా చెప్పినా వ్యాసుని పేరునే చెప్పడం జరిగిందని ఒక సమన్వయ సూచన చేశాడు ఆచార్య వాసుదేవ శుక్ల అగర్వాలా (చూ. ఆయన మత్స్యపురాణ అధ్యయనం) పురాణంలో పేర్లు వ్యక్తుల పేర్లుకావు. లోమహర్షణుడు—

"ఏయదీ హృద్య మపూర్వం
బేయది —"

ఆ కథ విన్నందువల్ల కలిగేది రోమాంచం: శ్రోత అనుభవంలోని అపూర్వత కది నిదర్శనం. కనుకనే రామాయణాన్ని కుశ లవులు గానం చేస్తే విన్న ధర్మ వత్సలు లయిన మునులు

"అహో గీతస్య మాధుర్యం-శ్లోకానాంచ విశేషతః
చిరనిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితం—అన్నారట

అలా కథ చెప్పేవాడు—వినేవాడు రోమహర్షణులు—అలాగే వేదవ్యాసుడు—అవి బిరుదవాచకాలు.

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్"

ఇది పురాణ స్వభావం—లక్షణం.

వేదార్థం, యోగదర్శనం (చూ. శ్రీ అరవిందుల వేదరహస్యం ఉపనిషద్భాష్యాలు) అది అనుభవైక వేద్యం. దానిని కథారూపంతో సులభతరం చేసి—విస్తరించి వ్యాఖ్యానించటం పురాణ విద్యా లక్షణంగా ప్రాచీనులు భావించారు కనుకనే ఇలా చెప్పబడ్డది

యో విద్యాత్ చతురోవేదాన్, సాంగోపనిషదో ద్విజః
న చేత్ పురాణం సంవిద్యా న్నైవ సస్యాత్ విచక్షణః
ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్
బిభ్యతే అల్ప శృతాత్ వేదోమామయం ప్రహరిష్యతి.

వేద వేదాంగవేత్త కూడా పురాణవిద్యావేత్త కాకపోతే విచక్షణ జ్ఞానముండదు. ఇతిహాస పురాణ విద్య వేదవిద్యకు విస్తృతరూపం కనుక దీనిద్వారా వేదదర్శనం కల్గుతున్నది. ఇందుకే వేదం అల్పశ్రుతుడంటే భయపడుతున్నది—

1. "దేవానాం పూరయోధ్యా" 2. ఊర్వశీ పురూరవ కథ పైదానికొక ఉదాహరణ

"The Brahminical idea is an Indian city of the Gods"—as devanagari the name of the Sanskrit script. suggests the building of that city anew is the constant task of civilisation and though the details our plans may change and the contours of our buildings, we may learn from India to build on the froundations of the religion of eternity.

—*The Dance of Siva*—p 23.

ఆ దేవనాగరీ వాదం భారతీయ క్షాత్రవిద్య+ఆధ్యాత్మ విద్యా స్వరూపమైన రాజధర్మం నుండి ఏర్పడినది. ఐరోపాలో ప్లాటో నుండి మార్క్సు—మొదలైన

వారంతా ఈ ఆదర్శ రాజ్యవాదాన్ని ప్రతిపాదించినవారే. క్రీస్తు చెప్పిన 'నారాజ్యం స్వర్గం(లో వుంది) అన్నదాని కేవల విరుద్ధవాదం మార్క్సు ప్రతిపాదించినా—ఈ ఆదర్శ రాజ్యవాదం నుండి ప్రాచీన కావ్యాల్లో నగర వర్ణన వచ్చింది. అయోధ్య-ద్వారక-కాశీ మొ॥నవి వైదిక సంస్కృతీ నిర్మాతలు చెక్కిన నగరాలు. వీటికి ప్రాగ్రూపం స్వర్గం-వైజయంతి-సుధర్మ. బుద్ధదేవుని నివాసం—తిరుగాడిన పవిత్ర క్షేత్రాన్ని వైశాలి—కుశస్థలి మహానగరాలను బౌద్ధశిల్పి అమరావతి వంటి చోట్ల శిల్పించి శిలాస్థగితం చేయటంలో తాత్పర్యం - భావం - భూలోక స్వర్గ నిర్మాణం, ఆదర్శ చక్రవర్తి ధర్మం కనుకనే బుద్ధ-రామ.కృష్ణాదులు క్షత్రియులు. వేదాంతాన్ని జనకాదులు ద్వారానే వ్యాపించినట్లు గీతలో స్వామి శాసనం, కనుక ఆదర్శ చక్రవర్తి దేవనగరీ నిర్మాత-శిల్పి-మయబ్రహ్మ-విశ్వకర్మ. చిత్రమేమంటే ఆదర్శ చక్రవర్తి శిల్పాన్ని చెక్కినవాడు ఆంధ్రశిల్పి. క్రీ.పూ. 2వ శతాబ్దిలో జగ్గయ్యపేటలో వున్న ఆ బొమ్మ ప్రస్తుతం లండను వస్తు ప్రదర్శనశాలలో వున్నది (దీని వివరాలు—నా శ్వేతచ్ఛత్రంలో చూడవచ్చు).

ఇందుకే వాల్మీకి మహర్షి రామరాజ్య రాజధానికి అయోధ్య అని పేరు పెట్టాడు (ఈ పేరు అథర్వవేదంలో స్వర్గనామం) ఆ వర్ణనమంతా అనంతకాలం నుండి మానవజాతి కంటున్న బంగారు కల (మనిషి బాహ్యరూపం మర్త్యం-మృణ్మయం. అంతరం హిరణ్మయం Ideal అంటే భావరూపం శిల యొక్క స్వప్నం-శిల్పం. శిల్పి కలకన్నవాడు. శిల్పం శిలయొక్క Ideal form (ఆదర్శ) భావరూపం. మర్త్యాంగన Animudes గా పురుషుని భావరూపిణి. ఆధునిక మనస్తత్వ శాస్త్రులు చెప్పినట్లు వీరే కావ్య నాయికా నాయకులు. కనుక అయోధ్యా వర్ణన ప్రత్యేకరూపం. భావరూప వ్యక్తీకృతి. కాక ప్రాచీనకాల మానవునిలో ధర్మ చింతన ప్రధానం. సెక్యులర్ బ్రతుకు కేవలం ఆర్థిక కాముకజీవితంలేదు. ఇది వాస్తవిక యాంత్రిక నాగరికత. అది ఆముష్మిక ధర్మప్రధానమైన అర్థ-కామ సంస్కృతి. కనుకనే నేటి కామశాస్త్ర ఆధ్యాత్మిక గ్రంథ రచనాధ్యయన స్వభావం వేరు. నాటి రచనాదృష్టి వేరు.

కాబట్టి నగరవర్ణన కళల్లో (శిల్పం-చిత్రలేఖనం సాహిత్యం) ప్రధానాంశమైనది. అమరావతి శిల్పి కుశినగర-జేతూత్తర నగరాలను అంత అందంగా శిల్పించటంలో వాస్తవిక సౌందర్యంకంటె ప్రతీక సౌందర్యం గొప్పది, పూర్వ

కాలంలో కలంకారి అద్దకాల్లో నగర చిత్రణముండేదని కావ్య సాహిత్యంవల్ల తెలుస్తున్నది (చూ. నవనాథ చరిత్ర). ఈ చిత్రణలో తాత్పర్యం ఆదర్శ-భావ-రాజ్యభావన. దీనికా చిత్రణం ప్రతీక. నగరం-దేవాలయం-గృహం-శరీరం ఒకే ఆధ్యాత్మదృష్టి కలదిగా భావితములై రాజు ఆత్మామూర్తి యజమాని. అంతరాత్మ ఒకటిగా భావింపబడినందున వాస్తుశిల్పం రాజధర్మం, మతం, వేదాంతం, నిత్య జీవితం అన్నీ ఒకేఒక సూత్రంగా చెప్పబడ్డాయి. ఈ విద్యా ప్రచార సాధనం పురాణం.

కనుక ఆ కథలకు కూడా ప్రతీకార్థమే చెప్పాలి. మత ప్రధాన సంస్కృతిలో నిత్యజీవన విధానమంతా ప్రతీకామయమే. యాంత్రిక భౌతిక నాగరికతలో వాస్తవికత ప్రధానాంశం. ఐనా పురాణంలో చరిత్ర కూడా వుంది, సమాజం-జాతి నాగరికత-మతాదులన్నీ పొరలు పొరలుగా పెనవేసుకొని వుండటం వల్ల ఈ శాస్త్రాదులన్నిటిలో పౌరాణికునకు పరిచయముండాలి.

నిత్యజీవితం-స్వప్నం-సుషుప్తి-తురీయావస్థలు మనిషికున్నట్లుగా వాడు నిర్మించుకొన్న కళాదికానికి ఈ నాల్గించె ఉండవనటం అసంభవం. యుగీన ధర్మానుసారంగా ఒక్కొక్క విషయం ప్రధానమయినా—అనాటి యుగీన స్పృహ ప్రతీకాత్మం కనుక పురాణవిద్య = స్వప్నవిద్య. పురాణ కథ కర్థమెలా చెప్పాలి అన్న మీమాంస ఈ యుగీన స్పృహలోకి అవతరించిన అంశం.

(వివరాలకు చూ, Devi Mahatmya—p. 30)

That very relation of how shall read a purana, precisely our current concern. The debate has been carried on in the pages of purana Journal

(పై గ్రంథం p 30)

ఈ మీమాంస చాలా అద్భుత విమర్శకు పీఠ కల్పించింది

అఖ్యానైః చ అపి ఉపాఖ్యానైః గాథాభిః
కల్పితోక్తిభిః
పురాణం సంహితాం చక్రే పురాణార్థ
విశారదః

(బ్రహ్మాండ పురాణం 2 34-21)

వ్యాసుడు—పురాణార్థ విశారదుడు కనుక—ఈ ప్రాచీన కథలు—గాథలు
యుగచరిత్ర—వీని ననుసరించి పురాణ విద్యను నిర్మించినాడట.

దీన్ని వివరిస్తే అతిప్రాచీన గాథలు ఉపాఖ్యానాలు; ప్రధాన విష
శాస్త్రీయంగా చెప్పి దానిని వివరించే ఉపాఖ్యానాలు. ఆఖ్యానాలు ప్రాచీన
వంశ కథలు—

ఇవన్నీ భారతాది మహేతిహాసాల్లో మనకు కన్పిస్తాయి.
గాథలు, పిట్టకథలు—prables
ఉపఖ్యానాలు—Allegorical Stories
ఆఖ్యానాలు—చరిత్ర వంటి పురాణ రాజర్షి గాథలు.

# 2. పురాణ వస్తువ్యాప్తి

ఆధునిక మనస్తత్వ శాస్త్రానుసారం పురాణేతిహాస గాథాచక్రం పరమార్థ ప్రతీక. వ్యష్టి చేతనలో మూడు పొరలున్నట్లే సమష్టి చేతనలోనూ అంటే అగాధ నీలాంభోధి, నిశీధిని, వంటి సుప్తచైతన్యం పైనున్న రెండు చేతనలు తమ కుత్సాహ శక్తులకు ఆ సముద్రంలోకి పోయి విశ్రాంతి పొంది కొంతసేపటికి మేల్కొని జాగృతి పొంది-కార్యజగన్మగ్నమైనట్లే విరాట్పురుషుడు కూడా సమష్టి చైతన్యానికి ఈ ప్రళయ, నిద్ర, సృష్టి, జాగృతి వున్నాయన్నది పురాణం చెప్పినదే—ఈ జగత్సత్యమే-సమష్టి సత్యమే-వ్యష్టి చేతనగా అధునిక మనస్తత్వ శాస్త్రం స్వప్నాదుల ద్వారా వ్యక్తీకరించిన సత్యం.

సృష్టి చక్ర ఆరోహణ అవరోహణలు-ప్రవృత్తి నివృత్తులే సుప్త-జాగ్రదవస్థలు. ఈ చక్రాకార పరిభ్రమణాన్నే పురాణం కీర్తిస్తుంది. మాండూక్యం ఈ చైతన్య పురుషుని ఓంకారంగా చెప్పి అ+ఉ+మ అక్షరాలనే జాగృతి-స్వప్న-సుప్త చైతన్యంగా వివరించి తత్త్వాన్ని నామరూపరహితంగా పేర్కొన్నది. ఇదే వ్యష్టి చైతన్యానికీ అన్వయిస్తుంది. తురీయ (మాత్ర) బిందురూప చైతన్యం ఒక మహానిశ-అతీతస్థితి (సృష్టి-స్థితి-ప్రళయాలకు) ఒక మహానిశ్శబ్దం-సచేతన శూన్యం. వ్యష్టి చైతన్యంలో లోపల మూడవ పొర సుప్తవ్యష్టి చైతన్యం చుట్టు విశ్వే సమష్టి సుప్త చైతన్యముందనీ నేటి మనస్తత్వశాస్త్రం చెప్పిందే.

ఇదే పునాదిగా పురాణగాథ అవతరిస్తుకది. అ సమష్టి చైతన్యావగాహనకు నిర్దేశకంగా-అ మహానిశకు ప్రబోధకంగా సృష్టి-స్థితి-ప్రళయాకార చక్రం చుట్టూ తురీయ-నీలనిశీధినీ చైతన్యం (మహాకాళరాత్రి-కాళిక అని పురాణాలు) అవరించీ వుండగా-హేమంతంలో ప్రకృతి నావరించిన హిమావగుంఠనంలాగా-ఆవరించీ వుంది. పురాణ కథ ఈ చక్రభ్రమణాన్ని వర్ణిస్తూ-ఆవరణను నిర్దేశిస్తుంది. ప్రతి వస్తువును-దాని అవరణను వర్ణిస్తుంది* ఈ తాత్విక సృష్టి-సత్యం వృత్తాకార భ్రమణం పురాణేతిహాస వస్తువు.

---

* Myth remains, necessarily with in the cycle, but represents this cycle as sorrounded and permeated myth silence. Myth is the revelation of a plenum of silence

మరొక విధంగా చూస్తే—

ప్రళయోన్ముఖీన సృష్టి కథ పురాణవస్తువు విషాద నాటకం కాదు. కాకపోలేదు. సముద్రజలం వాయుప్రేరితమై తరంగాయమానమౌతూ మరలా జలంగా పరిణామం పొందటం విషాదగాథ కాదుకదా. వ్యక్తిసృష్ట్యా కావచ్చునేమో కాని అది సత్యం మాత్రం కాదు. శాస్త్రీయం కాదు.

మలినవస్త్రధారణ విహితం కాదు, కనుక పరిత్యజించి నూత్నవస్త్రధారణ చేయటంలో విషాద ప్రశ్న లేనట్లు శక్తి విశ్వరూపధారణం చేస్తూ విసర్జిస్తున్నది. ఈ మహాకథ Cosmic Drama విషాదనాటకమెలా అవుతుంది?

విశ్వశిల్పి-అతని శిల్పము; విశ్వవైణికుడు-విశ్వవీణ; విశ్వనటకుడు-(నర్తకుడు); విశ్వనాట్యం రెంటూ విడదీయరాని సత్యాలు. ఈ వీణానాదం-నాట్యం తిరిగి వైణికునిలో అనంతనాదంలో-నిశ్శబ్ద నిశీధినిలో మరిగిపోతున్నది మన చెవికందుతూనే - అనుభవాన్ని అందిస్తూనే. బీజం - వృక్షం - ఫలం ఇదే పునరావృత్తం కావటం అద్భుత నాట్యం, నాదం తనలోనే వలయాలు చుట్టు కుంటు నటిస్తూ-నటిస్తూ-వృత్తాలు చుట్టి చుట్టి సురిగిపోయినట్లు, ఇది పురాణేతిహాస వస్తువు. వచ్చిన చెట్టు ఫలించి బీజంలోకి పోవటం బీజం నుండి ప్రారంభమై మహావిశ్వవృక్షంగా వచ్చి 18 శాఖలుగా-7 కాండలుగా-ద్వాదశ స్కంధాలుగా-శాఖోపశాఖలుగా-ఫలించి తిరిగి బీజాలు రాల్చిపోవటం-వృక్షాన్ని వర్ణిస్తూనె బీజాన్ని ధ్వనింపటం. బీజాన్ని వర్ణిస్తూనే వృక్షాన్ని స్ఫూర్తికంపించటం. ఇదే జగన్నాటకం-పురాణ వస్తువు.

పురాణము, నాటకము పంచలక్షణాలున్నవే. నాటకంలో బీజం-ఫలం ప్రారంభాంతాలు. ఇది వృక్ష-వృత్తాకార భ్రమణ సంకేతమే పంచభూత స్వరూపమే ప్రకృతి, జీవకోటి. ఆ పంచభూత ఉపలక్షణాలే పురాణ పంచలక్షణాలు-నాటక పంచసంధులు. కనుక వృక్షం జన్మ-స్థితి-ప్రళయం-పునఃజన్మాది చక్రప్రతీక

with in and around every atom of existence. Myth is directiug the mind and heart by means of profoundjy informed figurations to that ultimate mystery which fills and sorrounds all existence.

—*The Hero with a Thousand Faces.*—P. 267

ఇందుకే నన్నయ, పోతన, విశ్వనాథాది మహాకవులు ఇతిహాసాన్ని కల్పవృక్ష ప్రతిమగా చిత్రించారు.

ఇందుకే పురాణకథలు ఒకేరకంగా ప్రపంచమంతా కన్పిస్తున్నాయని ఆధునిక పరిశోధకులు వ్యాఖ్యానించి చూపారు పట్టణ నిర్మాణ సూత్రమూ ఒకే రకంగా విశ్వమంతా వుందన్నారు.

వృక్షం మహాసత్య సంకేతంగా సర్వమత వాఙ్మయంలో పురాణ కథల్లో వుంది. (చూ. The Message of the Upanishads) అలాగే సువర్ణ హిరణ్య-మయాండ విషయం (దీని తత్వవిచారణకు చూ. The Golden Germ)

గ్రీకు-ఈజిప్టు-ఫిన్నిష్-బౌద్ధ-వైదిక-జపాను పురాణవాఙ్మయంలో అన్నిటా వుంది. ఛాందోగ్యంలో (3-19, 1-3) చాలా అందంగా కన్పిస్తుంది దాని పెంకు ఆకాశం (Space) దానిలోని బీజం అనంత యుగాలమీద వస్తున్న అనంత జీవకోటి బీజశక్తి.

Space is boundless by re-entrant from not by great extension 'That which is' is a shell floating in the in finitude of 'That which is not' This succinet formulation by a modern physicist. illustratingthe world picture as he saw it in 1928,* given precisely the serce of the mythological cosmic eye Further more, the evolution of life, described by our modern science of biology, is the theme of the early stages of the cosmogonic cycle.

—*The Hero with a Thousand Faces*—P. 277.

"సృష్టి పూర్వావస్థ అసత్ (శూన్యం-కాల-మహారాత్రి). సృష్టి కాలంలో అది అండంగా ఏర్పడి పై దిప్ప, సువర్ణమయం కాగా క్రిందిది వెండిదిప్ప. స్వర్ణ (కాంతి) ఆకాశం కాగా-క్రిందిది పృథ్వీతత్వంగా ఏర్పడింది"—

హిరణ్మయ గర్భసూక్తం (ఋగ్వే. X-10 9)

దీన్ని మహాద్భుతంగా వర్ణిస్తుంది 10 మంత్రాల్లో.

---

The Nature of the physical world.

—by A. S. Eddington.

"ప్రారంభంలో హిరణ్మయ గర్భుడే వున్నాడు. సర్వసృష్టి కతడే అధినాథుడు. భూమ్యాకాశాల నతడే ధరిస్తున్నాడు"—

'క' అన్న పేరు కల అతనికి నమస్కారం 'కస్మైదేవాయహవిషామహే' (ఏ పేరుకల-ఏ స్వామికి హవిస్సు లర్పించేది—) ఈ మకుటంతో 10 మంత్రాలు మహోల్బణమైన దివ్యప్రజ్ఞాదర్శనం సముద్రం పోటు పొడిచినట్లు శబ్దాకృతి ధరించిన మహాసత్యస్తోత్రం. శ్రీ అరవిందులు తమ 'భవిష్య కవితా' దర్శనం లోని దివ్యకవితా లక్షణాలన్నీ[1] ఈ మంత్ర సంపుటిలో సురిగిపోతున్నవి. కనుకనే ఈ మంత్రదశకం విశ్వమంతా వ్యాప్తమైనది (చూ. The Golden Germ; The Hero with a Thousand Faces.)

ఈ సువర్ణబీజుడు సర్వసృష్టిమయుడు. ఆదిమమూర్తి, అతని సర్వాణువుల నుండి జీవరాశి సముద్భూతమైనది. ఒక మహాశూన్యతామూర్తి. సర్వాన్ని బీజంగా ధరించి నట్టివాడు.

ఇలాంటి సృష్టి కథలే ప్రపంచ మత-పురాణవాఙ్మంలో ప్రసిద్ధం ఒక 'టాహిటీ' పురాగాథ ఇది.

'అతడేకాకి. తల్లితండ్రి లేనివాడు. వాడి పేరు టావోరా. శూన్యంలో వున్నాడు (మహానిశీథినీగర్భంలో దీపకళికలాగా, కాళీ గర్భంలో శివుడు తేజో లింగంలాగా) సృష్టిలేదు. పృథ్విలేదు. అంతా ఒకే నీహారికామండలం[1] ఆప్పుడత డన్నాడు.

"ఈ శూన్యం నుండి భూమ్యాకాశాలు ఆవిర్భవించుగాక" అతని ముఖం బహిర్గతంకాగానే అండం పగిలిపోయింది. అతడు చూచాడు "తదైక్షత సోకా మయత—" (అతడు చూచెను అతడు సంకల్పించెను. చూ. బ్రహ్మసూత్రాల్లో ఈక్షత్యధికరణం) పృథ్వి-అకాశం-సముద్రాలు-అన్ని వ్యక్తమైనవి (చూ. The Hero with a Thousand Faces).

బృహదారణ్యకంలో ప్రజాపతి ఏకాకికా వుండి భీతుడై తోడుగా స్త్రీని సృష్టించి ఆమెను కవయబోగా-ఆమె భీతయై నానారూపధారణంచేసి పారిపోతుంటే

---

1. దీని వర్ణన హరివంశంలో వుంది. సృష్టిపూర్వం నీహారికా నెబ్యులాల మయమని.

(చీమదాకా వున్న అన్ని ఆడరూపాలుగా) ప్రజాపతి మగజంతు రూపధారణం చేసి నానాసృష్టి చేసిన విషయమిదే,

సరిగా ఇలాంటి కథనే శ్రీ ఆనందకుమారస్వామిగారు Spirutual power and Temporal Authority in the Indian Theory of Government గ్రంథంలో వుదాహరించాడు. (p. 36)

'తండ్రి జూస్ నుండి పుట్టిన నెమిసిస్ తండ్రితో ఎలా సంసారం చేసేదని భయపడి చేప-ఆవు-ఆడుగుఱ్ఱం చివరకు చీమదాకా రూపాలు ధరించిపోతూవుంటే తండ్రి (Zeaus) జూస్-ఆత్మపురుషుడు (ఎవని నుండి పతి-పత్ని భావం జన్మించిందో-ఎవని శరీరం[1] రెండుగా చీలి—ఈ ద్వంద్వం వచ్చిందో) ఆమెను పొందితే సృష్టి వచ్చింది—(చూ, వివరాలకు పై గ్రంథం) ఈ హిరణ్మయాండ కథ సృష్టికథగా పురాణ ప్రపంచం చెబుతున్నది. కనుక ఇవి బూతుకథల్లు కాక పోగా ఒక సృష్టి రహస్యాన్ని వ్యక్తీకరించేవి. ఇందుకే పురాణకథ వ్యక్తిలౌకిక విషయం కాదన్నాడు. కెరినీ తన Science of mythology లో ఎలాగో కాంప్‌బెల్ సహస్ర శీర్షాపురుషుడన్న గ్రంథంలో ఇలా వ్రాశాడు. p 279.

"—Though these myths [of creation narrate of the remotest past, they speak at the same time of the present origin of the individual. 'Each soul and spirit' we read in the Hebrew 'Zohar' prior to its entering in to this world, consists of a male and female united into one being. When it discends on this earth] the two parts separate and animate two different bodies. At the time of marriage, the Holy one, blessed he, who knows all

---

1. ప్రతిస్త్రీలో ఒక పురుషమూర్తి. ప్రతిపురుషునిలో ఒక స్త్రీమూర్తి వున్నట్లు నేటి మనస్తత్వశాస్త్రం చెబుతున్నది కదా. ఇదే అర్ధనారీశ్వర తత్త్వ రహస్యం. ఋగ్వేదంలో యమ-యమీ సంవాదమూ ఇదే. వ్యక్తి దశను అంత స్తత్వాన్ని వ్యాఖ్యానించేది మనస్తత్వశాస్త్రం కాగా విశ్వదశలో విశ్వజనీనంగా వ్యాఖ్యానించేది తత్త్వశాస్త్రం. నేటి అత్యాధునిక విచారణమంతా భౌతిక+అభౌతిక శాస్త్రం. మనస్తత్వ శాస్త్ర—తత్త్వశాస్త్ర సంగమబిందువు చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నది.

souls and spirits unites them again as they were before, and they again constitute one body and one soul, forming as it were the right and left of one individual .. This union, however, is influenced by the deeds of the man and by the ways in which he walks. If the man is pure and his conduct is pleasing in the sight of God, he is united with that female part of his soul which was his component part prior to his brith''—¹

ఇదే విషయం వేదవాఙ్మయంలో-స్మృతుల్లో చెప్పబడినది. పురుషుడంటే మగ+ఆడ కలిసినవాడని. ఈ విరుద్ధ శక్తి సమన్వయమే దాంపత్యమని-కనుకనే వివాహాత్పూర్వం మగ-ఆడ విడివిడి జీవులు. వివాహంతో వారేకమైతేనే పూర్ణత. కనుకనే వారిద్దరూ విడిగా ఎవరికి వారుగా వుండటం అవిశ్రాంతి కారణంగా వారి సమైక్యం శాంతి-విశ్రాంతి-ఆనందమని²—

1. ద్విధా కృత్వా ఆత్మనో దేహం
   అర్ధేనపురుషో౽భవత్
   అర్ధేననారీ తస్య సవిరాజం
   అసృజత్ ప్రభుః. మనుస్మృతి. 1-35,

పరమాత్మ తన శరీరాన్ని రెండుగా చీల్చి ఒక సగం పురుషునిగా—మరొక సగం స్త్రీగా చెక్కాడు.

2. అలంకారికుల శృంగార రసవాదానికి తత్త్వభూమిక ఇదే. వియోగం లేనిదే సంయోగానికి పుష్టిలేద నటమూ ఈ ఆధ్యాత్మిక నిత్యసంయోగ వ్యంజకమే.

# 3. పునర్దర్శనం

ఈ వాదాన్ని శబ్దార్థ దృష్ట్యా కూడా వివేచించుకోవచ్చు. వేదశబ్దం ప్రతీక. లోకశబ్దం వాచకం. అక్కడ అర్థం దర్శనీయం తప్ప తర్క్యం కాదు. లోకశబ్దం, అర్థం పరంపరా ప్రాప్తం, తర్క్యమున్నూ. దీన్నే తార్కికులు లింగమన్నారు. కారణాన్ని బట్టి కార్యమూ. దీన్నిబట్టి అదీ అనుమానితములౌతున్నాయి కనుక అనుమాపక శబ్దం లింగం. ఇది ఆలోచన-బుద్ధికి సంబంధించినది. కానీ ప్రాచీన కాలంలో మనిషికి మనస్సులేదు. అది పరిణామానుగుణంగా చాలా ఇటీవల వచ్చింది. తత్పూర్వం[1] స్వాప్నిక-నిద్రాచేతనలే వున్నాయి.

వేదం ప్రాచీన మానవునిలో అంతశ్చైతన్యంలో దానంతటది మెరిసిన మెరుపు. కనుక అక్కడి శబ్దం నిదానమని [ప్రతీక-ప్రథమచ్ఛదం/ప్రాగ్రూపం] చెప్పబడింది. దానినే నిదానవిద్య[2] అంటారు. ఈ విద్యాప్రకాశంతో వేదార్థాన్ని స్థాపించటం వైదిక విద్య. శివలింగం వంటి ప్రతిమలన్నీ నిదానాలు (ప్రతీకలు) తప్ప వాటికి వాచ్యార్థం లేదు. అసలు సృష్టిలో ప్రతి వస్తువూ ప్రతీకేనని ఆధునిక శాస్త్రవేత్తలంటున్నారు. ఒక శిలవుంది. దాన్ని మనం రాయిగా పారవేస్తాం. భూగర్భ శాస్త్రవేత్తకది ఒక రత్నం. అదే శిల్పంగా వస్తే కళాఖండమే కాదు. ఆధ్యాత్మికార్థ ప్రతీక. కనుక మనం మనః కేంద్రంతో వుండి చూస్తున్నామా?—హృదయం-నాభి-కేంద్రంలో వుండి చూస్తున్నామా?—మొదటి దృష్టి వట్టి భౌతిక దృష్టి. వ్యావహారికం. రెండోది పారమార్థికం.(చూ. Meaning of Meaning= భాషా శాస్త్ర దృష్ట్యా. The Myth of Meaning — వస్తు ప్రతీకార్థ దృష్ట్యా).

---

1. ఆఫ్రికా ఆటవికులను గురించి వ్రాస్తూ యూంగ్ అన్నాడు "వారు లేవగానే దోసిట్లో ఊదు(ము)కొని దాన్ని రవి కర్పిస్తారు. ఇదేమిటని అడిగితే అది ప్రాచీనాచారమన్నారు. వారికి అర్థంతో నిమిత్తంలేదు. కర్మాచరణమే ముఖ్యము అని (చూ. Man and his symbols) ఇది ప్రతీకాకర్మ. వాచ్యార్థం లేనిది.

2. చూ. అనుశాసనిక పీఠిక. సాహిత్య అకాడమీ ప్రచురణ.

మూడోది వుంది. ఈ శబ్దం వ్యంజకం. ఆలంకారికులు తెచ్చిన భాషా విప్లవం చాలా గొప్పది. వేదం-పురాణం (ఇతిహాసం) ప్రతీకారూపం, లోకం= వాచ్యార్థదాయిని=వాచకశబ్దమైతే కళాస్వరూపమేమిటి?—వ్యంగ్యార్థ రమణీయం.

కఠాది ఉపనిషత్తుల్లో ఒక మాట వుంది తరచుగా వేదాంత విద్యలో వచ్చేది. "మధ్యే వామన మాసీనం"—(మధ్యలో వామనతత్త్వం ఆసీనమై వున్నది.)

పరమరమణీయమైన తత్త్వమన్న వస్తువు కాని వస్తువు మధ్యలో వుంది. అంటే?—హృన్మధ్యమని అద్వైతులు, కానీ ఇతరులన్నారు. లోకం ఒక ధ్రువం, వేదం మరొక ధ్రువం, కాగా రెంటికీ మధ్య బిందువు—కేంద్ర మొకటి వుంది. రెండు విరుద్ధాంశాలను (విఘాతులు-అని కథం) సమన్వయించేది, తంత్రం లోకానికి తలక్రిందులు. లోకం త్యజించిందంతా తంత్రాని కుపాదేయమే. ద్వైతి-అద్వైతి విరుద్ధప్రతీకార్థాలు. తంత్రం రెంటినీ సమన్వయించేది. (శాంత-శృంగార సమన్వయం[1] ఇతిహాసంలోనే వుంటుంది) కనుక వ్యంజక శబ్దం రమణీయం. ఈ వైదిక సత్యం పేరు పరమార్థం. (Meaning of Meaning) లోకార్థం సాక్షిక సత్యం (fact - meaning) కావ్యసత్యం రెంటికి కొలికి పూస. రసం రమణీయార్థ విశేషం.

మరలా తత్త్వదృష్ట్యా దీన్ని విచారిస్తే గుప్త-అర్థరూపమైన అవస్తువును సృజనశక్తి బహిర్గమింపచేస్తున్నది. ఆ శక్తి పేరు శబ్దం (సరస్వతి) అది బహిర్గత మౌతూ గుప్త వస్తువును జుట్టుపట్టుకొని బైటకులాక్కొని వస్తున్నది. శబ్దమంటే పదం కదా. అంటే అర్థానికి స్థానం-అధిష్ఠానం-ఆశ్రయం. అంటే అర్థమే. సృజనేచ్ఛ స్పందించగా శబ్దమై వస్తున్నది. ఇదే శివశక్తి సంకేతంగా తంత్రం పేర్కొన్నది. శివుడర్థ స్వరూపుడు. శక్తి శబ్దాకృతి. ఇది వ్యక్తాభిలాష-స్పందం-కల శక్తి. సర్జన క్రియాశక్తి. తాను తానుగా రాక గుప్తార్థాన్ని తనతోపాటుగా తానేబ లాక్కొని వస్తున్నది, అందుకే అవి నిత్య అద్వైత స్థితిలోనున్న ద్వంద్వం. అమనస్కదశలో అవి మరలా అద్వైతస్థితిని పొందుతున్నది. అంటే అర్థం అనుభవంగా పరిణమించిన దశలో.

---

1. శ్రీవిశ్వనాథవారి కల్పవృక్షంలో శ్రీ సీతారామ దాంపత్యాన్ని - శాంత శృంగార సమష్టి బిందువుగా వర్ణించటం చాలా తాత్త్విక విషయం.

కనుక వైదిక పురాణాది వాఙ్మయం. ప్రతీకార్థకం; నిదానవిద్య (సత్యం) కావ్యవిద్య-ధ్వనివిద్య-వ్యంగ్యార్థం=రమణీయం=సౌందర్యం. లోకం వ్యావహారిక విద్య=వాస్తవిక సత్యం (వస్తురూపంలో అభివ్యక్తతత్త్వం) 1+3=2=ఇదీ సౌందర్యమంటే. ఈ మూటినే ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు-జాగ్రత-స్వాప్నిక-సుషుప్తి చేతనలుగా వర్ణించారు. మనిషి ఈ మూడుపొరల్లో సంచరించే నిత్యపాంథుడు, ఇవే యుగాలుగా వర్తిస్తాయి. మనుషులు తదనుగుణంగా వర్తిస్తారు. ఈ దృష్టిలో వ్యక్తావ్యక్త సమన్వయం శాస్త్రీయసత్యం, రెండూ విడిపోరాదు. విడిపోయిన స్థితి 18.19 శతాబ్దులు, హేతువాద-భౌతికవాద యుగాలు, 20వ శతాబ్ది సమన్వయము, కనుకనే లుప్తమైపోయిన అంతశ్చేతన self-ను అన్వేషించటం ప్రారంభమైనది. దీనికి సంకేతాలు—The modern man in search of soul (Jung). The veriety oi religious experiences (William James)—The transcendental consciousness cosmic consciousness వంటి గ్రంథాలు అనేకం.

దీనికి యోగతత్త్వ స్వరూపాన్నిచ్చిన మహాగ్రంథం శ్రీ అరవిందుల వారి The life Di ine; శ్రీ భగవాన్ రజనీష్ సర్వమత యోగ ప్రవక్తలపై చేసిన ప్రసంగాలు.

వృత్తాన్ని ఖండిస్తే వచ్చే సరళరేఖలు సమష్టిగా వృత్తం. వ్యష్టిగా సరళరేఖ. మనమున్న వర్తమాన స్థితి యిది. సరళరేఖ. ఇందుకే పురాణ విద్యాధ్యయనం నూత్నకోణంలో ఆరంభమైనది. ఆధునిక కళా ప్రపంచమంతా ఈ పౌరాణిక ప్రతీకలను పునఃబహిర్గతం చేసిందని తద్విదుల విమర్శ సిద్ధాంతాల్లోకి దీన్ని లగించి చూస్తే వాస్తవికతావాదం. ప్రతీకావాదం ఆలంకారిక వాదం— ఔతాయి. ఇవన్నీ మానవ చైతన్య విహారస్థలాలే. పరస్పర విరుద్ధాలు కావు. కనుక ఒకదాని దృష్ట్యా మరొకటి త్యాజ్యం కాకపోగా వక్రతాస్పర్థయా ఒకదాని ప్రక్క మరొకటి ప్రకాశిస్తుంది. శరీరంలో సప్తధాతువులు సౌధాలు. జీవుడా రత్నసౌధంలో ఒక్కొక్క అంతస్థులో ఒక్కొక్కసారి విహరించినట్లు ఈ సప్త చేతనా భూమికల్లో విహరిస్తూ వున్నదే సత్యమనుకుంటాడు. కానీ సప్త చైతన్య స్థానంలో నిత్యజాగృతునకు అంతా వకటే.

ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు - స్వప్నవిచారణా విశారదులు అంటున్నారు. "కాలాతీత దర్శన స్వరూపమేమిటి? అది ఏ మానవచేతనావిష్కృతం?

ప్రపంచమంతా పురాణ మొక్కేరకంగా-పై శాఖోపశాఖల్లో భేదాలున్నా-మూలం సమానంగా వుండటంలోని రహస్యమేమిటి? దానివల్ల మనకు విన్పించే బోధా రహస్య మేమిటి?

"ఇవాళ అన్ని శాస్త్రాలు ఈ ప్రశ్నకు సమాధానంగా వచ్చినవే. పురాతత్త్వ శాస్త్రవేత్తలు ఇరాకీ-హోసన్-క్రెటీ-యుకటాన్ శిథిలాలు త్రవ్వుతున్నారు. ప్రాగ్దేశం నుండి అనేక ప్రాచీన తత్త్వ శాస్త్రాలు. అలాగే పాక్-హిబ్రూ పవిత్ర రచనలనేకం మన తందుబాటులోకి వచ్చాయి. ఈ నడుమనే ప్రారంభమైన మనస్తత్త్వ శాస్త్రం భాషా-పురాణ-మత కళా మూలాలను అన్వేషిస్తున్నది.

ఆశ్చర్యమేమిటంటే అధిపీడితుల నుండి వెలుగులోకి వచ్చిన అంతశ్చేతనా వ్యాపార రహస్యాలు-వాటి వివరణలు-అన్నీ ప్రాచీనపురాణ గాధాస్వరూప వ్యాఖ్యానాలే. నేటి కల ప్రాచీనపురాణం. అది ఆనాటి సామాజిక పురోగతి సాధనం. నేడు కల కూడా అదే సాధిస్తుంది. ప్రాగ్రూపాలు-క్రతు మూల ప్రతిమలు-పురాణాలు-దర్శనాలు (visions).

'Eernal once of the Dream' are not to be confused with the personally modified symbolic figures appear in night man and madness to the still tormented individual· Dream is the personalized myth, myth isthe depersonalized draam, both myth and dream are symbolic in the same general way of the dynamcis of the psyche. But in the dream the forms are quirked by the peculiar troubles of the dreamer, where as in myth the problems and solutions shown are directly valid for all men-kind."...

(చూ. *The Hero with a thousand Faces—Joseph Campbell.*)

ఈ దృష్టిలో ఆధునిక కళలు-విమర్శలు వచ్చాయి. అంటే పురాణ గాథ పునరావృత్తమైనదని[1] సారాంశం. కనుక మూర్, పికాసో—వంటి ఆధునిక శిల్ప కళా బ్రహ్మల సృష్టి—తద్వివేచనా జరిగాయి. (చూ. I con & Art; The forms unknown).

---

1. విశ్వనాథవారి పురాణ వైర గ్రంథమాల ఈ దృష్టితో ఆవిష్కృతమైనదే. నేటి విశ్వకళాపీఠం ప్రతీకాధిష్ఠానం. ఆ నవలల్లో ప్రధానపాత్ర నాస్తికతా ప్రాగ్రూపం.

ఇటీవల మిత్రులు ఆచార్య కోవెల సుప్రసన్న అన్నాడు. "జయద్రథుని రూపం మాష్టరుగారిని దయ్యమై వెన్నాడినట్లు వారే అన్నారు" అని. పికాసో విరూప ఆకృతులన్ని అతడు స్వప్నంలో చూచినవేనట. అంటే అంతశ్చేతన పునః తనను తాను ఆవిష్కరించుకొని పురాణ తత్త్వాన్ని బయటకు తెచ్చిందన్న మాట.

ఒక మనస్తత్వ శాస్త్రవేత్త అవీలా జఫే ఆధునిక దృశ్యకళా మనోవిశ్లేషణ చేస్తూ—"సృష్టిలో ప్రతివస్తువూ ప్రతీకే. సహజ వస్తువులు శిలలు-జంతువులు-కొండలు-గుహలు-లోయలు-మానవులు; మానవ నిర్మిత కళాప్రపంచం రేఖాత్మక వస్తువులు-సంఖ్యలు, త్రికోణం, చతురస్రం, వృత్తం—అన్నీ ప్రతీకాత్మకాలే. విశ్వమంతా ప్రతీకాత్మకత్వం పొందుతుంది. చూచే చూపుండాలి. కళలన్నీ ఇలాంటివే. అధునిక కళలు ప్రతీకాత్మకత ఎలా పొందినవో చూడదగ్గ అంశం.

మార్క్స్ ఎర్నెస్ట్ వంటి వారు శిల్పించిన బొమ్మలు శిలాత్వాన్ని కాపాడుతూ ఆకారాన్ని రేఖామాత్రంగా చెక్కిన వాటినీ—అతిప్రాచీన శిల్పి చెక్కిన MENHIR—a rock that has been slightly carved in to female form (probably a mother Goddess) ప్రక్క ప్రక్కనె పెట్టి చూస్తే రెండూ ప్రతీకా శిల్పాలేనని తెలుస్తుంది. ప్రాచీన మత ఉపాసనా విషయాలైన మండలాలు యంత్రాలు-త్రికోణ-వృత్త-చతురస్రాలు తిరిగి ఆధునిక కళలో అభివ్యక్తమైనాయి" ఈ విధంగా అతడు ప్రతీకా ప్రాగ్రూపాలు ఆధునిక కళలో అభివ్యక్తమైన ధోరణిని మనస్తత్వ శాస్త్ర సిద్ధాంతానుసారంగా నిర్ధారణం చేసాడు. (చూ. *Man & His Symbols* p. 255-322.

ఈ విషయజాలంలో లభించిన ముత్యాలేమంటే పురాణగాథా విచారణ-స్వాప్నిక విచారణ-కేవలం జాగ్రచ్చేతనా విషయం కాదు. దానికొక ప్రత్యేక విద్యాశిక్షణ ముండాలి అని వేదార్థ నిర్ధారణ కనువైన విద్యపేరు నిదాన విద్య (నిదానం=ప్రతీక). ప్రతీకల్లో 2 రకాలుంటాయి. గణితశాస్త్రంలో సంఖ్యలు ప్రతీకలే. బేసిసంఖ్య అవ్యక్త నిర్గుణ తత్త్వానికి; సరిసంఖ్య వ్యక్త తత్త్వానికి. కాని అది శాస్త్రీయ ప్రతీక. భావప్రతీక కళావిషయం. మతానుభవమూర్తి=వైదిక ప్రతీక. కళానుభవ ప్రతీక=వ్యంజక శబ్దం. గణితశాస్త్ర ప్రతీక పేరు లింగం. ఇందులో భావస్పందన-నాట్యగతి వుండదు. వైదిక ప్రతీకల్లో సత్యాంశ హెచ్చు. కళాప్రతీకలు రసమూర్తులు. సౌందర్య ప్రతిమలు. వైదికప్రతీక (క్రతుసంబంధం-ritualistic—జానపద (గ్రామదేవతా మూర్తులు)—కళాప్రతీక మూడు పిఠాలు.

కళామత ప్రతీకలు — (ప్రతిమ - మూర్తి) విశ్వరూపాలు. భావాలు (cosmic forms) తప్ప వైయక్తిక రూపాలు కావు. ఈ రెండు సత్యం+సౌందర్యం ఏకత్ర సుసంఘటితమైతే అది మహోత్కృష్టి కళారూపం. అదే రామాయణం-భారతం-భాగవతం వంటి ఇతిహాస పురాణరూపాలు. (భారతంలో కొంత వైదిక ప్రతీకాత్మకాత ఎక్కువ. కావ్యకళాప్రతీకా లక్షణం తక్కువ. తెలుగు భారతంలో ఎక్కువ) శిల్పంలో సాలభంజికామూర్తి.

కనుక పురాణధోరణి-కావ్యధోరణి వేరువేరుగా విశ్లేషించి సమన్వయాత్మకంగా దర్శించి విమర్శించాలి. ప్రతీక అంటే ఒక సమన్వయదర్శన ప్రతిబింబం. మూర్తి విశేషం కనుక.

ప్రతీకాత్మక కళామూర్తిని వాస్తవిక సిద్ధాంత దృష్ట్యా విచారించటం అవిమర్శే కాక కువిమర్శ. విమర్శకుడు కానందున వచ్చే నష్టమేమీలేదు. (అతనికి-మనకు) కాని కువిమర్శకుడైతే మాత్రం అతనికీ మనకు నరకమే. (అసత్య జీవిత ప్రతీక-మతదృష్ట్యా)

భారతీయ మైథున శిల్పం-రామాయణాదితిహాసాలు-పురాణాలు సర్వమూ హేతువాద దృష్ట్యా నిరస్తం కావటం మనకు తెలిసిందే. ఇది అసమంజస మార్గమని 20 వ శతాబ్ద శాస్త్రీయ దర్శనం.

కనుకనే రాజస్థాన్ చిత్రకళ అన్న గ్రంథంలో రాసలీలాది గోపికా ప్రణయఘట్టాలను వ్యాఖ్యానిస్తూ డా॥ ఆనందకుమారస్వామి అన్నారు.

"వివాహ వ్యవస్థను—దాంపత్య ధర్మాన్ని అంతప్రతిష్ఠంగా సామాజిక కేంద్రంగా నిర్మించుకున్న భారతీయ వ్యవస్థలో కేవల ప్రణయవాదానికి స్థానం లేదు. కనుకనే భాగవత కథలు నైతిక సూత్రబద్ధాలు కావు. అవి కేవల ఆధ్యాత్మిక భావసంకేతాలు. బృందావనమంటే హృదయం తప్ప భౌమస్థలం కాదు. రామాయణం నైతికప్రాధాన్యం చెబితే భాగవతం నిత్యసిద్ధమైన జీవేశ్వర సంగమాన్ని సమైక్యాన్ని అభివర్ణిస్తుంది. ఇదే వైష్ణవ మార్మిక కళాసూత్ర"[1]మన్నాడు. ఇక్కడ వాస్తవికతావాదానికి స్థానంలేదు.

---

1. ఒక చోట యూంగ్ అంటాడు "మత ప్రాధాన్య దర్శనం లేక మత ప్రతీకాప్రాగ్రూప నింద చేయటంవల్ల అతడే నష్టపోతున్నాడు" అని. అంటే అతనిలో ఆత్మ వికాసం బదులుగా సంకోచిస్తున్నది. (Individuation process దృష్టితో ఈ మాట చూడుకోవాలి).

# 4. పురాణ పునరుత్థానం

ఈ యుగారంభంలో (1925 నుండి) పురాణ దేవతా ప్రపంచం మేల్కొ-వటం ప్రారంభించింది. ప్రధానంగా మన స్తత్వశాస్త్రం ఆధునిక కళాదర్శనం—మతాన్ని నూత్నదృక్పథంతో వివేచించటంతో స్వప్నప్రపంచమైన పురాణగాధ (భూతకాలం) జాగృతం కావటం తటస్థించింది. స్వప్న గాధార్థాలన్నీ పురాణ కథలుగా నిరూపింపబడటంతో ఆధునిక కళామూర్తుల మూలరూపాలు. అన్వేష ణలో—విస్మృత ప్రాచీన పురాణం పునః సాక్షాత్కృతి పొందింది. హెన్రీమూర్ వంటి జగత్ప్రసిద్ధి శిల్పి చెక్కిన స్త్రీ మూర్తులన్నిటికీ ప్రాచీన మాతృదేవత-మౌళికరూపంగా కన్పించింది. పికాసో వంటి వారి చిత్రణలో సెంటార్స్-మెంటార్స్ విచిత్ర మానవ రూపాలకు మూలాలు పురాణకథలుగా బైటపడ్డాయి. స్వప్నశాస్త్ర వివేచనతో పురాణగాథా నిత్యత్వం ప్రస్ఫుటమైనది. ప్రత్యేకించి యూంగ్ సరిశోధనలవల్ల మతం-పురాణం-కళ ఇవన్నీ అజాగృత-స్వాప్నికచేతనా విష్కృతులన్న సత్యం బట్టబయలై—ఆసియాఖండంలోని మతగ్రంథాల ప్రాపున అన్నీ ఆంగ్లంలోకి అనువదింపబడినవి. కనుక ఆయా పరిశోధనలన్నిటికీ ఆధారం దొరికింది. చైనా-భారత దేశాల తత్త్వ శాస్త్రాదులు ప్రమాణీకృతములైనాయి.

ఈ దృష్ట్యా పురాణ గాథా ప్రపంచాన్వేషణ సాగింది. 1930-40 నాటికి Seience of mythology వ్రాసాడు C కెరిన్యే. అతని ననుసరించి

పురాణమంటే:—

"We have lost our immidiate fealing for the Swete reaiities of the spirit and to this world all true mytho-logy belongs lost it precisely because of all toowilling, helpful; and efficient Science—".

ఈ వాక్యాలతో తన విచారణకు నాందిని ప్రస్తరించాడు. ఈ వాక్యార్థమే అతని వివేచన సారాంశం. పురాణ కథ జాగృత మానవచేతనా పరిధి కవతలి పొలిమేరల్లో తిరుగాడే వస్తుతత్త్వ స్వరూపమైన దేవతా (భావ) సంబంధ మన్నాడు.

A particular kind of material determines the art of Mythology, an immemorial and traditional body of material contained in tales about Gods and God like beings heroic battels and journeys to the wonder world, Mythologem is the best Greek word-for them. Tales already well known but not un-eminable to further reshaping. Mythology is the movement of this material, it is some thing solid and yet mobile substantial yet not static capable of transformation. (p. 2)

ఇదొక రకంగా పురాణనిర్వచనం,

ఇలా నిర్వచించి దీని శ్రోత ఎవరన్న ప్రశ్నకు సమాధానంగా సంగీత శ్రవణంతో ఆనందించే మనస్తత్వం కలవాడే శ్రోత అన్నాడు. ఈ పోలిక తాత్పర్యమేమంటే (immidiate feeling) హఠాత్ హృదయ సంవేదన, తర్క-అతర్క సంబంధం లేని మనస్సు. ఎవడూ తర్కించి సంగీతాన్ని ఆనందించడు. అక్కడ మనస్సులేదు హృదయమే వుంది. ఆ హృదయజీవి దీనికి శ్రోత. ఇది ప్రాచీన మానవచేతన, ఆనాటి మనిషికి మనస్సు కంటే హృదయం- మేధాశక్తి కంటే హార్దికతా ప్రధానమైన ప్రజ్ఞ మెండు. మనిషిలో మనస్సు-మేధ- తర్కం పెంపొంది సంవేదన (feeling) చావటంతో పురాణం మనకు దూరమై పోయింది. ఆధునిక కాలం పూర్వ ద్వి-త్రి శతాబ్దాల (18-19) తర్కానికి తిరిగి ప్రజ్ఞాన సంవేదనలను నెమరువేసుకొన్నందున పురాణ పునరుత్థానం జరిగింది— ఈ శతాబ్దంలో. కనుక పురాణ శ్రోతకు అహంకారావరణ లేదు. ఇవి ఉన్నవాడికీ పురాణంలేదు. ఆనాటి మనిషి వ్యక్తికాడు. సమిష్టిచేతనకు మూర్తి, జానపదుడంటే వీడే (ఇందుకే కొన్ని పురాణ కథల్లో పాత్రకు జానపదుడన్న నామకరణం చేయబడింది. ఉదా:—ఉత్తర హరివంశం) ఒక ప్రత్యేక శ్రవణేంద్రియమున్నవానికే కళావగాహన. వాడు శ్రవణంలో తనమ తాను హఠాత్తుగా ఆవిష్కరించుకొంటాడు a sympathetic pouring out of one self—ఇది కెరిన్యే మాట. ఇలా అని మహాకవి రిల్కే వాక్యా లుదహరిస్తాడు "He who pours himself out as a spring shall find recognition'—

Recognition = ప్రత్యభిజ్ఞ, అంటే పునః స్వస్థితికి పోవటం-దూరంగో పోయి ఇంటికి తిరిగిరావటం.

ఈ వస్తువు కర్తతో సంబంధము లేకుండా పురాణ చక్రానికి వొదిగిపోతుంది. ఒక ప్రత్యేకాకృతి ధరిస్తుంది సంగీతంలాగా దీని అవగాహన తర్కానికొదగదు. ఒక మహానుభవం తర్కాతీతమే ఎప్పుడూ. ఒక జెన్ బౌద్ధాచార్యుని శిష్యుడడిగాడట. "స్వామీ! ప్రథమ సూత్రమేది?—(First Principle) = అగ్రమందున్న ప్రశ్న ఉపనిషత్తుల్లోనూ వుంది. అగ్ని శబ్దమే అగ్ని—సర్వజన ప్రథమమూర్తి) అని ప్రశ్నిస్తే — "చెబితే రెండోదవుతుందిరా ఎలాగురా" అన్నాడట. మనస్సు పుట్టుక పూర్వమున్నదాన్ని—దేని నుండి ఇది పుట్టిందో దాన్ని—ఇదెలా అనువదించ గలదు—

ఈ పురాణగాథ అనేకం మార్పులకు లొంగినా, ప్రతి యుగంలోను అదే వివిధ రూపాల్లో నటిస్తుంది (ఆధునిక కళల్లో. సినిమాల్లో రామాయణాది కథానుసారంగా సాంఘిక కథలనేకం వచ్చాయి కదా)

కనుక పురాణ కథ తనను తాను వివరించుకొనేది కాదు అగ్రవస్తువను యథాతథంగా కలిస్తుంది—గాధారూపంలో తప్ప తర్కం కాదు కనుక—అంటూ Malinowski భావాన్నిలా అనువదించాడు. (ఇతడు Myth and primitive psychology అన్న గ్రంథం వ్రాశాడు. అతడు Trobriand Islands లో అనుభవించి దీర్ఘకాలముండి చూచి వ్రాసాడట. అక్కడ ఈ పురాణగాథ సజీవంగా వుందట (గ్రంథ రూపంలో కాదు జీవితంలో) కెరిన్యే అంటున్నాడు:
The myth he (Melinowiski) says is not explanation but forword to satisfy scientific curiosity it is the re-arising of a primordial reality in nerrative forms. Myths, never, in any sense explain, they always set up some precedent as an ideal and as a gurantee of the continuance of that ideal—(p. 6)

కనుక మత్స్యగంధి-పరాశర కథ-వేదవ్యాస జననం-యథాతథంగా కథితమైనదే తప్ప నేటి మన మేధా సంతృప్తికోసం అది ప్రయత్నించలేదు. ఇది రంకుకథగా వ్యాఖ్యానించింది; మనమూ మన మనస్సు తప్ప—కథాకాదు—కథాకర్తకాదు. అలాగే కర్ణ జననమున్నూ (అది రంకుకథలైతే వాటికా ధార్మికేతిహాసాల్లో చోటుండేదే కాదు. దేవాలయాలమీద బూతుబొమ్మల్లాగా, అది బూతు బొమ్మకాదు కామకళ—అంటే స్థాయి మన నేత్రిమీద—అందకుండాపోతుంది)

ఈ దృష్ట్యా పురాణగాథ సృష్టికి మూలకారణ కథనం చేస్తుందే తప్ప కళాత్మకంగా—శాస్త్రీయంగా వివేచించదు.

The myth in primitive society....
performance—p. 5

అన్న వాక్యాల్లో పురాణగాథా నిర్వచనం వివేచింపబడినది.

ఈ వివేచననుసరించి పురాణ లక్షణాలివి.

1, సృష్టి ప్రారంభ దశను—అగ్రస్థితిని చెప్పేది, పురాణసృష్టి కాదిమ మూర్తులైన కుమార దేవతా స్వర్గాన్ని గ్రీకు పురాణాలభివర్ణిస్తాయి. (మనవీ ఇంతే ఉదా:—కుమారుడంటే సృష్టి స్వరూపమైన ఆదిమమూర్తి. ప్రాగ్రూపమనీ, ప్రథమచ్ఛదమనీ, యూంగ్ చెప్పినది ఇదే—వివరాలతు చూ .. నాకుమార భారతి) వారు త్రికాల పర్యంత జీవులు అయినా కుమారులే. ప్రతి సర్గమూ ఒక కుమార మూర్తి జన్యమే. విశ్వంపునరావిర్భూతి పొందుతున్నది. ప్రళయమూ పొందుతున్నది. ఆ ప్రారంభ పునఃసృష్టి కుమారదేవతా జన్మతో మొదలౌతుంది. (వ్యాస, కర్ణాది జన్మ లీస్థాయిలోవి)

Though they are preset all the timens, the mythologems which unfold in narrative form what is coytained in the figuers of the Gods are always set in primordial time. This return to the origins and to primordiality is a basic future of every mythology (భారతం సంభవ పర్వంతో ప్రారంభమై స్వర్గారోహణంతో అంతమౌతున్నది. ఈ ఆరోహణ-అవరోహణ రూప విశ్వచక్రభ్రమణాన్ని సుందర కథారూపంలో గంభీర పాత్రలద్వారా ధర్మ గమనంలో సాగే వృత్తి ప్రయాణం పురాణం కనుక ఇది మహోక్కృత Cosmic story తప్ప చారిత్రక వాస్తవం కాదు. అయినా కాకపోయినా దాని పరమార్థం చరిత్ర సత్యకథనం కాదు. ఈ ఖండరూప వస్తుస్థితిని ఆ కోణార్కరథ చక్రంలో మలచి వక్రంగా—అతుకుతున్నాడు పురాణకర్త. వాస్తవికాంశాన్ని బృహత్సత్యాని కతకటం వస్తు యదార్థ తత్త్వ కథనం చేయటం) తత్త్వవేత్తకూ పురాణసృష్టికర్తకూ ఉన్న భేదం—The philospher tries to pierce through the world of appearences in order to say what "really is" but the teller of myths steps back into

primordiality in order to tell us what originally was. కనుక శ్రోతను విశ్వప్రారంభ బిందువులోనికి తీసుకొనిపోతుంది. దాన్ని మన అవగాహనకు తెస్తుంది. ఆ ప్రారంభ బిందువు సదసత్తులకు-మృత్యు అమృత సంగమ స్థలం the abyss of the Nucleus కనుక మనం గతంలోకి పోయి పోయి మన మొదలేదో ప్రారంభస్థితి యేదో ఆ బిందువులోనికి పోతున్నాం. (ఇక్కడ వెనక-ముందు అన్న మాటలు చరిత్రకాలం కాదు. మన స్తత్వ సంబంధ దేశకాలాలు, అంటే స్వప్నంలో పది/వంద ఏళ్ళ కాలానుభవాన్ని పొందు తున్నాం, లేచేసరికి ఆ స్వప్నమంతా గంట కాలంలో జరిగిందని తెలుస్తున్నది. స్వప్నకాలం వేరు, జాగృతకాలం వేరు. పౌరాణిక దేశకాలాలు చారిత్రకాలు కావు. భారత కథ జరగటానికి 2, 3 జీవితకాలాలు పట్టింది (శంతన-భీష్మ-ధృతరాష్ట్ర) కౌరవ పాండవులు-నాల్గు తరాల కథ మనము చూచిన సినిమా మూడు గంటలు మాత్రమే. ఈ అల్పకాలంలో అంత సుదీర్ఘ కథానుభవమెలా కలిగింది?—) అది సర్వ జగత్తునకు ప్రతిష్ఠ-ఆధారం.

ఈ ఆధారభూతమైన దివ్యప్రపంచాన్ని దర్శించి-అనుభవించిపునఃసృష్టి చేయటం పురాణ నిర్మాతచేసే పని. ఆ బృహత్ సత్యప్రపంచానికి పురాణం ప్రతిబింబం. ఈ ప్రతిబింబంగా ఆ మహత్తు మారటమంటే ఇది కర్మగా చేష్టగా పరిణమించటం. ఈ పురాణం సజీవంగా జీవితంలోనే వాస్తవిక ప్రపంచంలాగా-అనుభవానికందిన అకృత యుగాల్లో (ఆదికాలం) నిర్మించిన నగరాలు స్వర్గ ప్రతిబింబాలు-శిల్పిత ప్రతిమలు (ఇది పూర్వాధ్యాయంలో చెప్పబడినవే-భారతాదుల్లో మయ-విశ్వకర్మలు నిర్మించిన నగరాల కథలు వచ్చాయి. అవి విశ్వప్రతిబింబాలు కనుకనే నగరం మధ్యలో దేవాలయం = తత్త్వబిందువు నిర్మితమౌతున్నది.)

# 5. దేవనగరి

అయోధ్య దేవతా నగరమని అథర్వవేదమన్నది-ప్రవేశించటానికి కష్టమైనదని మామూలు అర్థం. 'దుర్గమం' మానవలోక గమ్యం కానిదన్నట్లు. అమరావతి-పేరు మన దేశంలో మన రాష్ట్రంలోనే కాక మహారాష్ట్రాదుల్లోను వుంది. దీనికి కారణం శాతవాహనులు కావచ్చు. ఎసరైనా నామ తాత్పర్య మేమంటే ఇంద్రుని రాజధాని కది ప్రతినిధి. దేవలోకంలోని అమరావతి ప్రథమచ్ఛదం (ప్రాగ్రూపం) కాగా దానికిది భూలోక ప్రతిబింబం, ప్రతినిధి. రాజు ఇంద్రునికైనట్లు. కనుక ప్రతి రాజధానీ దేవనగరికి ప్రతీక. దాని నిర్మాత మయుడు. విశ్వకర్మ కనుకనే పురాణాల్లో ద్వారకాదులను విశ్వకర్మ నిర్మించాడనటం జరిగింది. నగర నిర్మాణం విశ్వనిర్మాణ ప్రతీక. విశ్వ రచన కది ప్రతిబింబం. దీని ద్వారా అది గమ్యం. కవిత్వం ద్వారా రసం-మనలో వున్నదే-చేతికందిన బావినీరులాగా అందుతున్నది. ఏకాగ్రత, ధ్యానశక్తి బహుశా మనోభూమికలను చీల్చుకొని అంతశ్చైతన్య స్పర్శ పొందినపుడు జరిగే కర్మనుండి విశ్వరహస్య నిర్మాణం సృష్టిరచనలో యథాతద్యత (యథాతథ్యతోర్థాన్-ఈశ) బుద్ధి కందుతున్నది. కనుక మనిషి పూర్ణతా సిద్ధి నందినపుడు శరీర-ప్రాణ-మనసులన్న త్రివిధ భూమికలు ఆత్మ లగ్నమైనపుడు బహిరుపాధి విస్తృతమై అంతశ్చైతన్యం స్వప్నంద్వారంగా బహిర్గతమైనట్లు తత్తుల్యమైన కళల ద్వారా—సృష్టి రచనా రహస్యమే వ్యక్తమౌతున్నది—దీని ద్వారా దానికి పోవాలి.

Cities built in periods that knew loving mythlogy and claiming to be the images of the cosmosic are founded just as the cosmogonoic mythologems give grounds for the world (Science of mythology)

అంటే అయోధ్య - ద్వారకాదులు వంటి పౌరాణిక నగరాలు - బౌద్ధయుగం లోని వైశాలి-సుఖావతి-కుశావతి వంటివి—చారిత్రక నగరాలు విజయనగరం వంటివి (దీని నిర్మాత మహర్షి విద్యారణ్యులు—అని మరువరాదు) సృష్టి పథకాన్ని అనుసరించి నిర్మించారు కనుకనే అవి విశ్వకర్మ (తదాత్మ తాదాత్మ్యమను భవ సంపన్నుడైన ఏ వాస్తుశిల్పి అయినా విశ్వకర్మే) నిర్మాణాలన్నాడు కనుకనే అవీ, పుణ్యక్షేత్రాలు రెండూ వకటే.

అష్టదిశలు పాలకులు—ఆకాశం (ఆత్మ) భూమి (పదార్థం) ఈ దశ దిశలతో కూడుకొన్న విశ్వప్రతీకగా నగర నిర్మాణం జరిగేది కనుక అది కేవలం నేటి వాస్తువు కాదు. ఇది ఆధ్యాత్మిక గుప్త రహస్యానుసారంగా చేయబడేది కాదు గృహనిర్మాణానికి వాస్తువు చూస్తున్నాం తప్ప ప్రభుత్వ భవనాలకు చూస్తున్నామా? (ఇది యాంత్రిక భౌతికవాస్తువు).

నాల్గు దెసలు—నాల్గు ద్వారాలు గల కోట. ఇది త్రి-సప్త-ప్రాకారాలుగా వుండేది. నాల్గు ద్వారాలకెదురుగా నాల్గు తిన్నని వీధులు. ఆ కేంద్రంలో దేవాలయం, రాజాదుల భవనాలు ఇత్యాదులుండేటట్లు నిర్మించాలని కౌటిలీయాదులన్నాయి. అంటే వాస్తువులో సృష్టి పథక ముండేదన్నమాట (వివరాలకా గ్రంథాలు సంప్రదించుకోవాలి) ప్రాకారాలు 3 కానీ 7 కానీ ఎందుకూ? అవి సప్తచక్ర సంకేతాలు. సప్తలోక సంకేతాలు 3 అంటే త్రిగుణాలు - చైతన్య భూమికాత్రయం - సప్త చక్రాల్లో వున్న గ్రంథత్రయిం—ఇలా అనంత విషయాలు కవి ప్రతీకలు. దేవాలయ ప్రాకారాలింతే కదా. ఒక శ్రీరంగం-మధుర-చిదంబరం వంటి చోట్ల ఇంతే. తిరుమలకు, శ్రీకాళహస్తికి మూడే ప్రాకారాలు (శరీరత్రయం—స్థూల సూక్ష్మ కారణాలు) దాటితే కానీ అంతశ్చేతనజ్యోతి కనరావటంలేదు. కనుక నగరం = దేవాలయం, ప్రజలు = దేవతలు, రాజు = ఇంద్రుడు. ఇది భావ (Ideal) రాజ్యం (kingdom) ప్రతి ప్రభుత్వ విధానానికీ రాజనీతికి లక్ష్యభూమి. ప్లేటో-మనువు-మార్క్స్ (భౌతికవాది అయినా) మొదలైనవారంతా ఈ ఆదర్శ[1] (భావ) రాష్ట్రాన్ని అవతరింపచేయాలన్న తపన కలవారే. క్రీస్తన్న నా తండ్రి రాజ్యం స్వర్గంలో వుంది అంటే దేవతానగరిని చెప్పటమే. ప్రథమచ్ఛదాన్ని వివరించటమే. అదే తలక్రిందులై ఈ భూమి పైన రాజధాని కావాలి మనిషి నీడలాగా.

---

1. మార్క్స్ ప్రతిపాదించిన ఆదర్శ రాష్ట్రం—Myth— అన్నాడు యూంగ్. (చూ. Man and his symbols). మార్క్స్ భౌతిక వాదానికి విరుద్ధంగా భారతీయ రాజధర్మ — సంఘ నిర్మాణాదులు నిర్వచింపబడ్డాయి. (చూ, Manu Dharmaṣastra—A study—by Kewal Matwani.)

రోము నగర నిర్మాణం వృత్తాకారంలో కాదు చతురస్రాకారంలో జరిగిందనీ (Rome Qwadrate) దీని సమన్వయింగా నేటి మనస్తత్వ పురాణశాస్త్ర వేత్త ఒకొక సమన్వయం ప్రతిపాదించారు.

The figure that combines the circle with the same is in fact not unknown over a wide field of mystic usages and experience అంటూ కెరేన్యే తన "పురాణ శాస్త్రం"లో ఇది బౌద్ధ-హిందూ తంత్రాల్లో చెప్పబడ్డ యంత్రం మండలాకారమేనంటూ హీనీరిచ్ జిమ్మర్ శ్రీచక్ర-శంబర తంత్ర గ్రంధానుసారంగా చెప్పిన విషయాన్ని వుదాహరించినాడు.

ఈ పథకం మీదే బోరోబూదూరు. అద్భుత బుద్ధ దేవాలయం నిర్మాణం జరిగిందట. ఈ మండలంలో[1] శిష్యునకు గురువు దీక్షనిస్తాడు. క్రింది భూమిపై రంగుల రంగుల[2] ముగ్గుల్లో వ్రాసి—అందులో శిష్యుడు పునః తన ఆత్మ సామ్రాజ్యంలోకి ప్రవేశించటం తన జన్మ మొదలేదో ఆ ప్రశాంత స్థితిలోకి తిరిగి వెనక్కు[3] ప్రయాణిస్తాడు, 'An ideal city based on a mandala plan in the heavenly Jurusalam of the apocelypse. I s four corners being spread on the cricle of the Zodiac-(పై గ్రంథం పు. 13 అథోజ్ఞాపిక) ఇదే అమరావతి అంటే.

దీన్ని దేవాలయ నిర్మాణ విషయంగా మన పండితులన్నారు.

మండలోపాసననే Jung—Individuationగా చెబుతున్నాడు. మనిషి బాహ్యేంద్రియ ప్రవృత్తుల ద్వారా వెచ్చపెట్టే శక్తులను కూడగట్టుకొని అంతర్ముఖీనుడై అంతశ్చైతన్యంలోకి పోవటం, బాహ్య ప్రవృత్తుల ద్వారా రవ్వలై వృధాగా పోతున్న మణి శకలాలను కూడగట్టి తిరిగి ఒకే మణిగా చేసుకోవటం, ఈ అంతర్మణి దర్శనమే Individuation (మణి ద్వీపం శ్రీచక్రం)

చూ. వివరాలకు Man a his symbols)

---

1. చూ. Tibetan Tantra లో మండలార్చన.

2. రస విషయంలో గుప్తుల ప్రస్తావన నాగార్జున కొండపై బౌద్ధ విహార నిర్మాణాలు ఇంతే.

3. ఇదే Individuetion proces గా చెబుతున్నారు యూంగ్ సిద్ధాంతానుసారంగా—(చూ. Man and his symbols).

మండల స్థితుడై ఉపాసించే పద్ధతినే అధునిక మనస్తత్వ శాస్త్రజ్ఞులు Individuationగా అభివర్ణిస్తున్నారు.

పురాణ మంటే అతిప్రాచీన (ఆత్మ) అగ్రవస్తువును వ్యాఖ్యానించేది. జీవ ప్రారంభ దశను వివరించేది అంటాడు కెరిన్యే—పురాణ నిర్వచనమిదే కదా. కనుకనే పూరాతనమైనా నవీనమౌతున్నది. ఈ ప్రారంభం (origin) అంటే:

1. పురాణ కథావస్తువు ద్వారా భూమికా ప్రదానం.

As the context of a story or mythologem it is tha "swing of grounds" es the context of an act it is the "form doing" of a city or a world. In either case it means man's return to his own origins and consequently the emerger cecf some thing original. So, for as accessable to him, in the form of primordial images mythologems. All the manifestetions may be menifestation of the seme thing ceprmony. The same Mythoiogical idea. wether does a definite mythological idea spring from, such as the mandela which is still drawn to-day in East and West alike with the same meaning.

ఈ మండలంలోని చతుస్సంఖ్యా సూత్రం (quadri-partition) చతుర్దిశా విషయమే. నగరనిర్మాణంలోని నాల్గుద్వారాలివే.

ఈ విషయంలో జిమ్మర్ "The adept causes rays coloured after the four quarters—blue, green, red and yellow—to proceed form the seads of Mahasukha* whose form he himself has taken in his mind's eye. The coloures ensure that his feeling of universal comparssion perveds the entire cosmos.' (p. 15)

ఈ ఛందస్సూత్రం మానవ అంతశ్చైతన్యమైన కేంద్రబిందువు self గా యూంగ్ వ్యాఖ్యానిస్తున్నాడు. కనుక ఈ ఛందస్సూత్రం మానవ మేధాజనితం

---

* మహాసుస్సనదసుత్తంలో అతడు నాలుగు దెసలకు చూడడం - ఆయా రత్నాలు అతనిని వర్ణించటం-కథ దీనికి సంబంధించిందే.

(చూ. నా శ్వేతచ్ఛత్రం)

కాక మరి 'a sponteneous product of objective psyche a fundamental theme of mythology could be understood by refering it back to the inorganic in men. But we have an example of four foldness rather than nearer to the egion of mind in the origin of the organism itself.

(Science of Mythology 17)

"ముందు ఒక స్థలంలో వృత్తం కానీ సమచతురస్రం కానీ చిత్రించి వాల్గు దశలకు నాల్గు ద్వారాలు గుర్తిస్తారు. తర్వాత "With the appearence of the first quarter of the moon they began marking out the circumference and the four gates. A bull was led three times round the city. He was then brought into the place marked of together with three cows. After covering three of them he was sacrificed. His member was buried in the middle of the new city and a phallic alter erected along side a sacrificated pit (that is, in the middle of the city's layout, Then is a combined mother and father emblems) always three animals were sacrificed on the alter, four in the pit' ఇలా ఉదాహరించి కెరిన్యే అంటాడు. "ఒక వంక చంద్రుడు, పురుషుడు త్రి సంఖ్య మరొక వంక రవి, నాల్గు అంకె. స్త్రీ—వీరి సమ్మేళనంపై దాంపత్య సూత్రం మీద నగర నిర్మాణం జరుగుతున్నది.

యూంగ్ ప్రకారం మండలం మూడుగా విభక్తమై పురుషులలో వుంటుంది- హిందూ మండలంలో త్రి సంఖ్య స్త్రీత్వ ప్రతీక గ్రీకులకు పురుషత్వ ప్రతీక. స్త్రీత్వ సంఖ్య 2 దీన్ని ద్విగుణించి లెక్కించడం అది స్త్రీత్వ ప్రాథమిక సంఖ్యగా చెప్పటం పైథాగరిస్‌లాంటి వారన్నారు. యూంగ్ ప్రకారం మండల నిర్మాణ రహస్యం మనకుతెలియదని—అంటే మహాతత్త్వ రహస్యాన్ని కొందరు స్త్రీ పురుషునిగా చూచారు.

ఇలా నగర నిర్మాణ రూపాలు మండలంలో వుంధంటాడు కెరిన్యే. కనుక పదార్థ జగత్తులోని అనేకత్వం ప్రారంభదశలోని ఏకత్వ బిందుత్వం—రెంటినీ ఒకేసారి రెండు కళ్ళతో చూడగలగటం మన విధి, కర్తవ్యం ఎందుకంటే ప్రాణ జీవన బీజంలో ఒక గుప్తమైన ప్రబోధం వుంది. ఆధ్యాత్మికతకున్ముఖంగా అంకురించే బీజమది—కనుక పురాణ విద్య-గాథ-దీనికి సంబంధించింది.

# 6. భారతీయ ఇతిహాసం

## గంగ కథ :

రామాయణంలో వాల్మీకి మహర్షి అహల్య కథకు ముందుగా గంగ— సముద్రమథన కథలు వ్రాసాడు. ఈ మూడు కథలు ఒకే గుచ్ఛంగా చూడదగ్గవి కనుక ఒకేచోట కూర్పటం జరిగిందని భావించాలి. గంగ కథలో తాత్పర్యమేమిటి?

ఈ కథ ఋగ్వేద సృష్టి విద్యకు సంబదధించినది. ఋగ్వేదంలో సప్త సింధూ వృత్తాంతమున్నది. సముద్ర కథ వుంది. సముద్రమూ-నదీ వృత్తాంతం సృష్టి వృత్తాంతం. వేదోపనిషద్వాఙ్మయంలో సృష్టి జలం నుండి సముద్భవించిందని చెప్పబడటం స్పష్టమే. ప్రసిద్ధమైన పురుషసూక్తం—ఐతరేయోపనిషత్తు ఋగ్వేదంలోని కొన్ని మండలాల్లోని మంత్రాలూ దీన్నే స్పష్టం చేస్తాయి. దీని ప్రతీకార్థం శ్రీ అరవింద మహాయోగులు చెప్పిన వేదరహస్యం నుండి గ్రహించదగింది.

నాసదీయ సూక్తమంతా సృష్టి పూర్వస్థితి నుండి సృష్టి ఎలా ఏర్పడినదన్న విషయాన్నే వర్ణిస్తున్నది. ప్రపంచ మంత్ర సాహిత్యంలో ఆ సూక్త మొక అద్భుత సృష్టి. దాని ప్రకారం :

'సృష్టికి పూర్వం అంధకార మంధకారాన్ని ఆవరించివుంది. అక్కడ మనస్సు లేదు. అక్కడ నుండి తపశ్శక్తిచే ఒకడు రూపధారణం చేసాడు. మనస్సుగల రేతోబిందువై అతడు కామస్వరూపుడై అక్కడున్నాడు. ఋషులు అసత్తులో ఈ సత్స్వరూపుని తమ హృదయాల్లో దర్శించారు. వారి ఆ కిరణం సమాంతరంగా ప్రసరించింది. పైనొకటుంది. క్రిందొకటున్నది.'

పైదొక సముద్రం. క్రిందిదొక సముద్రం. పైది అంభస్తత్వం. వాటిని 'అంభస్సు'లనే అంటారు. క్రింది జలాలు 'అపస్సు(అప్పు)లు. పైది ఏకార్ణవమనీ అనబడింది. ఇదే గంగ కథలో ఆకాశ గంగ. ఈ సముద్రం హృదయ సముద్రం. అందులో నుండి మధుమంతమైన ఊర్మి ('మధుమంతం-ఊర్మిం'

ఋగ్వే-4-58-11) పైకి పొంగింది. దాన్ని నేను ఆస్వాదిస్తున్నానని వామదేవ సూక్తం చెబుతున్నది.

'జలవేగం నుండి జన్మించిన ఓ అగ్నీ. దేవపురుషా! మేము నీ మధూర్మి నాస్వాదింతుముగాక'. అక్కడ ముక్తి-ఆనందస్వరూపంగా జలం వర్ణింపబడింది. ఈ జలం సింధు—సముద్ర ధ్యేయం కలదట. అంటే హృదయస్థానం—ఆనంద స్వరూపమే ధ్యేయంగా కలది. కాబట్టి ఈ జలాలు ఆనందస్వరూపం. ఇంతేకాదు అవి విశ్వబీజాన్ని—పురుషుని గర్భధారణం చేసాయట. వాటినుండే అగ్ని— సర్వజీవ స్వరూపుడు జన్మించాడు. అందుకే అతడు 'అపాంనపాత్తు' జలజన్ముడ నబడినాడు. మహాచైతన్యమైన అగ్ని పదార్థ బీజస్వరూపమైన జలగతుడు కావటం పేరే సృష్టి పదార్థ సృష్టిలోకి అతడు ప్రవేశించటం పేరే సృష్టి. పదార్థ సృష్టిలోకి అతడు ప్రవేశించటం అనుప్రవేశ విద్యగా చెప్పబడింది. ఆ దివ్య జలాలు ఆ దివ్యశిశువును భూలోకంలోకి పదార్థ చైతన్యంలోకి ప్రవేశపెట్టాయి. ఇందుకే జలాలను అదితి అంటారు.

ఆపో దివ్యాః—స్వర్వతీరాపః—అని తత్ స్తుతి. ఆ నీళ్ళు దివ్యములు. గర్భంలో సూర్యకిరణం వున్నదట. ఈ కిరణమే అగ్ని—జీవస్వరూపమైనవాడు_ సర్వజీవ ప్రతీక. 'ఆ దివ్యజలాలు సహజ సిద్ధాలయిన కాలువల నుండి ప్రవహిస్తున్నవి. లేదా త్రవ్విన వానిగుండా ప్రవహిస్తున్నవి. అవి పరిశుద్ధ జలాలు. సముద్రోన్ముఖంగా ప్రవహిస్తున్నాయి. అవి మమ్మల్ని పుష్టి చెందించుగాక' (7-49) అని వశిష్ట మహర్షి స్తుతిస్తున్నాడు. ఆ జలాలు సర్వదేవతా గర్భాలు. ఆ జలాలను కాలువలు త్రవ్వి మళ్ళించిందెవరు?—వరుణుడు. సూర్యునితో పాటు దారిలేని అనంతంలో దారులు కల్పించాడని. కొన్నిచోట్ల ఇంద్రుడు దారులు కల్పించినట్లుగానూ ఋగ్వేద కథనం. కనుక సూర్యేంద్రులు మార్గకృత్తులు.

ఇంకా విచిత్రంగా వామదేవమంత్రాల్లో (4-58-5.7) ఇలా వుంది. 'ఈ జలాలు హృదయ సముద్ర నిర్గతాలు, వాటిని శత్రువు నూరు చెరసాలల్లో బంధించాడు. అందుకని అవి కన్పించవు. వాటికోసమే నాగవేషణ. ఎందుకంటే వాటిలో హిరణ్మయశరముంది. (బంగారు రెల్లు-కుమారస్వామి-అగ్ని-సర్వజీవ స్వరూప మహాచైతన్యం) అవి కేవలం నదీ ప్రవాహాల్లాగా వుంటాయి. అవి హృద్గత మనస్సుచే పవిత్రాలు. అవి గోపాలుని పాలనలో ఆలమందల్లాగా సంచ

రిస్తాయి. అవి సింధు స(ముద్ర) ధ్యేయాలు. అదుపు తప్పిన గుర్రాలై పరు గెత్తుతున్నవి ...

దీనికర్థం—దివ్యజ్ఞానం భౌతికాలోచనల కడుగున ప్రవహిస్తున్నది. వాటిని శత్రువులు-భౌతిక విషయమగ్నమయిన మనోరూప వాంఛలు—కన్పించ నివ్వకుండా దాస్తున్నారు. దివ్యజ్ఞాన తేజోమహితమైనపుడు వాటిలో శక్తివేగం పెరిగి అశ్వంలాగా పరిక్రమిస్తున్నవి. ఈ దారుల ధ్యేయం ఆనందరూపమైన ఆకాశసముద్రం—ఏకార్ణవం. ఇది వ్యష్టిదృష్ట్యా ముక్తి పరిక్రమణ విషయి కంగా అరవిందులు వ్యాఖ్యానించారు,

ఈ ఏకార్ణవం — మహాసముద్రం — మూలప్రకృతి నుండి కాలువలు త్రవ్వింది ఇంద్రుడు. అవి సప్తప్రవాహాలుగా క్రిందికి వచ్చాయి. ఈ సప్తసంఖ్యా ప్రవాహాలూ దేనికి ప్రతీకలు? భూలోకాది సత్య లోకాంతమైన సప్తతత్త్వాత్మిక శక్తులు. ఇవే సప్తమాతృకలుగా చెప్పబడడమూ వుంది, ఈ ఏడు జీవునియొక్క ప్రయాణములోని అంచెలు. పైనుండి క్రిందికి రావడము, క్రింది నుండి పైకి పోవడము—రెండు రకాల ప్రయాణాలు. ఈ ఏడు+ఏడు కలిపి పధ్నాలుగుగా పౌరాణికులు వర్ణించారు. జీవుడు పరిపక్వ బుద్ధిని పొందినకొలది పరమేశ్వర స్థానానికి చేరుకొంటాడు. ఈ సప్తభూమికలలోను మహాపురుష చైతన్య మభి వ్యాపించివుంటుంది. అందుచేతనే అగ్ని సప్తధామములు (స్థానము లేక గృహము) కలవాడుగా చెప్పబడ్డాడు-ఋగ్వేదంలో. ఈ సప్తధామాలు సత్తు, చిత్తు, ఆనందము లను మూడు ఈ మూడూ దివ్యస్థానాలు. ఇవి ఊర్ధ్వలోకమందలి చైతన్యము యొక్క అంగాలు. ఈ మూటికి క్రింది లోకములో ప్రతిస్పర్థులు—సత్తునకు వ్యతిరేకముగా భౌతికద్రవ్యమున్నది, చిత్తునకు ప్రతిరూపంగా భౌతిక ప్రాణశక్తి వున్నది, ఆనందానికి వ్యతిరేకంగా పరిమితమైన లౌకికానందమున్నది. ఈ మూడు కలిసి మృత్యురూపమైన జీవుని భౌతికస్థితి. ఇది మృత్యువని, అది అమృతమని సంకేతించబడ్డాయి. అమృతమే ఆకాశంగా, మృత్యురూప జగత్తే భూలోకంగా వున్నాయి. ఈ రెండు లోకాలను బంధించే ముడి యొకటున్నది. దానిపేరు విజ్ఞానము, లేక కారణభావము. ఇది క్రింది దానిని పైదానికి అన్వ యింపచేధి. ఈ ఏడుజగాలుగా వేదఋషులు కీర్తించారని అరవిందులు 'ఈశావాస్య

భాష్యం'లో అన్నారు, ఈ సప్తకంలో వ్యాపించిన మహాచైతన్యము పేరే అగ్ని. అతడే కుమారస్వామి. కుమారస్వామి కథంతా దీనికి సంబంధించినదే

పురాణాల్లో జలకథ విస్తరించబడినది. పైనున్న మహాసముద్రం అగాధస్తబ్ధ సలిలమనీ, అది నీహారముతో ఆవరింపబడినదనీ హరివంశం వర్ణిస్తున్నది. నీహారమంటే—నేటి భాషలో నెబ్యులా) ఏకార్ణవమే ఏడు నదుల్లుగా మారింది. ఈ సప్త ప్రవాహాలే పైన చెప్పిన సప్తలోక విషయము. ఈ స్తబ్ధసలిలం లోపల అగ్నితత్త్వం మనోబీజంగా వున్నదని 'నా సదీయ సూక్తంలో' చూచాము. అది తపించి సృష్టి కామంచేత వేడెక్కిపోగా స్తబ్ధసలిలం క్షుబ్ధసలిలంగా మారింది, ఈ క్షుబ్ధతను తపస్సుగా వర్ణించారు. ఈ నీహార ఆవృతే హిమాలయం. గంగ అతని కూతురనడంలో వున్న ప్రతీకార్థమిదే. తపస్సంటే రజస్సు—సంచలనము. ఇదే కామంగా వర్ణింపబడింది. స్తబ్ధసలిలంలో ఏర్పడ్డ కదలిక రజస్సు (లేక) తపస్సు. ఇది దివ్యాగ్ని. దానికి ప్రతీక సూర్యుడు. సృష్టి ఈ రజోగుణము నుండే ఏర్పడుతుంది. కాబట్టి సూర్యుడు స్తబ్ధసలిలంలో రజస్సుగా మారి ఏడు ప్రవాహాలు త్రవ్వాడు. అంటే పరమాత్మ స్వరూపమైన అగ్ని తనకు తాను సప్త భూమికలలో నిక్షేపించుకొన్నాడు. ఇలా ఏకచైతన్యము సప్తవిధలోక చైతన్యంగా తన్నుతాను విభజించుకొన్నది. మళ్ళీ తిరిగి ఈ దశనుండి ఆ మొదటి దశకు చేసే ప్రయాణము ముక్తిమార్గం. ఇదే వామదేవుడు హృదయ సముద్రము నుండి ఉద్భవించిన ఒక తేనె కెరటాన్ని ఆస్వాదిస్తున్నానన్నాడు. అంటే ఏడు విధాలుగా విభక్తమైపోయిన పదార్థ జగత్తులో అడగున మహానంద స్వరూపమైన చైతన్య ముండగా దానిని మహర్షి ఆస్వాదించాడు. ఇదే విషయము 'ఐతరేయోపనిషత్తు'లో వామదేవుడే ఇలా చెప్పాడు—

'నన్ను దేవతలు వంద ఇనుపకోటల్లో బంధించారు. నేను గరుత్మంతుడనై ఆ కోటలను భేదించుకోని పైకి వెళ్ళాను.

ఇది పదార్థంలో బద్ధమైన చైతన్యం విముక్తం కావటాన్ని ప్రతీకాత్మకంగా వర్ణించటమే. ఇదే విషయాన్ని వామదేవుడు 'ఈ దివ్య జలాలను శత్రువులు నూరు చెరసాలల్లో బంధించారు' అని చెప్పిన మంత్రం పైన వుదహరింపబడింది. కాబట్టి ఈ ఏకార్ణవం—ఒకానొక మహాసముద్రం (అవిభక్తమైన పరమాత్మ)

సప్తవిధాలుగా (లోకాలుగా) అవతరించి తిరిగి మళ్ళీ ఈ ప్రవాహములను ఏకార్ణవములోనికి మళ్ళించుకొంటున్నాడు. ఇదే మూడు అంచెలుగా అరవిందులు చెప్పినట్లుగా పైన మూడు క్రింద మూడు, రెంటిని కలుపుతున్న కారణభావం. ఈ మూడు ఆకాశం, భూమి, అంతరిక్షములన్న ప్రతీకలుగా ఋషులు వర్ణించారు. ఈ మూటిలో విక్రమించడమే త్రివిక్రమ తత్త్వరహస్యము.

ఈ ఏడు ప్రవాహాలు సూర్యుని యొక్క సప్తకాంతులు. ఇందుకే జలాలు సూర్యగర్భాలని చెప్పడం జరిగింది. జగత్తు సప్తవర్ణాత్మకం. ఈ ఏడు ఇందాక చెప్పిన సప్తలోకాలు. ఈ ఏడు ఏకైక సూర్యకిరణ వినిర్గతాలు. ఇందాక చెప్పిన జలము, ఇక్కడి వెలుగు రెండూ ఒకటే. 'వాయుపురాణం'లో ఆకాశగంగ 'అంబరనది'గా వర్ణింపబడినది. అది సోమ ప్రవాహమట. (దీన్నే తేనె కెరటంగా ఋగ్వేదం చెప్పింది) అది సప్తమ వాయుస్కంధంలో ఉందట. అది వాయు సూర్యులచేత ప్రేరింపబడి అనేక ప్రవాహాలుగా చీలి మేరువును ప్రదక్షిణిస్తూ దానికి నాలుగు దిక్కులా నాలుగు ప్రవాహాలై ప్రవహించిందని ఒక అద్భుత వర్ణన మున్నది. దీని ప్రతీకార్థమేమంటే వాయువు పేరు మాతరిశ్వుడు. మాతరి— మాతయైన జలాల్లో, శ్వ—శయనించినవాడు. మాతృగర్భములో విస్తరించినవాడని తాత్పర్యార్థము. అతడు సమష్టి ప్రాణస్వరూపుడు. సూర్యుడంటే తపః—కామ రజశ్శక్తిగా చూచాము. మేరువంటే సప్తలోక స్థితికి సంకేతం. కొండను క్రింది నుండి పైకి అధిరోహిస్తాము. మానవుడు కూడ అధోలోకం నుండి పైకి ఊర్ధ్వ లోక ప్రయాణం చేస్తాడు. ఇదే కొండ ఎక్కటం. మన పుణ్యక్షేత్రాలు దేవాలయాలు కొండలమీదున్న రహస్యమిదే. తిరుపతి ఏడుకొండలు ఈ సప్తలోక ప్రతీక. పైనున్నవాడు మహాచైతన్య స్వరూపుడు. కనుక కొండ—స్థితికి, సంకేతము.

ఈ అంబరనదీ సప్తప్రవాహాలుగా చీలి తూర్పుదిక్కుకు మూడు ప్రవాహాలు, పడమటికి మూడు ప్రవహించగా మధ్యది భాగీరథిగా చెప్పబడింది. తూర్పుదిక్కునకు పోయిన మూడు నదులు—నళిని, హ్రాదిని, పావని—పడమటికి పోయిన మూడు—సీత, చక్షు, సింధువులు. మధ్యది భాగీరథి. తూర్పు ఊర్ధ్వానికి సంకేతం, పడమర అధోలోకానికి సంకేతం. ఇది మృత్యువు. అదిఅమృతం. ఈ విరుద్ధ త్రివర్గాల జంటను సమన్వయించే దాని పేరు భాగీరథి. అది విజ్ఞానస్వరూపము (ఇదే యోగులు చెప్పే సుషుమ్న).

ఋగ్వేదంలో సూర్య ఇంద్రు లిద్దరు నటరాజులుగా కీర్తింపబడ్డారు (8-34-12). వాలఖిల్య ఋషులు 60 వేలమంది. వాళ్లు ఉదయాస్తమయపర్యంతము సూర్యునితోపాటు సంచరిస్తున్నారు. వీరు భ్రమణశక్తికి సంకేతము. అంపై— ముప్పైపగళ్లు, ముప్పై రాత్రులకు సంకేతం. కాగా వీరు కాలస్వరూపులు.

ఏకార్ణవస్థితి నుండి దేశ కాల వ్యక్తులేర్పడడం పేరు సృష్టి. దీనినే సముద్రమథనంగా వేదాలు వర్ణించాయి.

సృష్టిలో వెలుగు చీకట్లు—ధర్మాధర్మాలున్నవి. దీనిపేరే మృత్యువు, ఏకం అమృతం. సముద్రం ఏకైక స్థితి. దేవతలు రాక్షసులు ధర్మాధర్మ శక్తులు. ఇద్దరూ అన్నదమ్ములే. (వేదంలో ఆవులనూ—లేక జలాలను దాచింది వృత్రుడు లేక పణులనే రాక్షసులు. వాళ్ళను సంహరించి ఇంద్రుడు జలమార్గం కల్పించాడన్న కథ వుంది. వివరాలకు చూ. 'వేద రహస్యం'). వీరు—ద్వంద్వశక్తులు మథించగా భిన్నస్వరూపమైన సృష్టి ఏర్పడింది. ఆ మథనం నుండి పుట్టినవారు కల్పకం-శంఖం; ఉచ్చైశ్శ్రవం-ఐరావతం-లక్ష్మి-ధన్వంతరి-అప్సరసలు-చంద్రుడు-విషం. ఇవి:

1) కల్పకం—వాక్కు, వారుణీ, మణులు 2) ఉచ్చైశ్శ్రవం—సూర్యుడు, కాలప్రతీక 3) ఐరావతం—అహంకారం 4) అప్సరసలు—సౌందర్యం 5) లక్ష్మి—పదార్థగతచేతన సౌందర్యం 6) శంఖం—శబ్దగుణమైన ఆకాశం 7) చంద్రుడు—మనస్సు 8) విషం--మృత్యువు 9) ధన్వంతరి—విషాపహారి వైద్యుడు 10) అమృతం—తత్త్వం.

రామాయణం చెప్పినది ధన్వంతరి-అప్సరలు-వారుణి-ఉచ్చైశ్శ్రవం-కల్పకం-కౌస్తుభం-లక్ష్మి-అమృతం మొత్తం 8. వారుణి మృత్యుహేతువైన ప్రాణరసం. విషం-మృత్యువు ఇవి మృతతత్వ విరుద్ధాంశాలు. కౌస్తుభం-సంకల్ప శక్తి. కొన్ని చోట్ల 7 రత్నాలనీ కొన్నిచోట్ల 14 గా చెప్పబడ్డాయి. ఇవే లోకాలు-భూమికలు. అన్నిటియందు అభివ్యాప్తమైన తత్త్వం పేరు అమృతం. యోగశాస్త్రం ప్రకారం మందరం వెన్నుపాము. వాసుకి కుండలినీ శక్తి. ఇది ముక్తిమార్గం. సృష్టి విషయికంగా మందరం స్థితిసంకేతం, పాము స్థితిరూప సర్పణం-చలనం.

ఇది వస్తువుగా సముద్ర మథన కథను విశ్వామిత్రుడు రామునకు వ్యాఖ్యానించాడు.

విశ్వామిత్రుడు సృష్టికర్తయైన బ్రహ్మ. బ్రహ్మ తపస్సు చేసే సృష్టి చేశాడన్న పురాణ కథ అనుసంధించుకోవచ్చు. తపస్సు అంటే మథనం. ద్యావా పృథ్వులు అరణులుగా మథిస్తే జీవజాలం పుట్టింది. ఇందుకే బ్రహ్మ విశ్వమిత్రుడు (విశ్వామిత్రుడు). అతడు (బ్రహ్మ) సర్గనిర్మాత. విశ్వామిత్రుడు ప్రతిసర్గ నిర్మాత. రెండు సర్గల విషయం పురాణ లక్షణాలయిన ఐదింటిలోని రెండవది. సర్గం— సామూహిక సృష్టి. ప్రతిసర్గం—ప్రత్యేక సృష్టి. అది భావరూపం. ఇది భౌతిక రూపం. ఇందుకే గంగ కథ (తర్వాతి కథ అమృత మథనం) ప్రారంభిస్తూ శ్రీ విశ్వనాథ :

"నీ, ఆశ్వీనాక్రమణంబులో గల కథా వృత్తాంత విజ్ఞానమే
విశ్వంబుల్ ...." నన్నాడు.

విశ్వామిత్రుడు సృష్టి కథావేత్త—కర్త కనుక అతని కథా విజ్ఞానం విశ్వకళ్యాణ హేతువు. విశ్వప్రకాశ కారణం. అతని కథా నిర్మాణశక్తి గుర్రపు అంగవలె విశాలం. విస్తారం. దూకుతూ పరుగెత్తే కథానిర్మాణ కౌశలం కలవాడు. ఒకమాట అంటే అనంతార్థ గుంఫనం జరుగుతుంది. ఆలోచనా రమణీయంగా వుంటుంది.

ఇది కథానిర్మాణ రహస్య సూచన.

గంగ కథలో సగరుడు యజ్ఞదీక్షితుడైనాడు. అశ్వం వెంట 60,000 మంది సగరులు వెళ్ళి కపిలకోపాగ్నికి భస్మరాసులైనారు. వాళ్ళు రాబోయే గంగా ప్రవాహానికి కాలువలు తీసినవాళ్ళు. సముద్రమంతా వాళ్ళు తవ్వినదే కనుక సాగర మన్నారు.

సగరుడు-అసమంజసుడు-దిలీపుడు-భగీరథుడు ఇది వంశక్రమం. సగరుడు మనుమడైన అంశుమంతని సాయంతో అశ్వాన్ని గుర్తించాడు. కపిలుని వేడుకొని అతడా గుర్రాన్ని తెచ్చాడు. దీనితో యజ్ఞం పూర్తయింది. ఈ యజ్ఞం సృష్టి. మనుమడు పుట్టటంతో తాత మరణిస్తున్నాడు లేదా సన్యసిస్తున్నాడు. మనుమడు వివాహయోగ్యుడైన దశలో తాత వానప్రస్థం స్వీకరించాలని మనువు లోకాన్ని అనుశాసించాడు. (వృద్ధులు యువకులైన వారికి స్థానమివ్వాలన్న వ్యావహారికోక్తికి ఇది శాస్త్రీయరూపం. మానవ జీవితప్రస్థానంలో బాల్య యౌవనాలు వున్నాయి.

కనుక జీవిత వ్యవహారాల నుండి విడివడి అధ్యాత్మిక జీవిత మార్గాన్వేషణ చేయటానికి (ప్రారంభం వానప్రస్థం) తాత-తండ్రి-కొడుకు ఈ మూడు బిందువులను కలిపితే కులమౌతుంది. కులమంటే ఈ ముగ్గురూ కలిసిన కుటుంబం. వ్యష్టిదశలో కుటుంబం: సమష్టిదశలో సృష్టి. ఆకాశం-అంతరిక్షం-భూమి. ఇది కులం-త్రికం. త్రయీ విద్య. 60.000 జీవసమష్టివాచకం. యజ్ఞ రహస్యమేమంటే ఆత్మార్పణం నుండే సృష్టి ఏర్పడుతున్నది. తాత పరిణమిస్తే తండ్రి. ఇతని పరిణామం కొడుకు. పూత నశిస్తేగాని కాయలేనట్లు. ఇది యజ్ఞం. అనంత జీవులు స్వాత్మార్పణం చేయటమే సృష్టివికాసం లేదా కాలసంకేతంగా గ్రహించవచ్చు. (వాలఖిల్య విషయకంగా సూర్యుని వేయికిరణాలు).

భస్మరాశి పదార్థసంకేతం. చివరకు మిగిలేది. అవి చైతన్యంగా పరిణమించటానికి గంగావగాహనం చేయాలి. అందుకోసం అంశుమంతుడు తపస్సు చేసాడు. దిలీపుడు చేసాడు—భగీరథుడు మనుమడితోగాని తపస్సు పూర్తికాలేదు. ఈ తపస్సొక యజ్ఞం. కథలో అశ్వం క్రియాశక్తి స్వరూపం. గోవు జ్ఞానశక్తి సంకేతం. అశ్వమే సూర్యుడు. 60,000 సగరులు వాలఖిల్యులు. అంశుమంతుడన్నా సూర్యుడే. భగీరథుడన్నా సూర్యుడే. భగుడంటే సూర్యుడే. సూర్యుడే జలమార్గ నిర్మాత. కనుక జలం భాగీరథి.

పదార్థం భస్మాంతం. భస్మం యజ్ఞాకృతికి ప్రతీక. ఇది చైతన్యాను ప్రవేశంతోగాని ప్రాణవంతమై—చలించలేదు. ఈ సృష్టి కథనే గంగ కథగా వాల్మీకి మహర్షి వ్యాఖ్యానించాడు. గంగ చైతన్య ప్రతీక. జగత్తులో కాలం ప్రవేశిస్తేగాని దిశావిభాగం ఏర్పడలేదు. కాలస్వరూపం—ప్రతీక సూర్యుడు. భగీరథుడు. కనుక వ్యక్త సృష్టి సూర్యుని ద్వారానే ప్రసరించింది, అందుచేత గంగ—వ్యక్త సృష్టి చైతన్యం. మార్గకృత్తు—మార్గనిర్మాతయైనవాడు భగీరథుడు.

ఇది గంగ కథలోని వేదప్రతీకార్థం. వేదమే తిరిగి రామాయణంగా అవతరించిందన్న ఆర్యోక్తిలోని రహస్యమిదే. రామాయణానువాదకుడు ఈ వేదరహస్యవేత్త కానినాడు ఆ గ్రంథం జోలికి పోకూడదు. ఈ వస్తువును వ్యంజిస్తూ కథా కథనాన్ని శిల్పించాలి. కథా శిల్పమంటే ఈ వస్తువును వ్యంజించటమే.

# 7. మహాభారత కథాతత్త్వము

'కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణ ప్రభుమ్
కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారత కృద్భవేత్ (విష్ణుపురాణము)

వ్యాసమహర్షి సాక్షాద్విష్ణువు; నారాయణుడు. కాకుంటే మహాభారతము నెవడు వ్రాయ గలడు? ఎందుచేత? అది పంచమవేదం కాబట్టి. వ్యాసమహర్షి పేరే వేదములను వ్యాసించిన - విభజించినవాడని చెబుతున్నది. అంటే భారతకర్త యొక్క జీవ లక్షణమేమి? అతడు వేదవిద్యోపజీవి, 'వేద రహస్యంబున లోకహిత మొనర్చిన ముని' (అనుశాసనిక పర్వము 4,314) వేదరహస్యమెఱిగిన వాని రచన ఎలా వుంటుంది.

వేదమంటే జ్ఞానము = ఆత్మజ్ఞానం-పరావిద్య, సృష్టిజ్ఞానం-అపరావిద్య- ఈ రెంటి సమన్వయం. వేదశబ్దానికి ఈ దృష్టితో నర్థం చెప్పవలె. కేవల వాచ్యార్థం కాదు - భౌతికార్థం కాదు. ఒకనాటి మానవచరిత్ర కాదు. నిత్య చరిత్ర. ఇదే త్రైకాలిక దృష్టి. ఇందులో సమన్వయమున్నది. ఈ సమన్వయమే సంప్ర దాయము. ఇదే వేదరహస్యంబున లోకహిత మొనరించుట యనగా. వేదరహస్యం సంప్రదాయం. మహాభారతం వ్యక్తావ్యక్త సమన్వయ బోధకం. కాని చారిత్రక గ్రంథం కాదు. ఈ దృష్టితో చూచిన పాశ్చాత్య పండితులు 'హాప్కిన్సు' - మొదలైనవారు భారతం ఇతిహాసం కాదని ఇతిహాసాభాసమన్నారు. హోమరు కావ్యం దృష్టి వేరు. ఈ దృష్టి భారతమునకు లగించదు. ఎందుకని? భారతజాతి మనస్తత్త్వం తాత్త్వికం - లౌకికం కలయిక. లేకపోతే నిర్గుణ బ్రహ్మవాద గ్రంథమైన బ్రహ్మసూత్రము ప్రక్క కామసూత్రము పుట్టదు. మానవ జీవితే మందేదో అవిజ్ఞేయ తత్త్వమున్నది, అది తరచి చూచినగాని తెలియనిది. కొంత తెలిసి, కొంత తెలియనిది జీవితం. ఈ రెంటికి పొత్తెక్కడ? ఈ సూత్రము ముడిని సడలించుకొన్న వాని పేరు భారతీయుడు, ఆర్యుడు, వాని గ్రంథము భారతం. కాబట్టి కేవల చారిత్రక దృష్టిగాని, తాత్త్వికదృష్టిగాని; కవితాదృష్టి గాని పనికిరాదు. ఈ మూడింటిని కలిపి కట్టిన గ్రంథం మహాభారతము. మానవ జీవితమున ఈ మూడున్నవి. లౌకిక దృష్టినుండి నిత్యజీవితం తత్త్వం నుండి

పారమార్థిక జీవితం. కవితాసృష్టి నుండి సౌందర్యారాధన నిష్పన్నములు కావటం స్పష్టమే.

భారతం మహర్షి నుండి పుట్టిన గ్రంథం కావటంవల్ల వేదరహస్యం. దీని కొధారం.

'గోవగ్నిమయ మమృతమయ
మోపసుథాధిప' - అనుశా. 2-277.

'అనలుడు భాస్కరుండును సుధాంశుడు నధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీక్రతువు విష్ణుమయంబిది నిర్వహించి ర
ర్జునుడును గర్జుడుండగ' కర్ణపర్వాంత పద్యము.

గోవగ్ని యేమి? అమృతమేమి? ఔననుకొంటాం. అగ్నిదహన శీలమైన ఉష్ణ తత్త్వం. అమృతము శీతతత్త్వం. ఇది మృత్యుంజయము. ఇది మృత్యురూపము. రెండూ కలవటమెలా? అది గోవగుటెలా? అసలు గోవుజంతువు కదా.

ఈ క్రతువు విష్ణుమయం. ప్రవర్తకులు సూర్యచంద్రాగ్నులు. నిర్వహించిన వారు-కర్ణార్జునులు. యుద్ధము చేసారు కనుక కర్ణార్జునులు నిర్వాహకులనుట సరే బాగున్నది. సూర్యచంద్రాగ్నుల సంగతియేమిటి? పొసగుట లేదే? ఇవి వ్యాస గ్రంథులు. సమాధానం వేద విద్యా రహస్యం. సంప్రదాయ విజ్ఞాతకే లభించు నట్టిది.

ఈ ముడి నామకరణంలోనే వున్నది. అసలు మహాభారతమంటే అర్థ మేమిటి?

మహా+భారతము. 'భరత వంశకథ భారతమనుట' చారిత్రక దృష్టి. ఆవోక్కటే కాదే!

మహా = మహత్తు. భారతమంటే ప్రాణం. మొదటిది భూతప్రకృతి కాద్యరూపం కాబట్టి పదార్థం. అచేతన ద్రవ్యం. ప్రాణమంటే చేతనం. ఆత్మ చైతన్యం. మొదటిది వ్యక్త ప్రకృతి. రెండవది అవ్యక్త తత్త్వం. అదెక్కడ నుండి వస్తున్నదో, ఎక్కడికి పోతున్నదో తెలియదు. దాని విషయమేమో? ఈ వ్యక్తావ్యక్త సమన్వయం పేరు ఆర్యసంస్కృతి. తదనుగుణ నిత్య జీవితం పేరు నాగరికత.

మహాయనగా మహత్తు. అనగా సాంఖ్యము, భారతమనగా ప్రాణము. అనగా వేదాంతము. ఈ సమన్వయ క్రమము మహాభారత, మన్నాడు థఛాని పండితుడు తన 'Mystery of Maha Bharata అన్న భారత విమర్శ గ్రంథంలో.

అతని సిద్ధాంతంలో భారతం సర్వదర్శన సమన్వయ గ్రంథం. దర్శన మంటే ఆధ్యాత్మిక జ్ఞానం కానీ చరిత్ర గ్రంథం కాదే.

'పాంశు పయోద నీలతను భాసితు నుజ్జ్వల దండధారు, బిం
గాంశు జటాప్ఫటా భరణుఉ, నాగమ పుంజపదార్థ తత్త్వ ని
స్సంశయ కారు గృష్ణ మృగ చర్మకృతాంబర కృత్యు - భారతీ
వంశ వివర్ధనుంద్రిదశ పండితు సాత్వవతేయు గొల్చెదన్.

(భీష్మపర్వము)

భారతవంశమంటే ?-భరత సంబంధం భారత వంశమా ? భారతి-సరస్వతి కొబట్టి బ్రహ్మ మానసపుత్రుడు వసిష్ఠు నుండి జనమే జయాదుల దనుక సాగిన వంశమని కొందఱు పండితులన్నారు. విచిత్రవీర్యుని వరకు వచ్చిన వంశము వ్యాసునిచే వివర్ధితం కావున భారతవంశ వివర్ధనుడు. అప్పుడది బ్రాహ్మణ క్షత్ర రక్తము కలది. మొదటిది తత్త్వబోధకము. రెండవది కర్మరూపము. తత్త్వోన్ముఖ కర్మ పేరే కర్మ. కర్మభూమి అంటే లౌకికా లౌకిక సమన్వయ రూపయజ్ఞ కర్మకల దేశము. ఆర్యునిది యాజ్ఞిక సంస్కృతి. ఆర్యుడనగా వీడు. చారిత్రక వ్యక్తి కాడు. (ఆర్యశబ్దము ద్రావిడ వ్యతిరేకియన్న అర్థమున చెప్పుకొనుట ఆధునికము, వేదంలో ఎక్కడా చారిత్రకార్థంలో లేదన్నారు వేదపండితులు)

'ఉత్తిష్ఠత మాస్వప్త అగ్ని మిచ్ఛధ్వం భారతాః
రాజ్ఞః సోమస్య తృప్తాసః సూర్యేణ సయుజోపసః (అరుణోపనిషత్తు)

ఈ మంత్రంలో 'భారతునకుద్బోధ వున్నదిః

"ఓ భారతులారా ! లెండు. నిద్రింపకుడు. అగ్ని నుపాసింపుడు. సోమ రాజుచే తృప్తినందుడు. సూర్యకాంతితో కలసి సుఖింపుడు" భారతులంటే - వ్యాఖ్యాతలన్నారు.

భారతీ-సరస్వతీ-విద్యా-తత్సంబంధినో భారతాః
హేశ్రీ విద్యోపాసకాః - అని

విద్యోపాసక వంశము భారతవంశము. ఇహపర తారకమైనది. చతుర్వర్గ సమన్విత మైన జీవితమును వ్యాఖ్యానించేది. తీర్చేది. ఇది-తెలిసికొనుట. దానికి యోగ్య మైనది విద్య. వేదమంటే జ్ఞానము. విద్య తద్రహస్యాన్ని విప్పేది. విద్య-సరస్వతి, తల్లి. ఉపనిషద్విద్యదేవి. ఇందుకే గీతా ప్రార్థనలో "అంబ! త్వామను సందధామి. భగవద్గీతే. భవద్వేషిణీం - అని వున్నది. అంటే విద్య ఎప్పుడూ అంబయే. కనుక భారతులంటే వారు సరస్వతి తనయులు. శ్రీవిద్య కేవల పారమార్థిక విద్య. ఇందుచేత ఆ దృష్టితో లౌకిక జీవితం చక్కదిద్దుకొనేవాడు భారతుడు. భారతీయుడు. వాని కథ భారతం, అది మహాభారతం. తెలియనిదాని కున్ముఖముగా తెలిసినదానిని తీర్చుకొనుట మహావిషయం కాబట్టి. అందుచేత అఖండ మహాభారతదేశం-దాని కథ-త్రికాల జీవితకథ మహాభారతం. ఇంతేకాక అఖండ భారతదేశమునకభిన్నత, రెండు వొకటే.

ఒక పాశ్చాత్య పండితుడన్నాడు 'మన కవి కనుక భారతం వ్రాస్తే ధర్మరాజు అభిషేకము దనుక వ్రాసియుండేవాడు. లేక అతని విజయం వరకు, భారతీయుడు కనుక తర్వాత కథ వ్రాపివాడు' అని అంటే శాంతి సప్తకం భారతీయుడే వ్రాయగలడని, ఎందుకని?

ఆర్య సంస్కృతి యజ్ఞసంబంధమైనది. ఆర్యు లెక్కడివారైనా యజ్ఞ మిక్కడే జరగటం, వేదమిక్కడే పుట్టటం జగద్విదితమహాసత్యం. పాశ్చాత్యులూ అంగీకరించిందే. యజ్ఞం ప్రవృత్తిరూపం. అంటే సృష్టి. నివృత్తిరూపం ముక్తి విషయము. రెండూ కలసిన వృత్తం పేరు యజ్ఞం. (చూ. సాహిత్యపరిషత్తు ప్రకటించిన అనుశాసనికము) వ్యక్తావ్యక్త రూపమైనది. అది భారత కథ. ఈ యజ్ఞం విష్ణుమయం. ఇదీ నారాయణుని కథ, ఈ యజ్ఞమన్న వృత్తమునకు మేరువు - ఇరుసు నారాయణుడు. దీనిని త్రిప్పుతున్నవారు సూర్యాగ్నిసోములు, సూర్యేందులు కాలప్రవర్తకులే కాదు. పుణ్యజీవులు క్రమముక్తిని పొందుట దేవ యానమున, దానికి ద్వారము రవి; కర్మజీవులు పితృలోకము చంద్రుని ద్వారమున పోతున్నారు, ఇలా దేవయాన పితృయానములు సూర్యేందులవల్ల. అగ్ని అంటే

పురుషుడు - జీవి. క్రిందికి వచ్చి పైకి పోయేవాడు. ఈ ప్రయాణము లేవరివో వాడు. ఈ రెండుమార్గాల్లో దేవయాన ప్రతీక అర్జునుడు. ధూమ్రయాన ప్రతీక కర్ణుడు. ఒకటి దేవత అనగా ధర్మం. మరొకటి అసురము. అనగా అధర్మం. ఈ రెంటి ఘర్షణ ప్రవృత్తి-లోకం. ఈ స్పర్థభౌతికమైతే యుద్ధం. భారతయుద్ధం బాహ్యాభ్యంతర సమన్వయము. అది ట్రాజాన్ యుద్ధం కాదు. ధర్మాధర్మ స్పర్థ. ఇందుకే గీతాప్రారంభం - ధర్మక్షేత్రే - యని, అంథే హృదయం. దేవాసుర సంపద్విభాగయోగము ఆంతర విషయమే. అదే బాహ్యమవుతుంది. భావమే క్రియగా మారుతున్నది కనుక, ఇది కర్ణపర్వాంత పద్యమున కర్థము. ఇలా చూచుకోక తప్పదు. అలా కాకపోతే కావ్యం సమన్వయం కాకపోవటంలా వుంచి నిలువుగా చూడదగ్గ దాన్ని తలక్రిందులుగా చూడటమవుతుంది.

ఇందులో నరనారాయణ తత్త్వముపదేష్టమైనది. నరుడనగా జీవుడు. మాయాసంకుచిత ఆత్మజీవుడు. మాయాతీతమైనది బ్రహ్మము. కృష్ణు డనగా బ్రహ్మ పదార్థము.

కృషిర్భూవాచకశ్శబ్దో - ణశ్చనిర్వృతి వాచకః
విష్ణుస్తద్భావయోగాచ్చ - కృష్ణోభవతిశాశ్వతః' (ఉద్యోగపర్వము)

'కృష్ణశబ్ద వ్యాఖ్యానంలో విష్ణుసహస్ర వ్యాఖ్యలో ఆదిశంకరులు దీని నుదాహరించి 'ఇతి వ్యాసవచనాత్ సచ్చిదానందాత్మక; కృష్ణః' అని వ్రాసారు. కృషివ్యక్త విశ్వవాచక శబ్దము,ణచ్ - అవ్యక్త తత్త్వవాచకము. ఈ సమన్వయ తత్త్వము కృష్ణుడు.

'ద్వాసుపర్ణాసయుజా, సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాదు
అత్తి అనశ్నన్ అన్యో అభిచాకశీతి' (ముండకోపనిషత్తు)

ఒకే వృక్షాన్నాశ్రయించుకొని రెండు పక్షులున్నవి. అవి సమానములు. సదా కలసివుండేవి. సమాన నామములు కలవి. అందులోవకటి పిప్పలఫలాలను తింటుండగా మరొక్క పక్షి తినక సాక్షిమాత్రుడై వున్నాడు. అనగా జీవేశ్వరుల

స్వరూపమిందులో చెప్పబడినది. కర్మఫలమే పిప్పలము. తద్భోక్త జీవుడు ఈశ్వరున కిదిలేదు. చూస్తున్నాడు. ఇంతే, ఇదే నరనారాయణ తత్త్వమన్నాడు కీ॥ శే॥ సూక్తంకర్ పండితుడు తన భారతార్థము. (మీనింగ్ ఆఫ్ మహాభారత్) అన్న గ్రంథమున ః

పై మంత్రం తర్వాతి మంత్రం.

'సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయాశోచతి ముహ్యమానః
జుష్టం యదాపశ్యత్యన్యమీశ
మస్య మహిమాన మితిశీత శోకః'

జీవుడు సుఖదుఃఖాదిమగ్నుడై మోహంతో శోకిస్తున్నాడు. అలాంటివాని కెప్పుడు తానాత్మ స్వరూపుడనన్న జ్ఞానం కల్గుతున్నదో అతడు వీతశోకుడవుతున్నాడు.

ఇందులో వర్ణింపబడిన జీవుని శోక మోహముల చేతనే గీత ప్రారంభమైననది. కావున గీతాశ్రోత ప్రతి జీవుడును. క్రీస్తుపూర్వునకు కాదు. పరునకు కాదు. సంసార పాంధునకు, ఇందుచేతనే గీతలో అర్జున విషాదయోగం వ్యాఖ్యానింపబడుటం, ఆ విషాదం జీవి విషాదం, నిత్యవిషాదం. అహో! బంధావృతుడైన జీవుని విషాదమెంత నిత్యసత్యము. గీతలోని రథము ఉపనిషత్తులోని వృక్షము ఒకటే. వృక్షమంటే ఛేదింపబడేది. రథమంటే శరీరమని భారతమే. శరీరమంటే నశించేది. రెండూ వాకటే - అంటే శరీరమే. క్రిందనున్న జీవాత్మను పైకి చూడమని బోధించటమే గీతోద్దేశ్యము. ఇది నిత్యబోధ. ఆంతరమైన విషయం. ఇందుచేతనే ఆ రథ చిత్రమంత అందమైనదవుతున్నది. తెలియని వానికిని నందమైనదే.

నరునకు ధనంజయుడని ఒక పేరున్నదిగదా. అనగా అగ్ని అందుకే గాండీవమతని నుండి లభించినదని కథ చెప్పబడినది. నరుడనగా అగ్నేయని చెప్పబడినది. (అనలుడు భాస్కరుడన్న పద్య విషయమున) అగ్నికి రెండు ముఖాలు. ప్రవృత్తి-నివృత్తి ముఖాలు. గాండీవి సవ్యసాచి. అంటే అంతర యుద్ధము అనగా ఆత్మజయమని బాహ్యయుద్ధము - అనగా కర్ణాదిజయము -

రెంటిలో సమర్థుడైనవాడు, అంటే తత్త్వము-లౌకిక కర్మలను సాధించటంలో సమర్థుడు. రెంటినీ సాంఖ్యయోగము, కర్మయోగము (జ్ఞానము. కర్మ-) వీనిని సాధించటమే జీవితలక్ష్యం. గాండీవమంటే ధనుశ్రేష్ఠము = ప్రణవము. అది కల్గిన వానికంటె విలుకాడెవ్వడు ?

'ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యంశరవత్తన్మయోభవేత్'

అన్న ముండకోపనిషన్మంత్రమున ధనువు ప్రణవము. బాణము ఆత్మ, లక్ష్యము బ్రహ్మము అనటంలో గాండీవతత్త్వమున్నది. ఇందుకే యోగిని వీరుడని శాస్త్రములు (త్రితయభోక్తా వీరేశః) 1-11) శివసూత్రాలు). అగ్ని ఋక్కుతో వేదమారంభమగుట యిందుకే (అది ప్రవృత్తిరూప యజ్ఞతత్త్వము.) భారతమున 18 పర్వాలు. యజ్ఞము చేయించు ఋత్విక్కులు 16 మంది, ఇద్దరు చేయునట్టి దంపతులు. ఇందుకే యుద్ధం 18 రోజులు, అక్షౌహిణులు 18, గీతాధ్యాయములు 18, ఇందుచేనిది యజ్ఞసంబంధమైన గ్రంథము. అది జీవేశ్వర తత్త్వబోధకము. ఇదే వేదరహస్యము. కావున జీవుని కథ. నిత్యమైన కథ భారతము. శ్రీవిద్యోపాసకుని కథ భారతుని కథ. భారతవంశమనగా ఈ శ్రీవిద్యోపాసకవంశ కథ. భారతమున దేవీప్రాశస్త్యము లేకపోలేదు. విరాట నగరానికి పోతూ ధర్మరాజు 'అస్తువన్ మనసా దేవీం దుర్గాం త్రిభువనేశ్వరీం' యుద్ధారంభంలో నరుడు కృష్ణాదేశంతో 'నమస్తే సిద్ధసేనాని ఆర్యేమందార వాసిని' - యని ప్రార్థించినట్లున్నది. కాక దేవీ విద్యయే అగ్ని. అగ్ని కథయే జీవుని కథ, కావున శ్రీవిద్య అగ్ని విద్య.

'యోవా అత్రాగ్నిర్గాయత్రీ సానిదానేన'

(ప్రతీకాదృష్ట్యా అగ్నియే గాయత్రి) (శతపథము)

# 8. స్వర్గారోహణం - మహాప్రస్థానం

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః (గీత)

జీవితమొక మహా ప్రస్థానం. అన్వేషణవున్నదే జీవితం. ఆ ప్రస్థానంలో ఎదురయ్యే విప్రతిపశక్తులతో చేసే యుద్ధమే కురుక్షేత్ర సంగ్ర అన్వేషణ ధర్మబద్ధం - అంటే ఏకాగ్రంగా - లక్ష్యశుద్ధితో సాగేది - వక్రప దృష్టిలేనిది కనుక అది ధర్మమార్గం.

అదొక కత్తివాదర మీద నడక. అదొక కర్మ కౌశలం, కుశల మనస్సే మాత్రం వశం తప్పినా - వక్రమార్గంలోకి - ఆలోచనల దారి పతనమే - నాశనమే. కనుక జీవితమొక మహాయోగం. ధర్మబద్ధంగా యుద్ధ వాని జీవితం మహాయోగం. ఈ ఏకాగ్రమైన ఊర్ధ్వగమనం - మహా ప్రస్థా శ్రీకృష్ణదేవరాయల వారన్నారు,

"జని సాహస్ర మహాప్రయాణమగు సంసారంపు ద్రోవన్ సదా
చనుచుండున్ బహుమోద ఖేదములమన్ సంసారి పాంథుండు, వా
సనలన్ ధూళి ముసుంగుగాగ" -

ఈ ధూళే విప్రతీప శక్తి. అధర్మ శక్తుల ఘర్షణ. ఇదొక జన్మల మహాగాధ. ఎక్కడ బయలుదేరాడో? ఎక్కడకు పోతున్నాడో గాలికి పండుటాకులాగా వుంది జీవితం కనుక,

వేల మానవుల్లో ఎవడో మహాత్ముడు సిద్ధికోసం యోగి కాగా యోగుల్లో తత్త్వత। తనను దర్శించే వాడెవడో ఒక్కడే. కోట్ల జన్మల్లో సంవత్సరాల దీర్ఘప్రయాణంలో ఎవడో ఒక్కడట. వాడెవడు? గురు మండల" స్థానంలో కూర్చున్నవాడు.

మహావేత్త సూఫీయోగి మన్సూర్ గురువు జున్నాయిద్ - ని శిష్యులతో చెప్పేవాడట "నా గురువు పాదాల దగ్గర 12 ఏళ్ళున్నాను, అయ

మణిసౌధం. లోపలకు వెళితే నన్ను చూచి మా గురువుగారు కూర్చోమని సంజ్ఞ చేసేవాడు. మూడేళ్ళవరకు నన్నాయన చూడనేలేదు. నేను మాత్రం రోజూ గురు సన్నిధిలోనే వుండేవాణ్ణి. 3 ఏళ్ళ తర్వాత ఒకేసారి గురువు నన్ను చూచారు. ఆ మూడేళ్ళు నేను గురువు దగ్గర ఎంతో భక్తిగా కూర్చోవటమే సమాధిగా, నా సర్వేంద్రియాలను వారి మూర్తిపై కేంద్రీకరించి కూర్చొనేవాణ్ణి కాబోలు, దానికాయన కరుణించి నన్ను చూచారు. జీవితాంతం ఆ దృష్టి పాతం కోసం వేచి వుండేవాణ్ణి. అంత తపనతో శ్రద్ధాభక్తులతో - ఓర్పుతో వేచి వున్నందువల్ల నాకా భాగ్యం కలిగింది. మరలా మూడేళ్ళు మౌనంగా వారి దగ్గరే కూర్చున్నాను, వారు నన్ను చూడలేదు, అయినా నేను ప్రియురాలు ప్రియుని కోసం ఎదురు చూచినట్టు వేచివున్నాను. 6 ఏళ్ళు గతించాయి. అప్పుడు గురువుగారు నన్ను చూచి నవ్వారు. మాటా లేదు-పలుకూ లేదు. కాని ఓహో, ఆ నవ్వేమి నవ్వు. ముక్తికాంత గులాబి పుష్పమై వికసించిందా? ఎంత దివ్యసౌందర్యం. మాధుర్యం, శబ్దాల్లో చెప్పటం అసాధ్యం. మరలా 3 ఏళ్లు. అప్పుడాయన నన్ను కౌగలించుకొని "నాయనా జున్నాయద్ ఇక నీవు సిద్ధపడినట్టే. నీవిక వెళ్ళవచ్చు" ఇవ గురుశిష్య సమ్మేళనమంటే. గురువు మాట్లాడ్డం లేదు. ఒక దృష్టిపాతం - ఒక నవ్వు - ఒక కౌగిలింత. మొదటిది సిద్ధించటానికి మూడేళ్ళు. రెండోదానికి ఆరు. మూడోదానికి మూడు = 12 ఏళ్ళు. అలాంటి గురువు లభించటమే మహాప్రస్థానం స్వర్గారోహణంగా పరిణమించటమంటే. జున్నాయిద్ తన గురువుగారి పేరు ఎప్పుడూ చెప్పలేదట. 'గురువుగారు' - అంతే, నామరూపాలతో నిమిత్తం లేదు. గురువొక్కడే. జగద్గురువంతా. అతడే గీతాస్వామి. అతడే శ్రీ అరవిందులు-పరమహంస - రమణ మహర్షి - ఓషోరజినీశ్ - శ్రీ షిరిడీ బాబా. ఏ రూపంలోనైనా రావచ్చు. ప్రతి యుగంలోనూ వస్తున్నాడు. ఆర్తితో బాటను పడ్డవాడికి ఎదురౌతున్నాడు. దప్పిక తీరుస్తున్నాడు.

టిబెట్ భాషలో ఒక సామెత - తదనుగుణమైన కథ వుందట. దీన్ని చాలా సొగసుగా కవితా రూపంగా వ్యాఖ్యానించాడు భగవాన్ శ్రీ రజనీశ్.

"వందమంది అన్వేషకులు బయలుదేరారు. దారిలో 99 మంది రాలిపోయారు. దారి తప్పారు. ఒక్కడే లక్ష్యం చేరుకున్నాడు. ఇదీ చెప్పటం కష్టమే" - ఈ సామెత కనుబంధమైన కథ :—

"లాసాకు దూరంగా హిమాలయసానువుల్లో ఒక బుద్ధనిలయం, ఆశ్రమం ఆ గురువు వృద్ధుడై పోయాడు. ఒక శిష్యుని పిలిచి ఒక రోజు "నాయనా నీవు లాసా ప్రధానాశ్రమానికి పోయి ఆ గురువు నడిడి నా వారసుని పంపించమన్నానని చెప్పి రావోయి" అన్నాడట. ఇతడలాగే వెళ్ళాడు. ఆ ప్రధాన ఆశ్రమాధిపతి విని 'సరే ఈ వంద మందిని తీసుకుపో' అన్నాడట. ఈ యువకుడు కాదండీ మా గురు వొక్కరినే తీసుకు రమ్మన్నాడు గదా, అని అంటే "పిచ్చివాడా, నీకా సామెత తెలియదా? నీకెందుకులే ఈ మందితో బయల్దేరన్నాడు గురువు.

సరే మహాప్రస్థావం మొదలైనది. కొంచెం దూరం వెళ్ళారో లేదో సిపాయిలు ఎదురై "మా రాజ్యంలో ప్రస్తుతం మత గురువెవ్వరూ లేరు. కనుక మీలో ఎవరైనా మాతో వస్తే మంచి జీతం నివసించటానికి రాజసౌధం, సకలైశ్వ ర్యాలతో కూడిన రాజగురువు పదవి కదా, ఆలోచించుకోండి" అన్నారు సిపాయిలు. శిష్యుల మనస్సులు మొగ్గు చూపినవి. రాజగురువు పదవి, తమాషా కాదు కదా, చాలా మంది సిద్ధమైనారు. గురువు మాట ఎక్కడ పోయిందో. సిపాయిలు మా కొకడు చాలు, అంతావస్తే మా రాజుగారి బౌద్ధాశ్రమంలో సకల సదుపాయాలతో వుండవచ్చు. పోనీ రండి - అన్నారట. సరే సగానికి సగం దారి తప్పారన్న మాట. మరలా ప్రయాణం మొదలు కాగా మరలా దారిలో కొందరెదురై 'మీరు నల్గురు మాతో రండి. ఒక కోటీశ్వరుని కూతురు పెళ్ళికి పురోహితులు కావాలి. చాలా డబ్బిస్తాడు, కొన్నాళ్ళుండి మీ దారిన మీరు పోవచ్చు. మాకభ్యంతరం లేదు- అన్నారట. సరే నల్గురికి 10 మంది పోతామన్నారు. వీరిని తీసుకుపోయే యువకుడు 'అరే మీరంతా గురువుగారి మాటను విస్మరిస్తున్నారు. మాటిమాటికీ' ఇది బాగా లేదన్నాడు. వారు విసుగుతో వుండవయ్యా. నీదేం పోయింది. అంత డబ్బు ఎవడిస్తాడు - పైగా నాల్గురోజులే కదా. అని కొంతమంది దారి చీలిపోయారు.

ఇలా కథ జరుగుతుంది :

చివరకు వారొక నదీ తీరాన ప్రయాణిస్తుంటే ఒక సుందరి ఏడుస్తూ కన్పిస్తుంది. ఆమె వీరితో 'మా నాన్న గొప్ప వేటగాడు. ఇవ్వాళ ప్రొద్దుననగా అడవికి వెళ్ళాడు. ప్రొద్దు గ్రుంకబోతున్నది. మా అమ్మ చచ్చిపోయింది. నే నొక్కదాన్నే ఈ అడవిలో ఒంటరిగా వుండాలి. మీరు బుద్ధదేవుని మతస్థులు కదా. కరుణతో నాకీ రాత్రి ఎవరో ఒకరు తోడుగా వుండాలి" అని అభ్యర్థిస్తుంది. చాలా,

మంది వుండిపోదామంటారు. చివరకొక యువకుడు 'జానిదే బుద్ధ దేవుని బోధ జీవకారుణ్యమంటే. నేనుంటానిమెతో, మీరంతా పొండి, నేను రేపు మీతో కలుస్తానని' వుండిపోతాడు. ఇలా 98 మంది దారి తప్పితే చివరకు ఇద్దరు మాత్రం మిగులుతారు. తీసుకుపోవటానికి దగ్గరవుతుండగా, ఒక గ్రామంలో అడుగు పెడతారు. దూరాన హిమాలయాలపై సూర్యుడు వజ్రంలాగా వుదయిస్తున్నాడు. ఆశ్రమం కొండచరియల్లో కన్పిస్తూనే వుంది. ఆ వూరు దాటితే యిక ఆశ్రమమే. అంతలో ఒక నాస్తికుడు ఆ వూళ్ళో వీరికెదురై 'నాకు మీ బుద్ధుడు గిద్దుడంటే జాంతానై, నేనివన్నీ నమ్మను. మతమంటే మత్తుమందు. దేవుడు పేరు చెప్పి మీరు సోమరులై సంఘం మీదపడి బడితల్లాగా మేస్తున్నారు. నాతో వాదించి మీ బుద్ధ దేవునిమీద నాకు విశ్వాసం కల్పిస్తే నేనూ మీలాగా కావిబట్టలు కట్టుకోవ డానికి సిద్ధమని వాదానికి కాలు దువ్వాడు. మనిషిలోవున్న వాదించే శక్తి-తర్కం తనకు తెలిసింది పదిమంది ముందు ప్రదర్శించుకొని కీర్తి పొందాలన్న తృష్ణకు జాలు తీసాడు. నాస్తికుడు. వెంటనే ఒకడు దానికి సిద్ధపడుతూ వారిస్తున్న యువ కునితో 'ఛీ, నీవు నోరుమూసుకో, నా గురుదేవుడు గౌతమబుద్ధుని కాదన్న వీడిని నోరు మూయించకపోతే బ్రతకటం వ్యర్థం కనుక మీరు వెళ్ళండి, వీడి డొక్క చించి నేను ఆశ్రమానికి వస్తా' నన్నాడు.

చివరకొక సన్యాసి - 100 మందిలో మిగిలినవాడు, యువకుడు మాత్రమే ఆశ్రమానికి వచ్చారు. గురువుగారు వారిద్దరనూ చూచి మంచిది, వంద మంది బయల్దేరతారనీ - ఒక్కడే ఇక్కడకు చేరుకోగలడనీ ముందే తెలుసునన్నాడట. తాను పంపిన యువకుడు "మరి మీరు ముందుగా చెప్పలేదేమి" అన్నాడట. గురువు నవ్వి "సామెతలో నిజం తెలిసింది కదా-అని, అదృష్టవశాత్తు ఒకడైనా వచ్చాడు నయం. దారిలో అన్ని లోయలు - జంతువులు వ్యామోహరూపంలో వుంటే వీటన్నిటికీ ఆకర్షింపబడక రావటం చాలా గొప్ప విషయం కదా" అని అన్నాడట.

ఇది ధర్మ విజయం సాధించిన మహావీరుని కథ. భౌతికా కర్షలణ నెదురించి లొంగక దీరుడై నిల్చినవాడు నడిచేదే మహాప్రస్థానం. ఆ ఆశ్రమ దర్శనమే స్వర్గారోహణం.

మహాభారత కథలోని పరమార్థమిదే. భౌతిక యుద్ధం ముగిసింది. ఇక అంతర యుద్ధం. శాంతిపర్వంతో మొదలైనది. భారత రాజనీతిలో రెండు

యుద్ధాలు చెప్పబడ్డాయి. (1) భౌతిక యుద్ధం=మిధ్యా యుద్ధం. (2) అంతర యుద్ధం=సత్యయుద్ధం. భౌతికయుద్ధాలికి తనలోని ప్రేరణలేవో-కోపాదులు, అవే అంతర్యుద్ధంలో తనకు శత్రువులాగా కన్పించటం ప్రారంభించటంతో ఈ యుద్ధం మొదలౌతుంది. కౌరవ సంహారంలో ఏవి మిత్రులుగా సాయపడినవనుకున్నామో ఆ కోపతాపాదులే ఇప్పుడు శత్రువులు. చిత్రంగా లేమా, ఆ యుద్ధంలో విజయానికి కౌరవులు లక్ష్యం. ఇక్కడి విజయం తనమీద తాను పొందే పెత్తనం. తన మనస్సే తనకిక్కడ శత్రువు. మరి తానెవరు? జీవుడు. ఈ అంతర్యుద్ధమే అన్వేషణ, మహాప్రస్థానం, ఇది తన లోపలికి తాను చొచ్చుకొని పోవటం, పద్మ వ్యూహమంటే యోగశాస్త్రంలోని షట్ (6) కమలాలు - పద్మాల వ్యూహమే మూలాధారం నుండి అజ్ఞాచక్రం దాకా, సప్తమం సహస్రారమే స్వర్గం. (పురాణ పరిభాష వేరు, ఇందులో ప్రతీకలే పురాణంలో పురాగాధలు)

పద్మవ్యూహ ప్రవేశమే తెలుస్తుంది. తిరిగిరావటం తెలియదు, అభిమన్యుడు వీడు. దైవానుభవ మగ్నుడైనవాడు క్రిందికి రాలేడట,

బాబాజాన్ అన్న సిద్ధురాలు మెహర్‌బాబాను - 10-12 ఏళ్ళ వయసులో వున్నపుడు నొసటన ముద్దు పెట్టుకొంటే బాహ్యస్మృతి పోయి ఆత్మ మగ్నత సిద్ధించిందట. బాహ్యస్మృతి కోసం షిరిడీలో ద్వారకామాయిలో వున్న దైవాన్ని చూడటానికొస్తే - ఆ మహానుభావుడు "ఖండోబా గుడికి పోరా"-అని అరిచాటడ. అక్కడ బాబాశిష్యుడు ఉపాసనీబాబా వున్నాడు. అతనిని మెహర్‌బాబా సమీపిస్తుంటే ఆ మహాయోగి 'రావద్దురా' అని ఒక రాయి విసిరితే అది నొసటన - ఎక్కడ బాబాజాన్ ముద్దు పెట్టుకుందో అక్కడ తగిలి వెంటనే బాహ్యస్మృతి కలిగిందట, (ఈ గురుశిష్యులు తోటలో నడుస్తుండగా ఎవరో తీసిన ఫోటో సాకోరి - షిరిడీ దగ్గరలోని ఉపాసన ఆశ్రమంలో ఉంది.) తర్వాత మెహర్బాబా మహామౌనయోగి అయినా లోకంలోకి ఎందుకు వచ్చాడంటే తన లాగా బాహ్యస్మృతి కోల్పోయిన వారి కది అనుగ్రహించటానికని - ఓషోరజనీశ్ ఒక చోట అన్నారు. చాలా అద్భుతంగా,

శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పారు. తాను అమ్మ స్మృతి నుండి బైటకు రాలేకపోతే - రనకు తానే రసగుల్లా తిందామని మనస్సుకు నచ్చచెప్పుకొని బైటకు వచ్చేవాడట. ఆయనకు తీపి పదార్థాలు ఇష్టమట. ఎందుకంటే ఆ చిన్న ఆ సక్తికూడా లేకపోతే తాను లోకసంబంధం పెట్టుకోలేక పోయేవాడు కనుక. మరి

ఇవి లేకపోతే ఇవ్వాళ మనకు వివేకానందస్వామి లేడు. ఈ మిషనూ లేదు. కనుక అమ్మ చెప్పిందట తనకు "ఒరేయ్ నీవు భావముఖంలో వుండమని. (ఇదే అవలోకితేశ్వర తత్త్వం. బోధిసత్త్వల తత్త్వం. బుద్ధుడంటే చైతన్య-నిర్వాణ మగ్నుడు. దాన్నిలోకాన్ని చూస్తూ - గడపలో పెట్టిన దీపంలాగా వుండడం అవలోకనం - పైన మనస్సు పెట్టి క్రిందకు చూడటం)

దీనికి సంబంధించి ఒక కథ చెప్పారు శ్రీ పరమహంస. 'ముగ్గురు స్నేహితులు వెళ్తున్నారు. రోడ్డుప్రక్క పెద్ద కోటగోడ. అవతల ఏదో పెద్దగా నవ్వులు-సంతోషాలు వేడుకల ధ్వనులు వినిపిస్తూన్నాయట. ఒకడు చూచివస్తా నేమిటోనవి గోడ ఎక్కి చూస్తే ఓహో స్వర్గం, నందనోద్యానం. ప్రక్క గంగ, ఒక మహానంద ఖండం. వీడూ ఆపుకోలేక అటు దూకేసాడు. ఇద్దరూ చూచి చూచి ఒకడు మరలా గోడనెలాగో ప్రాకి చూచి - ఇవతలప్రక్క ఇంత ఆనందం. నేను వచ్చినచోట అంతా కశ్మలం, దుఃఖం, ఛీఛీ నేనూ నా ముందు వాడిలాగే పోతానని ఆ స్వర్గంలోకే దూకేసాడట. మూడోవాడు చూచి చూచి ఏమిరా వీళ్ళిద్దరూ అలాగే పోయారు. ఏమైనారు. వీళ్ళ దుంపతెగ రాలేదని గోడపైకెక్కి చూస్తే ఏముంది. ఆనంద సముద్రం తుళ్ళింతలాడుతూ కన్పించింది. వీడికి దూకుదామనిపించింది. ఇంతలో ఒక ఆలోచన - 'నేనూ దూకితే మరి యీ సంగతి గోడ అవతలి జనానికెవరు చెబుతారు. కనుక నేను జనానికి చెప్పటానికి లోకంలోకే దూకుతాననుకున్నాడట. ఇదే భావముఖమంటే'-అని అన్నారు. అది అమ్మ ఆజ్ఞ అని, (ఇక్కడ గోడ వేదంలో చెప్పిన వాకపృష్ఠం. మహాచైతన్యమక్కడ వున్నదన్న తాత్పర్యంతో)

కనుక స్వర్గం సహస్రారం - ఆనందం - ముక్తి - నిర్యాణం - కైలాసరజత శిపపార్వతులు. ఇవన్నీ వేరువేరు శాస్త్ర పరిభాషలు-ప్రతీకలు. పద్మవ్యూహంలో దూరబడటం తెలియటమంటే సహస్రార ప్రవేశం కలగటం. అక్కడే వుంటే లోకానికేమీ లాభం లేదు. వాడు మరలా మూలాధారంలోకి రావాలి. (చూ. శ్రీ అరవింద కేనభాష్యం) అలా వచ్చినవారే బుద్ధాదులు. ఈ రాకపోకలు తెలిసినవాడే సవ్యసాచి. రెండు చేతులతో యుద్ధం చేసే నేర్పరి. విజయుడన్నా ఇంతే. బాహ్యాభ్యంతర (1) యుద్ధ విజేత. (ఎడమచేయి అంతరయుద్ధ సంకేతం. కుడిబాహ్యం. ఎడమభాగం అంతః ప్రయాణమైన ఆధ్యాత్మిక మార్గసంబోధం చేసే స్ఫురణశక్తి

దావి పేరే వామా. వామాచారమంటే బాహ్యాస్మృతికంటె భిన్నమైనది. ఇదంతా యోగ పరిభాష. సంధ్యా భాష. పగటి భాష లోకం. సుషుప్తి భాష వేదం. రాత్రికీ పగటికీ నడుమ గోడ సంధ్య. అక్కడి మనిషి భాషకు ఈ రెండర్థాలు అనుసంధితమై వుంటాయి. పైన ఉపరితలంలో లోకభాష. చారిత్రక - సామాజిక - భౌతిక శబ్దం. దానికి వాచ్యార్థమే వుంటుంది. దానికడుగున మార్మిక-పారమార్థిక భావముంటుంది. ఇదే ప్రతీకాభాష. ఇతిహాస పురాణ శబ్దమంతా సంధ్యా భాషే.

పద్మం = అంతర పద్మం. వ్యూహమంటే సృష్టి.

హరివంశంలో వ్యూహచతుష్టయ సిద్ధాంతం చెప్పబడింది, 1. వాసుదేవ, 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ వ్యూహాలు 4. (వివరణకు నా "సంవిధాన చక్రవర్తి" చూడు) పరతత్త్వం సృష్టిగా పరిణమించటమే ఈ వ్యూహవాదమంతా. అందులోని నాల్గంచలే పైవి. కనుక వ్యూహమంటే చిక్కుముడులు. (గ్రంథులుగా యోగ శాస్త్రం చెప్పింది)

కనుక స్వర్గారోహణమంటే సహస్రార వికసనం. ప్రవేశం. అంతరను భవాన్ని బాహ్యవస్తు లబ్ధిగా చెప్పుకోకపోతే మనిషికర్థం కాదు. కనుక వేద మంత్రార్థం పురాణ కథగా పరిణమింప చేసాడు పురాణకవి. ఇతిహాసమంటే - పురాణకథ అంతర్థక్శనాన్ని బాహ్యజగత్తులోని ఒక సంఘటనగా - కథగా చిత్రించే కవితా ప్రక్రియ.

ఇలా స్వర్గారోహణ కథను వివరించుకోవాలి. ప్రతీ మతంలోనూ ఈ మతానుభవాన్ని అంతరనుభవాన్ని-పారమార్థిక సత్యాన్ని కొండపైకి నడవటంగానే చెప్పబడింది. ఇందుకే కొండ ఒక పెద్ద ప్రతీక పురాణంలో. కొండకెగబ్రాకుతున్నట్లు మనకు స్వప్నం రావటం అలాంటి చిత్రాలుండటం-మనకు తెలిసిందే, ఈ దృష్ట్యా మహాభారతమన్న కావ్యనామాని కర్థమేమిటి? కథా దృష్ట్యా . చరిత్రకందని యుగాల్లో ఎప్పుడో 5, 6 వేల సంవత్సరాల క్రిందట - జరిగినదన్న అర్థంలో భరతవంశ గాధ. కానీ ఇతిహాస పురాణ కథ, చరిత్రాధారంగా నిర్మించే ప్రతీకార్థం గల మరొక అంతర కథ కది శరీరం. ఈ అంతర కథా మాత్రమే ముందు చెప్పిన విషయం. చేసిన వివరణ. ఇదే ఇతిహాస పరమార్థం. ఈదృష్ట్యా భరతశబ్దానికి ప్రాణశక్తి అని అర్థం. "ది ప్రిన్సిపుల్ ఆఫ్ లైఫ్" ని గురించి 'ఎలాన్ వైటల్'గా "బెర్గసన్" ప్రతిపాదించిన విషయమిక్కడ సమన్వయిస్తుంది.

ఆ ప్రాణశక్తి సఘూఘానమే యోగి చేసేది. గాయత్రీ మంత్రశక్తి అదే. ప్రాణాయామం యోగానికి మూలం కనుక. ఈ విషయం వైదిక వాఙ్మయంలోది. కృష్ణ ద్వైపాయనుడు వేదవ్యాసుడు కనుక వేదాలనుండి మొలచుకొని వచ్చినాడు కనుక ఒక చరిత్రను గ్రహించి పరమార్థాన్ని వ్యాఖ్యానించాడు. ఇతిహఅస్ = అంటే ఇలా వున్నది - వుండాలి అని అర్థం. ఉన్నది = అంటే గత చరిత్ర. ఉండాలి అన్న అర్థంలోనూ ఉన్నదనవచ్చు కదా. ఏది వుండాలో అది వున్నది. త్రైకాలిక సత్యమన్నమాట. ఇది కథ లోపలి సత్యం. నిత్యమూ వుండేది. పురా+నవం = పురాణం. గడచిన దాన్ని చెబుతూనే నిత్య సత్యాన్ని - నవీన సత్యాన్ని - వ్యాఖ్యానించేదని అర్థం. ఈ విషయం ఆధునిక పురాణ జానపద గాథా విచారణలో బయల్పడిన సత్యం. మన తత్త్వ శాస్త్రవేత్తలు స్వప్న దార్శనికులు దీన్నే సత్యంగా అంగీకరిస్తున్నారు.

కనుక భారతేతిహాసంలో క్రిందికి వచ్చిన మనిషి (గతకాలం) మరలా పైకి, వచ్చిన చోటికే పోతాడు. ఇదే భారత కథ. మహాప్రస్థానమంటే రావటం - పోవటం రెండూ కలిసిన ప్రయాణం. ఆత్మ పద్మముయొక్క ఉన్మేష నిమేషాలు.

భారత కథా తత్త్వమిది.

# 9. రామాయణము - ఇతిహాస లక్షణము

నిర్వచనాలు :—

ఇది ఇలా జరిగిందని చెప్పిన ప్రక్రియా విశేషం. 1. 'ఇతి+హా+అస్' ఇది శాబ్దిక నిర్వచనం. 2. దేవాసుర సంబంధ ఇతివృత్తం. ఇది పౌరాణికం. 3. పారంపర్యోపదేశమున్నది. ఇదిహ-సార్థం సర్వోపదేశః ఆస్తే అస్మిన్ ఇతి అపః ఉపదేశనే. ఇది ఉపదేశ దృష్టి. 4 కర్మఫల నిరూపణాన్ని ప్రత్యక్షంగా నిర్దేశించింది. ఇదీ మతదృష్టి. 5. విధి నిషేధరూప వాక్యార్థస్తుతి నిందాత్మకమైన కథ. ఇది ధర్మశాస్త్రకారుని నిర్వచనం.

పాశ్చాత్యుల ప్రకారం. 1. యుద్ధ వర్ణనలు కలది. 2. దైవప్రాధాన్య నిరూపణ కలది. 3. మానవౌన్నత్య నిరూపణ కలది. 4. లఘు కథలతో కాదు కొన్న దీర్ఘకథ. 5. వీరుల క్షాత్రతేజస్సునకు ఉచితమైన ఛందమున బంధింప బడేది. ఈ రెంటికీ సాదృశ్యాలివి: దేవాసుర సంబంధేతి వృత్తం. వీరి యుద్ధ వర్ణన ఇతిహాస లక్షణం. దీని కనుగుణంగా పాశ్చాత్యులు యుద్ధం చెప్పారు. భార తీయుడు దీర్ఘకథ అని చెప్పకపోయినా మన ఇతిహాసమూ దీర్ఘమే. ఎడనెడ లఘు కథలుండటం అక్కడా ఇక్కడా సమాన లక్షణమే.

ఈ రెండు నిర్వచనాలను కలిపిచూస్తే ఫలితమిదీ. కథ-దేవాసుర సంబంధేతి వృత్తము, దీర్ఘము. లఘు కథాబహుళము. 2. వస్తువు : ఈ కథలో ధర్మాధర్మ నిరూపణం ద్వారా మానవౌన్నత్వం స్థాపించబడటం దైవప్రాధాన్యం, కర్మఫల నిరూపణం చేయబడటం, 3. ధర్మోపదేశం. భేదదృష్టిః భారతీయుడు కర్మ సిద్ధాం తాన్ని చెప్పడం.

2. దేవాసుర వృత్తాంతం - కేవల భౌతిక యుద్ధం కాదు. అదీ జ్ఞాన: అజ్ఞాన సమరం. దీనితో ఇతిహాసంలోని భూతకాలిక చరిత్రాంశాలు మానవ మనో గత జ్ఞానాజ్ఞాన ప్రతీకగా మార్చబడటంతో నిత్యమైన వస్తువైపోతున్నది. ద్వౌభూత సర్గౌలోకేస్మిన్ దైవఆసుర ఏవచ - (16-6. గీత). సృష్టిలో రెండు రకాల మనః ప్రకృతులున్నాయి. ఒకటి దైవప్రకృతి, రెండు అసుర ప్రకృతి. మొదటిది జ్ఞానము. రెండవది అజ్ఞానము. అది వెలుగు, ఇది చీకటి. కాబట్టి భూతకాలికమైన

చారిత్రక కథ నిత్యమైన ధర్మాధర్మ సమరంగా ప్రతీకా దృష్టితో చిత్రించబడటం భారత యేతిహాస ప్రధాన లక్షణం.

3. పాశ్చాత్యులు 'దిగ్నిటీ అండ్ నోబిలిటీ అఫ్ మాన్' చిత్రించబడాలన్న ఇతిహాస లక్షణం గ్రీకుల కళాధర్మమైన మానవౌన్నత్య నిరూపణం చెబుతున్నది. వాళ్ళ దృష్టిలో విశ్వంలో గొప్పవస్తువు మానవుడు. వారి శిల్ప విద్యలు సర్వమూ మానవత్వము నంటిపెట్టుకొని చిత్రింపబడ్డవే, ఇందుకే ప్రకృత్యనుకరణ వారి శిల్పాదుల్లో చోటు చేసికొన్నది, వారి దృష్టి[1] సౌందర్యానికీ, లోకయద్ధానికీ పరిమితం, భారతీయుల దృష్టి ప్రతీక. ఇందుకే రామాయణంలో 'కోన్వస్మిన్ లోకేస్మిన్ వీర్యవాన్' ఇత్యాదిగా మానవౌన్నత్యం ప్రశంసింపబడ్డా- అది మానవత్వ పరిధినిదాటి దివ్య పరిధుల్లోకి ప్రవేశించింది. అందుకే భారతీయ కళాధర్మం ప్రతీక. పాశ్చాత్య కళాధర్మం సౌందర్యం. అది భౌతికం. ఇది అంతరం. ఇందుకే భారతీయ శిల్పాల్లో కనిపించే నగ్నత ఆంతర సత్యమునకు ప్రతీకకాగా పాశ్చాత్య కళాకారులు చిత్రించిన శిల్పనగ్నత శరీర సౌందర్యరూప చిత్రణ. ఇందుకే 'వీనస్' వంటి బొమ్మలు మనకు ఉద్వేజకము లౌతున్నాయి, అవెంత కళాత్మకాలైనా. ఇందుచేత భారతీయ ఇతిహాసం భౌతిక, ఆధ్యాత్మిక పరిధులను సమన్వయించే మహాకావ్య ప్రక్రియ, భారతీయ ఇతిహాసం ఆర్షజీవిత సంబంధి. ఆర్షమంటే పురుషార్థ సంబంధం కలది. పాశ్చాత్య దృష్టిలో భౌతిక ప్రపంచ ప్రాధాన్యమయింది. క్వాచిత్కంగా మత ప్రాధాన్యం చెబితే భౌతికలోక ప్రాధాన్యం పోతోంది. సామాన్యంగా ఇది పాశ్చాత్యదృష్టి. భారతీయ జీవితంతో చతుర్వర్గ సమన్వయ దృష్టి వుంది. ఇది ఇహపర సమన్వయ దృష్టి. ఈ దృష్టి నుండి ప్రతీకాత్మక ప్రక్రియ పుడుతుంది. ఆర్షజీవితం నుండి పుట్టిన ఇతిహాస ప్రక్రియలో వాస్తవిక సౌందర్యం. భావనా సౌందర్యంతో పాటు - సౌందర్య సమన్వయం ఉంటుంది.

---

Greeks had percived, and builtup—a civilisation and a culture on the sovereigntiy of Mind—They cherished the ideal of hermony—in art, music Literature, and realised beauty and valour. శ్రీ అరవిందుల అభిప్రాయాన్ని యం. పి. పండిట్ వివరించారు: (చూ. Talks on the life Divine.)

భారతీయుల్లాగానే పాశ్చాత్యులుకూడ ఇతిహాసాలు రెండురకాల విభాగాలు చేశారు. భారతీయుని ప్రకారం 1. కావ్యేతిహాసం, 2, శాస్త్రేతిహాసం, పాశ్చాత్యులు చెప్పింది. 1. ఎపిక్ ఆఫ్ ఆర్డర్, 2. ఎపిక్ ఆఫ్ గ్రోత్. మొదటిది కావ్య కళాధర్మం కలది. రెండవది అనేకులు కాలం మీద చెప్పుకొన్న కథలన్నీ చేరి బృహద్గ్రంథంగా తయారౌతుంది. ఎపిక్ ఆఫ్ ఆర్ట్-కావ్యేతిహాసం అనవచ్చు కాని ఎపిక్ ఆఫ్ గ్రోత్ - శాస్త్రేతిహాసం కాదు. శాస్త్రేతిహాసం ఉభయ కావ్యం. కావ్యేతిహాసం కేవల కావ్యం, రామాయణం కావ్యేతిహాసం. భారతం శాస్త్రేతిహాసం. ఇందులో కావ్యశాస్త్రధర్మాలు చిక్కగా సమన్వయిస్తాయి. భగవద్గీతే, సనత్సుజాతీయం యిలా సర్వదర్శనాలు రసాత్మక కథలో పెనవేసికొని పోవటం భారతంలో కనపడుతున్నది. ఇది కేవలం ఆర్షనిర్మాణం. అందుకనే ఒక పాశ్చాత్య విమర్శకుడన్నాడు. భారతకథ పాశ్చాత్యత్యుడే గనక వ్రాస్తే యుద్ధ వర్ణనలతో పూర్తి అయిపోయేది. శాంతిపర్వం నుండి మిగిలిన పద్యాలన్నీ భారతీయుడే వ్రాయగలడని, అందుచేత శాస్త్రేతిహాసం, ఎపిక్ ఆఫ్ గ్రోత్ సమన్వయించడం సమంజసం కాదు, సాహితీవేత్తయైన వాడు చేయదగ్గ పనికాదు,

## ఇతిహాస వస్తువు

మానవ జీవిత సంపూర్ణ భావసమన్వయం ఇతిహాసం, కీ॥ శే॥ విశ్వనాథ కవిసామ్రాట్ కల్పవృక్ష అవతారికలో :

'మరల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళ
దీనుచున్న యన్నమే తినుచున్న దీన్నాళ్ళ
తన రుచి బ్రదుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నదీ
తనదైన యనుభూతి తనదిగాన
తలచిన రామునే తలచెద నేనును
నా భక్తి రచనలు నావిగాన'

ఈ పద్యం ప్రథమపాదంలో కవి అన్న విషయంచేత ప్రతిపాదించినది మానవ జీవితంలోని వ్యావహారిక పరిధి, తృతీయపాదంలో సంసారానుభవం

ద్వారా భావపరిధిని ప్రతిపాదించి, చతుర్థపాదంలోని భక్తి శబ్దం ద్వారా తాత్త్విక పరిధిని ప్రతిపాదించారు. ఈ మూడు కలిపి సంపూర్ణ మానవ జీవితం. దీని చిత్రణ ఇతిహాసం.

మానవునిలో ఒక భాగం వ్యక్తి. ద్వితీయ భాగం సంఘం, మొదటిది స్వకీయం, ఆర్ద్రము, హార్దికము, అంతరము. ఇక్కడే 1. గృహము 2. తత్త్వం ప్రతిష్ఠితము లౌతున్నాయి. గృహం. శృంగార రసం, తత్త్వం-శాంతరసము, సంఘం బాహ్య జీవితం, ఆర్థికం - వీరరసం, శృంగార రససంబంధియైన కామ పురుషార్థం 'ప్లెజర్ ప్రిన్సిపుల్' తత్త్వము మోక్షసంబంధ పురుషార్థము కాబట్టి 'స్పిరిట్యువల్ ప్రిన్సిపిల్ (అన్‌కాన్షియస్ ప్రిన్సిపిల్.) సాంఘిక వ్యక్తి అర్థ పురుషార్థ సమన్వయం కలవాడు. ఇది పవర్ ప్రిన్సిపుల్, ఇది మానవునియొక్క బాహ్యాభ్యంతర స్వరూపతా సమగ్రచిత్రణ.

మనువు మానవ విధులు పంచయజ్ఞాత్మకము లన్నాడు. అవి ఇవి : 1-బ్రహ్మ 2-దేవ 3-పితృ 4-నర 5-భూత యజ్ఞాలు.

1. వేదవిద్యా స్వాధ్యాయ ప్రవచన వ్యాపనాదులు.

2. దేవతారాధన

3. పితృదేవతారాధన

4. మనుష్యారాధన

5. ప్రకృతి గత వృక్ష, జంతు సమారాధన.

మొదటి రెండు మూడు పరలోక సంబంధ విషయాలు, నాలుగు ఐదు ఇహలోక సంబంధాలు, ఈ రెంటి సమన్వయం స్పష్టీకరించేది మొదటిది, ఇది సమగ్ర మానవ జీవిత సమన్వయం బాహ్యాభ్యంతర లోక సమన్వయం.

ఇదంతా ఇతిహాస వస్తువు. ఇది భూత కాలికమా? వార్తమానికమా? త్రైకాలికం. అందుచేత ఇతిహాసం సృష్టికథ, సత్యకథ. ఇంత సమగ్ర జీవితాన్ని చెబుతున్నది కాబట్టే ఇతిహాసం విస్తృతకావ్యం.

మానవ జీవితంలోని బ్రహ్మచర్యం, గార్హస్థ్యం. వానప్రస్థం, సన్యాసం- ఈ నాల్గు ఆశ్రమాలు బాల్య. యౌవన, కౌమార, వృద్ధావ్యములన్న అవస్థలతో

సంబంధించినవి. ఈ సమగ్ర జీవితాన్ని రామాయణ మహాభారతాలు వర్ణిస్తున్నాయి. అంటే రామజననం నుండి అవతార పరిసమాప్తి, పర్యంతమూ రామకథ అభివ్యాప్తమై ఉంది. ఎప్పుడైతే సంపూర్ణ మానవ జీవిత చిత్రణ వస్తువు అన్నామో కథ నవరసాత్మకమౌతుంది.

కావ్యనాటకాలు మానవుని యౌవనావస్థలు, గార్హస్థ్య జీవితాన్ని మాత్రమే అభివర్ణిస్తాయి. కాబట్టి రసము శృంగారమై అక్కడక్కడ వీరరసం అంగంగా కలిగి లఘు పరిధిలో ప్రవర్తిస్తున్నది. ఇప్పుడీ వస్తువును రామాయణానికి సమన్వయించుకుంటే తాత్త్విక పరిధికి సంబంధించినవి కొన్ని. సాంఘిక పరిధికి సంబంధించినవి కొన్ని. కేవల భావపరిధికి సంబంధించినవి కొన్ని కన్పిస్తాయి.

ఇతిహాసం ఋషి రచన, కావ్యం నాటకాలు కవి రచనలు. ఋషి అంటే సుఖదుఃఖాల్లో, రాగద్వేషాల్లో సమన్వయ దర్శనం చేసేవాడు. జీవితానికి జనన మరణాలు రెండంచులు, ఋషి దృష్టిలో ఈ రెండూ సమానమే. ఈ ఉదారదృష్టి ఋషి రచనలైన ఇతిహాసంలో ప్రధాన లక్షణం. రామాయణం పుత్రకామేష్టితో ప్రారంభమై నాయికా నాయకులు స్వస్థానం చేరడంతో ముగుస్తున్నది కాబట్టే ఉత్తర రామాయణంకూడ వాల్మీకి రచనే. జీవుడు ద్యులోకం నుండి బయల్వెడలి, మేఘం, పృథివి, స్త్రీ పురుషులనుండి జన్మించి తిరిగి ద్యులోకమే చేరుకొంటున్నాడని పంచాగ్ని విద్య చెబుతుంది. ఇదీ జీవిత సంపూర్ణ వృత్తచిత్రణ. ఇదే సృష్టి చక్రభ్రమణం; పుత్రకామేష్టి అంటే సృష్టి. దీనితో కావ్యం ప్రారంభం కావడం అంటే ఒక కల్పకథ ప్రారంభానికిది సూచకం. మరణంతో లేక స్వస్థాన గమనంతో కథ ముగియడమంటే ఒక సృష్టివృత్తము పూర్తి అయినదని అర్థం. రామాయణ మొకకల్పకథ అయితే భారతం మరొక కల్పకథ అది పూర్వ కల్పము. ఇది పరకల్పము. త్రేతా ద్వాపర యుగాలని తాత్పర్యం. ఇది తత్త్వదృష్ట్యా కాల దృష్టి తప్ప చరిత్ర దృష్ట్యా కాలదృష్టి కాదు.

సీత భూసంజాత అంటే పృథివీ తత్త్వం. అంటే ప్రకృతీ-పదార్థం రాముడు సూర్యవంశపు క్షత్రియుడు. సూర్యుడు ద్యులోకం పురుషుడు-చైతన్యం. ఈ రెంటి సమన్వయం రామాయణ కథ, ఇక్కడ వేదమంత్రముంది, 'ఆకాశం తండ్రియని, భూమి తల్లియని' అనగా వ్యక్తావ్యక్త సమన్వయం. దేవతాపురము

అయోధ్య—'దేవానాం పూరయోధ్యా' అని వేదం, ఈ నగరంలోకి రాముడు అవతరించాడు. అతడు అదితి దైవత్య నక్షత్రంలో జన్మించాడని మహర్షి అన్నాడు. అదితి అంటే దేవమాత, అంటే సృష్టియొక్క అభివ్యక్త దశను అది సూచిస్తున్నది. పదార్థంలోకి ఆత్మశక్తి ప్రవేశించి సృష్టి స్పందించడం ప్రారంభిస్తున్నదని అర్థం. కథంటే తాత్త్వికంగా ఇదే,

ఇతిహాస ఆకృతి:—నామకరణం, కావ్య ప్రారంభాంతాలు, కావ్యవిభాగాలు, విభాగ నామకరణం, ఇవన్నీ కావ్యాకృతికి సంబంధించినవి. చిత్రలేఖనంలో రేఖల్లాంటివి, ఇవి వస్తుగత చైతన్య వ్యంజకమైనట్లు కావ్య విభాగ నామకరణాదుల్లు కూడ వస్తుగతచైతన్య వ్యంజకాలే లేక ప్రతీకలే. రామాయణ నామకరణం రాముని గమనమన్న అర్థంతో చేయబడింది. అయనమంటే గమనం, ఉత్తరాయణం, దక్షిణాయణం ఉదాహరణంగా తీసికొనవచ్చు, ఉత్తరాయనమంటే జీవుడు స్వస్థానానికి చేరుకోవడం, పంచాగ్ని విద్యలో చెప్పబడ్డ ద్యులోకాన్ని చేరుకోవడం. ఉత్తరశబ్దం ముక్తస్థితిని సూచించేది. ఇందుకే రామాయణ చివరి కాండ ఉత్తరకాండ అయింది. బాలకాండ జన్మ, ఉత్తరకాండ మరణం—జీవుని స్వస్థాన గమనం.

రామాయణంలో ఏడు కాండలు. సప్తసంఖ్య అనంతత్వమునకు ప్రతీక, సంపూర్ణతకు ప్రతీక. బేసిసంఖ్య అవ్యక్తమునూ, అనంతత్వమునూ గ్రాహ్యతులు సూచించినవి. ఏకైకమైన తత్త్వం అనే కథా చీలి సృష్టిగా మారింది. ఈ అనేకత్వం పేరు సప్త. 'తంధీరా వాచా ప్రణయంతి సప్తా'. ఋషులు మూల తత్త్వాన్ని సప్తసంఖ్యచే చెప్పారు.

కాండ: దుంపనుండి మొదటిగా బహిర్గతమైన కాడ పేరు కాండం. వృక్ష శాస్త్రంలో Ryzome అంటారు. దీని నుండి ముడులు లేక బుడుపులు Nodules పుడతాయి. వీటినుండి వేళ్ళు క్రిందకు, పైకి కాడలు, వీటినుండి నీటిపైకి కనిపించే కాడలు, వాటినుండి ఆకులు, పూలు ఇది తామరతీగ స్వరూపం. కాబట్టి నీటికి అడుగున దుంపనుండి సాగిన కాడ యొక్క ప్రథమభాగం. ఇది కొంత సాగి దీన్నుండి ఏర్పడే బుడుపులు—తీగలు వీటిని 'పర్వములు' అంటారు. అవ్యక్తం పేరు మూలకందం, దాని ప్రథమ బహిర్గమన దశ కాండం. దాని తరువాతి దశ పర్వం. మూలకందం వేదం. దాని బహిర్గమనం కాండం, అనగా రామాయణం

తరువాతది భారతం. భారతం విస్తృతం. కారణమేమంటే పర్వం నుండే
కాడలు, ఆకులు, పూలు ఇలా తామర—తంపరగా అల్లుకుపోతుంది. తామ
జగత్తుకు సంకేతం. 'పద్మమన భూత ధాత్రి'—అని శాంతిపర్వం.
భారతీయ శిల్పకళలో తామరతీగ బహుధా శిల్పించబడటం స్పష్టమే.

ఇతిహాస నిర్వహణ: పై విషయాలను చెప్పే పద్ధతి ఇది. ఇ
విషయం. సామాన్యంగా ఇతిహాస మానవ సంఘం, జీవితం, ప్రథమ
పుడుతుంది, నాటకాదులు తరువాత వచ్చాయి. మానవ నాగరికతలో పల్లీయ
కత ప్రథమం, పట్టణ నాగరకత తరువాత ఇతిహాస శైలి పల్లీ నాగ
సంబంధించింది. ఇది సరళ జీవితం. వక్రత ఉండదు, అంటే నిరలంకృ
ద్వారా నిర్మల పవిత్ర భావచిత్రణ. సామాన్య చ్ఛందములో చెప్పబడతాయి
కథనంలో వక్రత వుండదు. కానీ భారత కథనంలో వక్రత వుంది, దానికి
పట్టణ నాగరకత వచ్చిన తరువాత పుట్టిన గ్రంథమది. రామాయ
అరణ్యాలు, ఆశ్రమాలు, మానవ స్వభావాలు మధుర మధురంగా చిత్రించ
దృశ్యమానమౌతుంది. అసలు రామకథ అంతా అడవిలో జరిగిందే.
రామాయణ కథ నిత్యమైన దాంపత్య కథ ప్రకృతి పురుష దాంపత్య కథ.
చేత సీతారాములు స్త్రీ పురుషులకు, వారి వారి తత్త్వాలకు, వారి వారి భా
మధురస్నేహాలకు ప్రతీకలైనాయి. ప్రతీకలే కాదు. రెంటికీ అభేదమే
గృహస్థాశ్రమ కథ. శృంగార కథ భారతం సాంఘిక కథ. అంటే
జీవితం కంటె అవతల వున్న సంఘ జీవితకథ. రామాయణం కామ ప
సంబంధమైన కథ. భారతము అర్థపురుషార్థ సంబంధి. రామాయణం స్త్రీ, పురు
సమన్వయాన్ని ఆర్షగృహస్థాశ్రమ పవిత్ర మాధుర్యాన్ని స్నేహాది ధర్మాల
భావ సౌందర్యాన్ని చిత్రిస్తూ ఉండగా—భారతం మానవుని బహిర్గతమైన స
సంఘర్షణను చిత్రిస్తుంది. లోకమంటే అర్థకామ స్వరూపం, రామాయణ భ
రెంటినీ గురించి చెప్పిన తరువాత లౌకిక వ్యవస్థను గూర్చి చెప్పడానికి వ
లేదుగనక మరొక కావ్యంలేదు. మిగిలిన పురుషార్థ మొక్కటే మోక్షం
పారలౌకికం. దాన్ని చెప్పడంకోసమే భాగవతం పుట్టింది. ఈ మూడే పురు
ఈ మూడే పుస్తకాలు, నాలుగవ పురుషార్థము లేదు. నాలుగవ పుస్తకము
ధర్మ పురుషార్థము ప్రత్యేకమైన పురుషార్థము కాదు. ధర్మం అంటే ఈ

పురుషార్థాలకూ సమన్వయ సూత్రం. 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అంటే అర్థకామాది రూపమైన లోకాన్ని పారలౌకికమైన మోక్ష పురుషార్థంతో సమన్వయించడానికి భగవంతు డవతరించడం. కాబట్టి ధర్మం ఐహికాముష్మిక సమన్వయ సూత్రం. లోకమొక సరళరేఖ. దానికి ప్రథమ బిందువు అర్థం కాగా చివరి బిందువు కామం. ఈ సరళరేఖకు పైన ఊర్ధ్వబిందువు మోక్షం. ఇదొక త్రికోణం, ఈ మూటిని కలుపుతూ వృత్తం గీస్తే అది ధర్మం. ఈ వృత్త పరిరక్షణ అవతార బాధ్యత. ప్రయోజనం. అప్పుడది సంపూర్ణ మానవజీవితం. రామాయణంలో శ్రీరాముడు, భారతంలో శ్రీకృష్ణుడు అవతారాలనటంలో రహస్యమిదే. అందుకే ఈ కథలకు క్షతిలేదు. అవి చావవు. చస్తే లోకం లేదు కాబట్టి.

అర్థ కామాలను మోక్ష పురుషార్థంలో పర్యవసింపచేయటం ఆర్ష జీవిత లక్ష్యం. ఇతిహాసంలో ఇది నిరూపించబడుతుంది, ఇందుకే రామాయణ కల్ప వృక్షంలో

'వేద విహితనాగకత విభుడుమనువు
ఇహపరంబుల రెంటిని నేకపఱచె'

అని చెప్పబడింది. ఇందుకే సర్వరసాలు శాంతంలో పర్యవసిస్తాయని శాంతం ప్రధానరసమని ఆలంకారికులు చెప్పటం. అప్పుడు రామాయణంలో రసం శాంతం కావాలి. భారతంలోలాగానే ఈ మాట ప్రాచీనాలంకారికుడయిన కుంతకుడు రామాయణంలోనూ శాంతమే రసమంటూ

'రామాయణ మహాభారత యోశ్చ శాంతాంగిత్వం

పూర్వ సూరభిరేవ నిరూపితం' (ధార్వాడ విశ్వ విద్యాలయం ప్రకటించిన వక్రోక్తి జీవితంలో ఈ శ్లోకపాఠం సరికాదని - కరుణ శాంతాగిత్వం - అని వుండాలనీ సూచించారు. వ్యాఖ్యానంలో అచార్య కృష్ణమూర్తిగారు)

రామాయణ మహాభారతాల్లో. శాంతరసమే అంగిరసమని పూర్వ పండితులు నిరూపించారని దీనికర్థం. ఎవరో ఆ పూర్వపండితులు తెలియదు. ఇతిహాస వస్తు దృష్టినిబట్టి తత్కర్తయైన ఋషి మనస్తత్త్వమునుబట్టి ఆర్షజీవిత సమన్వయదృష్టిని బట్టి రసం శాంతమే. కావ్యనాటకాల్లో ఇతర రసాలనుచెప్పి ఇతిహాసంలో శాంతం

చెప్పడం సముచితమైన పద్ధతి. ఈ సిద్ధాంతానికడ్డుగా ఆనంద వర్ధనాచార్యుల వారు చెప్పిన రామాయణ కరుణరసవాదం కన్పిస్తున్నది. ఈ చర్చకిది అదనుకాదు. ఆనందవర్ధనులు ధర్మవీరాదులు సాహంకారులు కావు. నిరహంకారాత్మకాలు. కాబట్టి శాంతరసప్రభేదములే అని అనటం వారి ఆర్షజీవిత రహస్య దర్శనానికి ప్రబల తార్కాణం. పైన చెప్పినట్లు ధర్మం ప్రత్యేక పురుషార్థంకాదు కాబట్టి. ఇందుకే విశ్వనాథ కవి సామ్రాట్టు తన రామాయణంలో శాంతరసాన్నే స్థాపించారు.

ఇదీ రామాయణంలో ఐతిహాసిక లక్షణం అంటే.

# 10. కల్పవృక్షం (కాస్మిటిక్) ఐతిహాసికత

"ఆ యుగాలు ఆనంద తుండిలాలు. నక్షత్రమండలాకు మార్గసూచకంగా వున్న రోజులవి. మార్గానికి వెలుగునిచ్చేవి ఆకాశంలో వెలుగుల చుక్కలు. ప్రతిదీ పరిచితమే—ప్రతిదీ ప్రత్యగ్రమే ఆ యుగ మనోలక్షణ మది. వీరవిక్రమణంతో సాధించటం—అయినా స్వంతమే. ప్రపంచం సువిశాలమైనా మనిషికి సొంత ఇల్లుగానే వుండేవి ఎందుకంటే ఏ అగ్ని ఆత్మలో వుండేదో అదే నక్షత్రాల్లోనూ ప్రకాశించేది. ఆత్మ-విశ్వం ఎప్పుడూ వేరుకాలేదు. వేరుగా కన్పించినా అలా ఆత్మక్రియలన్నీ ద్వంద్వాత్మకవృత్తంలో అర్థవంతంగా వుండేవి. అర్థం సంపూర్ణం. ఇంద్రియతృప్తినిచ్చేది. వృత్తమంటే ఆత్మక్రియోన్ముఖమైనా తనలో తానుండేవి. వేరుగా వుంటూ క్రియావంతమయ్యేది. తన కేంద్రంలో తానుంటూ ఒక నేమిని సృష్టించుకొనేది. నోవాలిస్ అన్నాడు "తత్త్వమంటే ఇంటిబెంగ. ప్రతిచోటా స్వగృహభావన చేయటం" అని—ఇతిహాసకాల లక్షణమిది. గ్రీకు మేధాసంపత్తి జీవితపూర్ణత మనకర్థం కానంత భూతంలో దూరంగా వుంది. వారికి సమాధానాలు తెలుసు. ప్రశ్నలు లేవు. ప్రళయం లేదు. ఈ ప్రపంచ సృష్టి వుంది. ద్వంద్వమున్నా దానిచుట్టూ ఒక వృత్తం గీసుకొన్నాడు, మనకంతా ద్వంద్వమే. విరుద్ధాలపుట్ట లోకం. వారికి విశ్రాంతి. నవలా సిద్ధాంతమన్న గ్రంథంలో జార్జి లూకాజ్ అన్నమార్క్స్ సిద్ధాంతవేత్త—ఇతిహాసం కాల నిర్వచనం చేసాడు.

మనిషీ-కోతీ-రాక్షసీ-చెట్టూ-పుట్టా-పామూ-పక్షీ-రాయీ-దేవతా-నదీ-అగ్నీ-వాయువూ—సర్వమూ కలిసి చేసిన ఒక సామూహిక నాట్యం మనోవాఙ్మయం ఇతిహాసం.

అంగికం భువనం యస్య—వాచకం సర్వవాఙ్మయం. ఆహార్యం చంద్ర తారాది—తం నుమః సాత్త్వికం శివం' అన్న శ్లోకం—కేవలం విశ్వనాట్య విషయమే. మహానర్తకుడు శివుడు.

"చలికాలమున హిమాచల గంధికావర్త -
ముల సీత్కృలను వెచ్చగిలగ తెచ్చి

వేసంగిలో మంచు పూసకట్టుల సొమ్ము -
లొడ్డు ముత్తెపు బిందు లొత్తిగిలగ తెచ్చి
తాన మాడంగబోయిన తరగముత్త -
ములను నామూర్ధమునయందు మూరుకొనుచు
నేచియేచి మాయన్వృషుతాబికన్న -
నలరు క్రొందమ్మి కన్నుల నారగూరు.

(అహల్యాఖండం-200)

విశ్వామిత్రుని అక్క- సత్యవతి కౌశికీ - నదిగా పరిణమిస్తే - ఆ యొడ్డున తమ్ముడు ఆశ్రమం కట్టి తపస్సు చేస్తున్నాడు. వారిద్దరి స్నేహమాధుర్యం పై పద్యం. నదీ-మానవ చైతన్యం కలిసి చేసిన నాట్యావర్తం-పద్యం.

'ప్రభు మేని పైగాలి పైవచ్చినంతనే పాషాణ మొకటికి స్పర్శ వచ్చె'

ఆనంద ఘనుడైన విశ్వశిల్పి సమీపించగానే రాతిలో నిద్రాణమైన ఆత్మ గలగలా స్పందించి గాజుల సవ్వడితో అహల్యగా మారింది. శిల శిల్పమైపోయింది. శిలగా వర్తించిన చైతన్యం అహల్యాచైతన్యమై రూపుదాల్చటం పద్యభావం.

[1] "అగ్రయాయుల వశిష్ఠాదుల ఫాలభా-గముల తేజోరూప కాంతులగుచు
శ్రీలోకవదన రాజీవ సంస్పర్శ హే-లాముగ్ధ కరవిచాలనము లగుచు
కదలినవి బాలమార్తాండ కౌంకుమార్చి-మస్పణ మందార మాలికా
విస్ఫుమర ప్ర
శస్త సుకుమార కాంతి ప్రసారణములు-కమలినీ కన్యకాత్రపాకారణములు
ఎదురుగానేగుచో నెడలపై హాటనా-యక రత్నముల కంశులప్పు వెట్టి
ఎడమకు తిరుగుచు నేగుచో గుడి ఋజుమ్ముఁననంగదచ్ఛవుల్ గులకరించి
సాగి ప్రొద్దెక్కిన కొలంది చండకరుండు
దారిమలకలు తిరిగిన దశరథేశు
సైన్యమునయందు గాంతి ప్రసార చిత్ర
వల్గు గమనంబులన్ వళావళులు చేసే (ధనుష్ఖండం-కల్పవృక్షం)

---

1. ఈ విషయాన్ని మొదటిగా గ్రహించి వ్రాసినవాడు శ్రీభరతశర్మగారు.

దేవుడు పెళ్ళికి దశరథాదులు విదేహాకు వస్తుంటే సూర్యకాంతి వారితో— పెండ్లి పెద్దలతోపాటు తానూ—ఒక పెద్దగా ఒయ్యారంగా వస్తున్నాడు. ఆకాశమంత పందిరి కనుక దానికి వ్రేలాడదీసిన పెద్ద బల్బుగా—భూదేవంత కళ్యాణ వేదిక నలంకరిస్తూ :

జలజాతేక్షణ గౌతమీతటమునన్ స్నానార్థ మేతేరగా
వలయాకార ప్రదక్షిణంబుగ నదీ వార్వేణిసోదాపునీ
కలిత స్తంభముగాగ లేచిమునుకల్ కల్పించి నూత్నాంబు జాం
జలియై కానుకలిచ్చిపోవు వినయస్కన్నాంబు మర్యాదపై

(అరణ్యం—మారీచ ఖండ)

ఎన్నెన్ని పద్యాలు—పై మహానాట్య స్ఫోరకంగా వుదాహరించను. అన్నీ జడాజడ జీవులన్నీ అందులో నర్తకులే. అంత అద్భుత నాట్యంపేరు ఇతిహాసం.

మహాబలిపురంలోని భగీరథ తపస్సు (కిరాతార్జునీయ కథగా కొందరు-అన్న పర్వతపార్శ్వస్థ శిల్ప మహేతిహాసంలో పాత్రలుగా సకల జంతువులూ-దేవతలు-ఋషులు-మనుజులు-దైవం-నదీ ప్రవాహాలు-అరణ్యాలూ చెక్కబడటం-శిల్పవ్యాఖ్యాతల కెంత ముగ్ధంగా అద్భుతంగా తోచిందో వారు వ్రాసిన విమర్శలు చూడాలి.

(చూ. Cosmic Art of India
—by Prof. Radhakamal Mukherji)

ఇక్కడ త్రిలోకజీవులు సర్వమూ పాత్రలే. ఇదే మహానాట్యం. 'కల్ప వృక్షంలో గంగావతరణ గాథ ఈ దృష్టితో శిల్పించబడినదే. రెంటినీ కలిపి చదువుకోగలిగిన మహానుభావులకు — మహాభావుకులకు.

ఇది ఇతిహాస వస్తు విన్యాస సంగీతం. ఒక విశ్వకథ ఒక సృష్టి స్పందనా వర్తనర్తనం. ఇందుకే కల్పవృక్షం ఆత్మ నిత్యమంటూ అవనిపై కుడిపాదం మోపుతూ అవతరించవలసి వచ్చింది. ఆత్మ అంటే స్పందించేది. దాని స్పందనం మహాచ్ఛందం. సంగీతం. నాట్యం. ఈ యోగదర్శనం కలవాని రచనా సృష్టి కల్పవృక్షం. ఇందుకే ఇష్టి ఖండం దాని మొదటి అంకురం—ముఖం ఇష్టి అంటే సృష్టికోసమైన తపస్సు. అగ్నికార్యం. ద్యావాపృథ్వ్యాకాశ మహామైథున క్రతువు.

ఇందుకే కాండం పంచఖండాలుగా విభక్తం కావటం-'పంచేంద్రియాఖ్య శిఖలో'-దిగిన సనాతన నారాయణరూప వటవృక్షం. వృక్షం సమతారూప వృద్ధికి ప్రతి మచ్ఛదం (ప్రాగ్రూపం) విశ్వమే మహాకల్పవృక్షం.

ఈ విశ్వనాట్యం-ఇతిహాసాన్నికన్న చైతన్య భూమిక-విశ్వచైతన్యం. కవి ప్రతిభాఋషిత్వంతో-విశ్వదర్శన శక్తితో సంగమిస్తున్నదో ఆ దశ.

అంతమౌని రామునానసంబును జూచు
భుండె నిశ్చలముగ గనులయందు
నిట్లు తోచె మునికి ఇంత అజ్ఞల్పాక్తి
లేని యచ్ఛ మనసులోని ఊహ

ముని ఊహ రామునకు తెలి
యు నతని తెలివి మునికి తెలియుక వాగ్వికృతిం
జను తెలివి సర్వగ-సనా,
తని వ్యోమస్థితయు స్వగత తానది యగుటన్

(అరణ్యం-దశవర్ష)

అగస్త్యమౌని-రాముల మధ్య నిశ్శబ్ద భావవ్యాపార వర్ణన ఇది. ఇది పరావాక్ దశ. సవ్వడి లేదు. కనుక అక్షరాలు లేవు. శబ్దపూర్వరూపమైన భావం. దాన్ని అక్కడే చూపటం. ఆ అచ్ఛ తెలివి సనాతన కాలం లేదు. సర్వగదేశం లేదు. వ్యోమస్థిత-సహస్రారస్థిత-స్వగత, బాహిరమైన జ్ఞానం కానిది. ఇదే "సహస్రాక్షరావాక్"గా వేదం గానం చేసింది.

'బాహ్య వస్తుజ్ఞానంలో దృష్టా. దృశ్యాలు వేరు. దేనికదిగానే వుంటాయి. సబ్జెక్ట్+ఆబ్జెక్ట్‌ల మధ్య ఏకీభావంలేదు. ఇది పరోక్ష జ్ఞానం (ఇన్-డైరెక్ట్) ఇంద్రియ సాధ్యం కనుక ఇది వస్తువును గురించిన జ్ఞానంతప్ప వస్తుజ్ఞానం కాదు. ప్రత్యక్ష జ్ఞానంలో నేనూ-వస్తువు ఏకమౌతాం. ఈ అభేద ప్రతిపత్తినే జ్ఞాన మంటాం. అని ఆధునిక మనస్తత్వశాస్త్ర పరిశోధన గుర్తించినది.

ఈ తెలివిలో దేశకాల వైయక్తిక మనోలయం జరుగుతుంది. కనుక బృహన్మనస్సు (బృహస్పతి అంటే వేదం ప్రకారం ఇదే). అక్కడ ఒక్క-

క్షణంలో కలిగిన జ్ఞానం లోకంలో పొందాలంటే ఏండ్లూ-పూండ్లూ పడుతుం దంటాడు డా. బక్ (యండి) తన Cosmic-Clousness అన్న గ్రంథంలో. అదొక బృహత్క్రాంతి వలయమట. ఒక దివ్యానంద సంభృతస్థితి-అని దాన్ని అనుభవించి వర్ణించాడు కెనడా వైద్యుడైన బక్ (గీత ఈ చైతన్య భూమికలో విన్పించింది కనుక అంత పెద్ద గ్రంథం యుద్ధం ముందు చెప్పటం సాధ్యమా— అన్న హేతువాదం-ఇక్కడే దెబ్బతిన్నది.)

ఆజ్ఞానం సర్వసమన్వయాత్మకం. దర్శనాత్మకం. విరుద్ధాంశస్ఫురణ లేనిది. ఒకదానిలో ఒకటి లీనమైపోయిన దశ. చరాచర జగత్తునూ సమన్వయించిన మహానాట్య రంగమది. కనుకనే:

సీతాదేవి మరల గొంతె దవ్వు చని యొక వల్మీకము చాటుచేసికొని నిలుచుండ రావణుండు వెన్నంటి యామె బట్టుకొన

దుష్ట సర్పాస్యలగ్న దర్దురశిశువలె
కీచుమనె సీత, నాకు సంకేత భుజగి
యొత్తు లజ్జాళ్ల ధవరీభవోగ్ర శిరస్సు
నొక శిలాస్థలి వేసి కొట్టుకొన చచ్చె

"విడులు నచ్చరల గుప్పిళ్ళట్టు పోలికుసు
నందివర్ధనపూల యంతపుషాలి
స్వాగతి నేరపు అచ్చరలు చేతులు చాచి
నవిధాన ప్రవహించు నదులు డాసె"

వంటి అతిలోక, భావరామణీయకత పూచిన చెట్టు కల్పవృక్షం—సంకల్ప వృక్షం. విశ్వచైతన్యంలో దుఃఖస్పర్శలేదు. వున్నా రసమే. ఒక మహానందతాండవం. ప్రతివస్తువూ ఆత్మకల్పించిన కలదే. జడత్వంలేదు. అందుకని విపత్తునందిన సీతతో ఐక్యమౌతుంది ప్రకృతి దుఃఖిస్తుంది. నది అచ్చర చేయిలాగా వుంటుంది. లాగా కాదు. అచ్చరచ్చాన హస్తమే. ఇది దర్శనం తప్ప ఊహ కాదు.

సీతాపహరణ ఘట్టమంతా ఈ చైతన్య భూమిక నుండి పుట్టినదే. సీత విశ్వధర్మభావ స్వరూపిణి. రావణుడు విశ్వ అధర్మభావ మూర్తప్రతీక. ఈ రెంటి

ఘర్షణ అంతరాకాశ సంబంధమైనది. ఇందుకే మహాకవి అనేక విచిత్రచ్ఛందాలు ఆ ఘట్టంలో కుప్పపోసాడు. ధర్మాధర్మ ఘర్షణరూపమైన విషమగతికి ఆ ఛందాలు ప్రతీకలు. విచిత్రచ్ఛందాలు వ్రాసి మధ్య మధ్య సామాన్య ఛందాలు వ్రాయటం నుండి ఒక విషమగతి ఏర్పడుతుంది. ఆ ఘట్టమంతా అలాగే చూడాలి. ఇక్కడి పాత్రలెవరు? మనోవస్తుగతధర్మభావాలైన దేవతలు.

'అంత స్థితి హేతుభూతయైన వైష్ణవి పరాశక్తి — పాంచజన్యముఖి — సుదర్శన పాలిత యిట్లనుకొనియె'

శ్రీరమణం :

ఇంత తమస్సాహిత్యము గల్గన్
శాంతము సత్త్వము సాగుటయున్నే

మరియు సనాతనులు త్రయీ దేవతలు :

ఈ పురుషుండు ఈ స్త్రీయు నిద్దరే యింతియు బతియు—
ఏ పురుషుండో ఏ స్త్రీయొ ఎందుకో యేలకారు—

ఉన్నచోట-సృష్టి గతిలోని ఋత (ఆర్డర్) స్థితిని వ్యాఖ్యానించటం. ఈ భూమికను వ్యాఖ్యానించేవే ఈ ఖండాంతంలోని పద్యాలు.

జనక జాత శరీర నిష్ఠం బొనర్ప
కడక వ్యవసాయి యగు బంక్తి కంధరుండు
రావణుని బోధ దేవ భావావృతునిగ
జేతకు గడంగు బూత ధాత్రీ తనూజ

దైత్య ధాత్రికి వచ్చిన ధరణి జాత
దైత్య భావము కనునని దైత్యరాజు
దైత్య ధారుణి పెకలించి దైవగుణము
తా సముద్ధిన్న మగునని ధరణి జాత.

గీతలోని దైవాసుర గుణసంపత్తి మోనవృష్ట్యా సమన్వయించుకోవచ్చు. ఈ గుణా లనే ప్రథమచ్ఛదాలు (ప్రాగ్రూపాలు)గా ఆధునిక మనస్తత్త్వ శాస్త్రం చెబు

తున్నది. లోకదశలో జరిగే సర్వవైయక్తిక సంఘటనలకూ మూల భూతాలైన ఆదిమభావాలు (ఆర్కిటైపు్స) కథను బాహ్యాకాశంలో జరిగినట్లు కవి చిత్రించినా భావుకుని అనుభవంలో అది అంతరాకాశ విషయంగా అనుభూతం కావటానికి హేతువులుగా పై పద్యాలు వ్రాయబడ్డాయి.

ఈ ఘట్టంలోనే మారీచుడు లేడిగా మారినప్పుడు ఒక అద్భుత పద్యం వ్రాయబడింది.

ఆకాశంబున వ్రేళ్ళు పారిన శిరోవ్యత్యస్తభూమీజమై
వ్యాకీర్ణంబుగ వందపంగలగు శృంగావీత గర్వంబునన్
ఘూకాంతుంబలె నున్న దుప్పిగనుచున్ బూర్వ్యామరుండల్పదే
హకారార్తమతిన్ భయంపడియెలిప్తాంశైక భాగంబునన్

దుప్పికొమ్ములు దైవం తలక్రిందులైన విశ్వరూపం, దాని కొమ్మలే లేడికొమ్ములు. వ్యామోహాలష్టలన్నమాట. దానిచేత అది గర్విస్తుంది — అంటే విశ్వమే మృగమని. అది నడచిన దారి మార్గం. మృగం జాడ. అవిభక్త మహాచైతన్యం నుండి వ్యష్టి చైతన్య మేర్పడటమే సృష్టి. అది పదార్థాకృష్టం కావడమే సంసారం మొదలు. అందుకే అది బంగారులేడి.

ఇక్కడ రావణుడు భయపడటం దేనికి? ఈ భయస్వరూపమేమిటి? భయపడితే సీత-రామ-లక్ష్మణులు భయపడాలి తప్ప. లేడి రావణుని బంటుకదా. వాడి కెందుకు భయం. కనుక ఇది భౌతికంకాదు. ఏదో అంతరభయం. అంతశ్చైతన్యం లోని మూలభావం తప్ప సమష్టి చైతన్యం నుండీ (ఇదిగా మనస్తత్త్వ శాస్త్ర వేత్తలు చెప్పింది) వ్యక్తి విడిపోయిన దశనుండి నేటిదాకా తెచ్చుకొన్నది. దాన్ని కప్పుకోవటానికి చేసే ప్రయత్నాలే ఇన్ని శాస్త్రకల్పనలు.

సుందరకాండ ప్రారంభంలో హనుమ లంకను—దాని ఆకృతిని చూచి అనుకున్నాడట. 'అరే సముద్రం దాటి మనిషి వస్తాడా? వస్తే కదా కోటగోడ ఉనికికి అవసరం. కనుక పీడిలో లోపల జీవగతంగా ఏదో భయమున్నట్లుందని ఇది తాత్త్వికభీతి.

అంతర్లోతుల్లోకి పోయి భావం తేవటం ఇతిహాస కవికి మాత్రమే సాధ్యం. ఋషిత్వము+కవి+త్వం+శిల్పిత్వం=ఇతిహాస కవి.

వాస్తవిక సత్యం బాహ్యేంద్రియ విషయం. వస్తుతత్త్వావర్ణనం. ఋషిత్వం. దాన్ని వర్ణించేది కవి స్వభావం (కవి-త్వం). అది కథా మూర్తిని ధరిస్తే అంగాంగి సమన్వయం చేసేది శిల్పిత్వం. ఇది విశ్వనాథుని కవితా చైతన్య సంపుటి.

అంతయో ఇంతయో తెలిసినట్టి విమర్శకులైన కావ్య సి
ద్ధాంతుం యొత్తిడింబడి మహాకవి నాగటిచాలు తీర్చు కా
లాంతర కీర్తివృష్టిగతమై చను లాభము నెంచుచున్-లలా
టం తపపరూక్ష చింతన నటన్మధు భారతి సస్యధారుణిన్

ఫాలం పగిలిపోయేటంతగా చేసే చింతనమే తపస్సు. దాని నుండి లభించే మధురభారతీనాట్యం. అదే శబ్దక్షేత్రం—సస్యధారుణి. దానిలో కవి సాగేటి చాలు పన్ని కీర్తి వృష్టిగత సస్యాన్ని పండించుకుంటున్నాడు. ఇది వ్యావసాయిక కోప మానం. కవి పుట్టిన దేశమిది. ఆయన జీవకణాల్లో వున్నది—సీతాసస్యం.

రామాయణ కథ వ్యావసాయిక కథ. జనకుడు యజ్ఞవాటికను దున్నటం-సీత జన్మించటం-సీతాయాశ్చరితం మహత్-కావ్య కథాంశం. సీత చరిత్ర. కావ్యమే సీత-జనకుడు కవి. ఈ అలంకారం కవికి అన్వయిస్తూనే కావ్యకథను-ఆకర్షించటం-ఇతిహాస రచనా లక్షణం.

కవి మహర్షి-తపోగ్నిచే క్రాగి క్రాగీ
స్వతేజః ఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ చూచితి క్షోణిజాత—నని

హనుమ సుందరకాండలో అన్నాడు. ఈ రసమూర్తే కావ్యం సీత. ఆమె పోతపోసిన పద్దులాగా పసిమి మేనికాంతితో వున్నదని హనుమ దర్శనం. ఇదే సస్యధారణి-కాలాంతరలాభం. ఈ కావ్యప్రతిమ-సీతాసువర్ణ (ప్రతిమ) పై పద్యం లోని అంతరువు నుండి బహిర్గతమౌతున్నది. ఈ తీర్పే ఇతిహాస లక్షణ కవి అంతశ్చైతన్యం దాకా మధనపడితే తప్ప ఈ ఇతిహాస మూర్తి శబ్దంగా అవతరించదు. అదే లలాటం తప ఈక్ష చింతనగా మహాకవి చెప్పినది.

ఈ కావ్యప్రతిమను విశదీకరిస్తే యిలా వుంటుంది;

పై కథావృత్తాన్ని విస్మరించి భావసూత్ర దృష్ట్యా చూస్తే అహల్య కపధి సీత. అహల్య—బీటినేల, వర్షం కురవనినేల. ఫలించని నేల. ఇంద్రుడు వర్షా స్వరూపుడైన పురుషుడు. 'భూమ్యాకాశ సమన్వయమే—అహల్య ఇంద్ర కథ. సీతారాముల కథ. ఈ కథకది అంతర్నాటిక. దాన్నే గర్భాంకమనీ అంటారు. భారతంలో నల కథకు పెంపుదలే పాండవ, కౌరవ కథ. అది బీజం. ఇది వటవృక్షం.

అహల్య—హలాగ్రం సోకని-వర్షించని-ఫలించని బీటినేల. (ప్రాచీన రాజనీతిలో బీటినేల ఫలించటం ధార్మిక చక్రవర్తి పాలనకు చిహ్నంగా చెప్పారు పౌరాణికులైన ఋషులు) ఇంద్రుని శరీరమంతా భగమయం కావటం-అతనిలోని ప్రత్యణువుసృష్టి చేయగల జీవశక్తి. కందదుంపలో ప్రతికన్నూ పిలకవేస్తుంది. అతడు సృష్టికర్తయైన ప్రజాపతి. ఆమె శిల కావటంలోని రహస్యమేమంటే శిలా జన్యం శిల్పం. శిల్పానికి జనకస్థానం శిల. శిల-కొండ స్థితిసంకేతం. ఆ స్థితి భౌమ స్థితి. దానినుండి మధుజలాలను ప్రస్రవింపచేసుకోవటం యోగికార్యం. ఈ శిలా వృత్తాంతం సర్వమత వాఙ్మయంలోనూ వుంది వేదంలో గ్రావసూక్తముంది. అక్కడ సోమరసం నూరేరాళ్లు—ఋషికి దేవతాల్లాగా దర్శనమిస్తాయి. బండ నుండి మత ఆధ్యాత్మిక రహస్యాలు సూత్రాలుగా రావటం-లోకానికి-కాశ్మీర-శివా ద్వైతంలోనూ—క్రైస్తవంలోనూ వున్నదే, వినేవాడికి శిలలో మంత్రం ధ్వని స్తుంది. కనేవాడికి శిలలో శిల్పం దర్శనమిస్తుంది. (మైకేల్ ఎంగిల్‌కి శిలను చూడగానే తాను చెక్కబోయే శిల్పం కన్పించేదట. ఇందుకే భారతీయ శిల్ప శాస్త్రంలో చెక్కటమంటే—శిల్పం చుట్టూ ఘనీభవించి పోయిన అనవసర శిలా పదార్థాన్ని తొలగించటమే నన్న అర్థం చెబుతారు) శిల మరలా శిల్పం కావటం.

మనస్తత్త్వ శాస్త్రవేత్త లంటున్నారు: దేవతలు ఉభయలింగులు విరుద్ధాంశ సమన్వయమూర్తులు. అవి భుక్త చైతన్య ప్రతీకలు కనుక స్త్రీ పురుష విరుద్ధాంశ గర్భితమూర్తులు. లేదా ప్రథమతః విడిపోతున్న సంధ్యాకాలంలోని మూర్తులు అని యూంగ్ వివరణ. ప్రతిమనిషి ఉభయలింగి. దేహం పురుషాకారమైతే స్త్రీ - మాతృ - కణాలు సుప్తచైతన్యంగా లోపలుంటే; స్త్రీ అంశవ్యక్తమైతే పుంస్త్వ వ్యక్త్యం-పితృకణాంశ ఆమె సుప్తచైతన్యంగా వుంటాయనీ-అతని పరిశోధన సారాంశమే. కనుక స్త్రీ=అహల్య. పురుష-ఇంద్ర-శరీరంమీద భగచిహ్నాలు—అంతర్గత సుప్తచైతన్య స్వరూపమైన విశ్వస్త్రీత్వం. ఇది ప్రథమచ్ఛద వివరణం.

అహల్యా కథకు పరాకాష్ఠ సీతారామ కథ కదా. ఇందుకే అహల్య వృత్తాంతం విని రాముడు జాలిపడతాడు. అసహ్యించుకోడు (నైతికాచార్యునిలాగా) తిరిగి వివాహానంతరం అహల్యను దర్శిస్తాడు,

"గౌతమ మునీంద్రుని భార్య అహల్య యెంత ప
డ్డది యలనామె దుఃఖ వికట జ్వలితాగ్ని మదంతరంబునం
దొదిగిన కోటి జన్మల మహోన్నత దుఃఖము ద్రవ్వి చూపె"

నని తల్లితో అన్నాడు. ఏమిటా దుఃఖం?—సీతా వియోగం తనలో—కాల గర్భంలో, (భావి) నిక్షిప్తమై అక్కడే వున్నదాన్ని అనుభవించటం. తర్వాత సీతారామ దాంపత్య వర్ణన వస్తుంది.

"ఏపున మింటి నుండి యుదయించిన సీతయు మింటి నుండి, ఆ
వాపముగన్న రాఘవుఁడు వచ్చి ఋగద్వము లందునుండి ద్యా
వా పృథువుల్ సమాహరణభావము పొందిన రీతి" (బాలకాండ)

భూమ్యాకాశ వివాహమన్న మాటే కదా. (ఇది జానపద కథల్లో ఆకాశమంత పందిరి-భూదేవంత అరుగు—అన్నమాట).

ఆహూత రామపుష్కర దయాహత లక్షణ సీత కోటి ప
ర్షా హత సర్వసాగర సరస్సరి దానతభావ మందు చో
సేహ నిరీహమౌ ప్రథమ సృష్టి వికస్వర సూక్ష్మ దేవతా
దేహ సముజ్జ్వల ద్వరుణ దేవుని పోలిక రాముఁ డొప్పెడున్.
(బాలకాండ)

ఈ పద్యం ఆదిమ పౌరాణిక ప్రథమచ్ఛవి వివరణాత్మకం. స్త్రీ-భూమి, పురుషుడు-మేఘుడు (ఆకాశం) వరుణదేవుడు—వాని వర్షంతో పృథ్వి గర్భధారణం చేసి పులకరిస్తున్నది. (ఇందుకే మైథునం జాంతవం కాకుండాపోయి తాంత్రిక శిల్పమైపోయింది ఈ దేశంలో.)

కనుక ఇంద్రాహల్యలే రామసీతలు.

అంతయో యింతయో పద్యంలో నిక్షిప్తమైన కావ్యప్రతిమా రహస్యమిదీ. కావ్యమంతా బీజంగా అక్కడే గర్భితమైనది.

ఇంద్రుడు సహస్రయోని ముద్రిత శరీరుడై నప్పుడు కవి "వల కప్పుకొన్న జాలరివలె" వున్నాడన్నాడు. రావణుడు సీతను అపహరించిన ఘట్టంలో సీత రాముని పిలుస్తూ అన్నది. 'ఈ మహావన మధ్యంబున ధీవర శ్రేష్ఠుండవైన నీకెన్ని ధనువుల దూరమైపోయితిని' అని. ఈ ధీవరుడెవరు?[1] భగవంతుడు. సృష్టికర్త. మూలప్రకృతియన్న మహాసముద్రంలో జీవులన్న చేపలను గాలంవేసి పట్టుకుంటున్నాడని ప్రాచీన వాఙ్మయంలో పురాణ గాథాంశంగా వుంది. కనుక కవి అంతశ్చైతన్యంలో ఈ రెండు కథ లొకటిగానే అన్పించివుండాలి కదా

పై వచనంలో వనశబ్దం సముద్రాన్ని ఆకర్షించే శబ్దం. ఈ దృష్ట్యా ఆ శబ్దం బహురమణీయంగా వుంది.

ఆత్మ నిత్యమ్ము కాలాద్య వచ్ఛిన్నమ్ము
సచ్చిదానంద సంపచ్చయమ్ము
అద్వితీయమ్మేక మపరిణామ ప్రాప్త
మపరిమేయమ్ము అచ్ఛ తెలివి

అట్టి జ్ఞానముతోడ నైకకాలికముగా
నాది మునుల్ గలరు—

ఆత్మతో నాది మునులెట్టు లవని తోడ
నాదినృపులైక కాలికులై చరింత్రు

---

1. కల్పాంతే శమిత త్రివిక్రమ మహాకంకాళబద్ధ స్ఫురత్
శేష స్యూత నృసింహపాణి నఖరప్రోతాది కోలామిషః
విశ్వైకార్ణవతా విశేషముదితౌ తౌమత్స్య కూర్మావుభౌ
కర్షన్ ధీవరతాంగ తః స్నతు సతాం మోహం మహాభైరవః.

విశ్వవృక్ష బీజం— (పాదు) సముద్రం. మనస్తత్త్వ శాస్త్రంలో విశ్వేసుప్త చైతన్య సంకేతం. అక్కడ నుండి సర్వజీవులు వస్తూ-పోతున్నారు. ఆ జీవులే చేపలు. (ఇది జీవ సంకేతంగా ఆధునిక మనస్తత్త్వ శాస్త్రం—ప్రాచీన పురాణాలు చెప్పిందే) వాటిని సృష్టికర్త ధీవరుడైపడుతున్నాడు, అంటే అంతస్థిత జీవ మత్స్యాలను బహిర్గతం చేస్తున్నాడు.

ఆ నృపులయందు నిక్ష్వాకునంబు జాఫ్తు
మనుమతొప్పు వైవస్వతు మనువు కొడుకు.

యిది రామాయణ కల్పవృక్షారంభ పద్యం.

ఎవరో కాదన్నట్లుగా—ఆత్మ నిత్యమ్మ—అని ఎందుకారంభించినట్లు?

ఐరోపా సంస్కృతిలో 18-19 శతాబ్దాలు హేతు భౌతికవాద యుగాలుగా 20 వ శతాబ్ది దానికి విరుద్ధంగా విశ్వచైతన్యవాదం వచ్చిందన్నారు—నేటి పాశ్చాత్య విమర్శకులు. ఈ శకారంభంలో స్వామి వివేకానంద పాశ్చాత్య దేశాలకు వెళ్ళిన దగ్గరనుండి ఆత్మవాదం ప్రారంభమైనది.

విలియం జేమ్స్ 1930 నాటికి మతానుభవ వైవిధ్యం వ్రాసాడు. అంతకు ముందే యూంగ్ ఆత్మాన్వేషణలో ఆధునిక మానవుడు (1925) వ్రాసాడు. బక్ వంటివారు 1905 లో విశ్వచైతన్యం (Cosmic Conciousness) వంటి గ్రంథాలు వ్రాసారు.

మానవ జీవితమంతా ఆత్మ ధరించిన ప్రతీశీర్షకం Mask అనీ అదీ సర్వ విరుద్ధాంశ సమన్వయాత్మకమనీ—ఆధునిక శాస్త్రవేత్తల పరిశోధన. జాగ్రత్ చైతన్యం—సుప్తచైతన్యంతో విడిపోవటం నుండే న్యూరోసిస్-ఆధి-పుట్టిందనీ ప్రాచీన మత సంస్కృతిలో వాటి సమన్వయమున్నదనీ-కనుక మతం మనిషికొక వరమనీ—వారే చెప్పారు. (చూ. యూంగ్ రచనలు)

ఇందుకని ఆత్మ నిత్యమన్న మాటతో ఈ కావ్యం ప్రారంభం కావలసి వచ్చింది. అది చూచి వ్రాసారని కాదు.* ఈ యుగచైతన్యమిది-అనటం.

మునులాత్మతో — రాజులు — పృథ్వితో ఏకమౌతున్నారన్న మాట. ప్రాచీన రాచరిక వ్యవస్థను తాకుతున్నది—రాజు + పురోహిత = పదార్థ + ఆత్మ సమన్వయంకోసం ఏకమైన వ్యవస్థ నాటిది. క్షత్ర—నశించే పదార్థం కాగా ముని ఆత్మ—నశించని పదార్థం. రాజసూయమంటే క్షత్రియుని శరీరం నుండి రాజును కనటమట. ఈ క్రతు నిర్వాహకుడు పురోహితుడు. ఇందుచేతే మునులు పురుషులుగా—క్షత్రియుడుస్త్రీగా చెప్పిన కథలు భారతంలో వున్నాయి. ఇది ప్రతీకార్థం

---

* వివరాలకు చూ: ఎ. బి. పురాణి 'సావిత్రి' విమర్శ పీఠిక.

తప్ప వాచ్యార్థం కలదికాదు. అంటే భారతీయ దర్శనంలో - రాజనీతిలోను - భూమ్యాకాశాలు కలిసిన వ్యవస్థ చెప్పబడింది తప్ప విడిపోయిన స్థితిలేదు. (చూ. అరవిందుల జీవితం 'లైఫ్ డివైన్'లో ప్రథమాధ్యాయాలు) కనుక ముని+రాజు (వసిష్ట+రామ) సమన్వయం ఇతిహాస కథాత్మ వైరుధ్యం కాక సమన్వయమే మాటిమాటికీ చెప్పబడుతూ వచ్చింది. ఇదే స్త్రీ+పురుష దాంపత్యం. ఇందుకే ఇతిహాసం ప్రకృతి మానవ సమన్వయాత్మక కథా విషయంగా ముందు చెప్పబడటం జరిగింది.

కల్పవృక్షమంటే :

సచ్చిదానందముల్ స్కంధత్రయము గుత్తు
గానున్న యొక చెట్టుగాని చెట్టు
పంచభూతములను పంచశాఖలు సాగి
యైదు గుణంబుల నవఘళించి

ఒక మహాగాథ పెంచిన యొక్కడైన
చెట్టుగాని చెట్టు తనమ్మున జగి వెలుగున
కంజలించెద నేను నారాయణునకు
రామచంద్రునకును రఘురామునకును

అని అహల్య స్తుతిస్తున్నది.

ఆత్మావ్యత్యస్తమైన సృష్టిగా పరిణమించింది కనుక రెంటి నడుమ విరోధంలేదు. నాకూ—దృశ్యానికీ అభేదమే. ఈ ప్రతిపత్తి=ప్రతీతి=జ్ఞానమనీ అదే విశ్వచైతన్యమనీ పూర్వోక్తమే.

అదెంత ప్రాచీనమో అంత నవీన సత్యం. అంటే పురాణం.

# 11. భాగవతం

శ్రీ కృష్ణావతార ఘట్టంలోని ఈ శ్లోకాలు పరిశీలించదగ్గవి.

సత్వం త్రిలోక స్థితయే స్వమాయయా
బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః
సర్గాయ రక్తం రజసోప బృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే 10-13-20

ఇది వసుదేవస్తుతి. ఇందులో త్రిలోక స్థితి కల్పనకై జన్మలేని పరమాత్మ జన్మిస్తున్నాడనీ సత్వగుణంతో తెల్లనివాడై స్థితిని కల్పిస్తూ - రజోగుణంతో రక్త వర్ణుడై సృష్టిస్తూ - లయార్థం కృష్ణవర్ణం గ్రహిస్తున్నాడని చెప్పబడింది. ఎవరు గ్రహిస్తున్నది? వర్ణం లేని పరమాత్మ - అవర్ణుడు.

తర్వాత దేవకీదేవి స్తుతిస్తే కృష్ణుడన్నాడు - "తల్లీ! పూర్వం నీవు పృశ్నివి. వసుదేవుడు సుతపుడు. ప్రజాపతి ఆజ్ఞతో సృష్టి కోసం మీరు దీర్ఘకాలం తపస్సు చేస్తే నేను మీకు పృశ్ని గర్భునిగా జన్మించాను. ద్వితీయ జన్మలో మీరే అదితి - కశ్యపులు కాగా నేను వామనుడనై మీకు జన్మించాను. ఇప్పుడు మీకు కృష్ణుడనై పుట్టాను. నాకీ మూడే జన్మలు. మరి మనకిక జన్మలేదు.

మూడే జన్మలంటే మరి దశావతారాల కర్థమేమిటి? మొదటి శ్లోకంలో అవర్ణాత్మక సృష్టికార్యార్థం త్రిమూర్తులను ధరించినట్లు చెప్పబడ్డది. తర్వాత చెప్ప చెప్పబడ్డ అంశంలో మాతా పితృత్వం - స్త్రీ పురుషుల జంట - మూడు జన్మల్లో ముగ్గురు దంపతులుగా వస్తే ఒకే అజతత్త్వం మూడు సార్లు మూడు పేర్లతో పుట్టింది. నాల్గో జన్మ లేదు. అంటే?

పృశ్ని విషయం ఋగ్వేదంలో వస్తుంది. అదొక పలుమచ్చల రంగు రంగుల గోవట.

విశ్వానీ దేవాన్ హవామహే మరుతః సోమపీయతే
ఉగ్రాహి పృశ్నిమాతరం" ఋగ్వే 1.5 23-10

సిద్ధాంజన భాష్యంలో శ్రీ కపాలి శాస్త్రిగారు వ్రాస్తున్నారు. "ప్రాణశక్తి ఆవిర్భావ విలాసక్షేత్ర భూతా అంతర్నిహిత ధీవృత్తి రశ్మి ప్రసూః అదితి పదఖండాకారాంత రిక్ష స్థానా వివిధావిష్కార కలాప సంపన్నా సత్త్వ మయా శక్తిర్మాతా మరుతాం చిత్రవర్ణాగౌః పృశ్నిరుచ్యతే."

దీని రహస్యాన్ని వివరిస్తూ వారి శిష్యులు శ్రీ యం. పి. పండిట్ తమ అదితి అన్న గ్రంథంలో అదితి తత్త్వావిష్కారం చేస్తూ

మాతా రుద్రాణాం దుహితావసూనాం స్వసాదిత్యానాం
అమృతస్యనాభిః
ప్ర ను వోచం చికి తుషే జనాయ మా గాం అనాగా మదితిం
వధిష్ట (9-10 -15)

రుద్రుల తల్లి - వసువుల దుహిత - ఆదిత్యుల సహోదరి అమృతనాభి నిర్దోషమైన అదితిని వధించకండి. జ్ఞానవంతులైన మానవులను హెచ్చరిస్తున్నాను- అన్న ఈ జమదగ్ని ఋక్కును వ్యాఖ్యానిస్తూ అదితి అంటే (1) స్వర్గద్యు/దివో లోకం=మనస్సు (2) అంతరిక్షం=ప్రాణశక్తి (3) భౌమలోకం - శరీరం - ఈ త్రివిధ లోకాలను కని పాలించే మహాశక్తిగా వివరించారు.

"మరుత్తులు భావ ఆలోచనాశక్తులు. అవి దివ్యప్రజ్ఞా స్వరూపుడైన ఇంద్రుని కాంతుల్లో వెలుగుల్లో తడిసిపోయినట్టి ప్రాణశక్తులు. అవే నాడీశక్తులు—వారి తల్లి పలువన్నెల-మచ్చల గోవు-ఆమే శక్తి. ప్రాణశక్తి నావిర్భవింపజేసే మహాక్షేత్రం. ఆమె గర్భంలో పలువన్నెల భావ ఆలోచనా (Thought Powers) రశ్ములున్నాయి. అమె వీటితో అంతరిక్షాన్ని నింపుతున్న అదితియే. నానా విధ సృష్టిని పిదికే గోమాత" (P 28. Aditi)

(1) అదితి = దేవలోకమైన కాంతిమయ ప్రపంచాన్ని - బ్రహ్మాండంలో శరీరంలో యోగదర్శనం కల మనస్సును కన్నతల్లి.

(2) బ్రహ్మాండంలో అంతరిక్షాన్ని - శరీరంలో యోగోపాస్య మహాప్రాణ శక్తిని - కన్న పృశ్ని.

(3)భౌమజగత్తు - భౌతిక సత్తను-శరీరంలో 8వ దశలో పృథ్వీతత్త్వాన్ని కన్న-దేవకి ముగ్గురూ అదితి శక్తి యొక్క రూపాలే. కన్నది దివ్యాత్మతత్త్వాన్ని. "వసువులంటే పదార్థంలోని చైతన్యం. కనుకనే భౌమదశలో అదితి = భూమాత. ఆదిత్యులంటే ద్యులోక దేవతలు. యోగదర్శనంతో వెలిగే దివ్యప్రజ్ఞ (శరీరంలో) వారితో సహచరించే శక్తి అదితి.

ఆ విధంగా పై మంత్రం అదితి త్రివిధ దశలు - భూమికలను ధరించే సత్తా శక్తిగా స్తుతింపబడటం స్పష్టమే - అని పండిట్ వ్యాఖ్యానించారు.

భౌమదశలో భూదేవికి బదులుగా భాగవతం దేవకిని పెట్టింది, ఆమెకు 8వ సంతానం శ్రీకృష్ణుడు. వసువులు ఎనిమిది మంది. చివరివాడు భారతంలో భీష్ముడు, భాగవతంలో శ్రీకృష్ణుడు.

కనుక భాగవత కర్తకు ఈ వేదార్థ రహస్యం స్పష్టమన్న మాటే. అనేక మంత్రాల్లో గోవుగా కీర్తించబడ్డ విషయం - దాని రహస్యం పండిట్ గ్రంథం స్పష్టం చేస్తున్నది. ఇందుకే దేవకీనందనుడు నందనందనుడై (కాంతి-వెలుగు) పాలకుడై - పతియై భాగవత కథానాయకుడైనట్లు చిత్రించబడ్డాడు. ఆల[1]కావరి అన్నది కేవల భౌతికార్థం-జరిగిపోయిన కథ. నిత్య కథాదృష్టితో కాంతిని వెలుగు నందించే నాధుడు - దైవం.

ఇలా (భాగవతం) పురాణం వేద ప్రతీకార్థాన్ని కథగా చిత్రిస్తుంది.

---

1. ఆనంద కుమారస్వామిగారు Spiritual authority and Temporal power in the Indian Theory of Government పుట 46 లో యిలా వ్రాశారు.

"In Christianiny the shepherd is both king and priest. The Government and care of men preeminently sacerdotal function, but so far is the Royal function is delegated to a king, the later king also be called a shepherd of men, as in some of the Iddian Texts where the king too is a Gopa. We need hardly add that Krishna's epithet Govinda and that he is the "Devine Cowherd," do not mean that he was in any historical sense a herdsmen by caste but that he is a solar hero, and like Bodhisatva a descent of the Sun."

## వేదం

అత్రి కథ వేదంలోది. అత్రి = అ + త్రి = మూడు లేనిది. మూడు = త్రిగుణరూపిణి. ప్రకృతి = సృష్టి. ఊర్ధ్వ-భౌమ - అంతరిక్ష స్వరూపమై - దిశాత్మకమైనది. మనః + ప్రాణ + పదార్థ స్వరూపం విశ్వం = ప్రతి జీవి. ఇది వైయక్తిక దశ. అధి విశ్వదశ. ఈ వేదార్థాన్ని ఉపబృహించే = విస్తరించే, ప్రక్రియ పురాణం. సత్యాంశ కథగా చెప్పటం పురాణం పన్నిన వలకళ.

బ్రహ్మాజ్ఞానుసారం సృష్ట్యర్థం అత్రి తపస్సు చేస్తుండగా ఒక మహాకాంతి అతని నేత్రంలో ప్రవేశించిందట. ఆ కాంతి దేవతా మయం. ఆనంద మయం, అందులో నుండి ఆదిమదంపతులు శివపార్వతులు ఆవిర్భవించారు. ఆ శివునిలో అష్టమాంశగా చంద్రుడు జన్మించి దశదిశలా కాంతి కిరణాలతో ఆవరించాడు. ఈ దిశలు స్త్రీయై ఊర్ధ్వజలాలలోనుండి స్రవించే చంద్రతేజస్సుకు (బీజం) గర్భ ధారణం చేసి మోయలేకపోగా గర్భస్రావమైనది.

భృగు - అంగీరస - అత్రులు సోదరులు.

భృగు శీతజలాలు. అంగీరసుడు అగ్ని. వీరినుండి అత్రిజన్మ సృష్టి పూర్వమున్న - (ముక్తి దశానుభవ స్వరూపమైన) అవిభాజ్య స్థితి. ఏక స్థితి.

వాగ్వా అత్రిః వాచాహి అన్నం అద్యతే
అత్తిర్హ వైనామ తత్. యదత్రిరితి (శతపథం 14-5-22)

అత్రివాక్కు. ప్రారంభంలోని ఆద్యమాతృత్వం - సృష్టికారణ జలం; మూల పదార్థం. ఈ ప్రతీకావృష్ట్యా జలం గర్భధారణ యోగ్యం కావటం అత్రి తపస్సు. ఆ జలం కర్దమ - బురద - జలాలు. అంటే రజస్సహితాలు. ఆ రజస్సే స్త్రీ రజస్సు (శక్తి దశలో). ఆ తపస్సుచేత నీరు తేరుకొన్నది.

## తన్వాభర్తృత్రయం

సోమః ప్రథమో వివిదే, గంధర్వో వివిద ఉత్తరః
తృతీయో అగ్నిష్టేపతి స్తురీయస్తే మనుష్యజాః (ఋగ్వేదం 10-85-40)

ప్రథమ రజస్వలా రజస్తత్వం సోముడు - కన్యకు ప్రథమ భర్త. ద్వితీయుడు గంధర్వుడు. గంధ తత్త్వం. వికసిత పుష్పం - గంధావస్థ. ఫల పూర్వావస్థ. (వ్యక్తిదశలో దంపతి సంయోగంలో హృదయం దివ్యప్రణయార్ద్రం కాగా శరీరం నుండి వివిధ పరిమళాలు ప్రసవిస్తాయనటం బయోకెమిస్ట్రీ అంగీకరించిన సత్యమే.) తృతీయుడు అగ్ని=(వాక్కు) అంటే ప్రాణశక్తి. శబ్దమంటే ఆ కొస ఆకాశం. ఈ కొస పృధ్వి. ఈ రెంటికి మధ్య తత్త్వాలు 3.

అగ్ని - జలం - వాయువు.

ఉష్ణతత్త్వం - సోమతత్త్వం, గంధం (గంధర్వుడు)

ఈ తత్త్వాలు వికసించినపుడే కన్య మానవభర్త (నాల్గవవాడు) కు వివాహ యోగ్య. అత్రి నేత్రంలో ప్రవేశించిన దేవతామాయ ఆనంద తేజస్సంటే మనః ప్రాణ శరీర దశలు మూడు ఏకమై ఒకదానిలో ఒకటి లీనమైపోయిన దశలోని సృజనేచ్ఛ-కామస్పందమే, ఇదే తేజోరూపంలో అత్రి నేత్రంలోకి ప్రవేశించింది. ఇందుకే సృజనేచ్ఛకు ప్రతీకగా ఈ క్షణ కర్మ చెప్పింది వేదం.

(చూ. నా శ్రీ అరవింద ఈశాభాష్యాను వాదం.)

ఇప్పుడు భాగవత కథా, వైదిక అత్రి తపస్సును చూస్తే రెండు సృష్టి గాథా వ్యాఖ్యానాలే కదా. వేదార్థోప బృంహణమంటే ఇదే. పురాణ ప్రక్రియా వస్తు సూత్రం,

ప్రతి దాంపత్యమూ - అదితి కశ్యప రూపాదిమ తత్త్వప్రతీక. జన్మించే ప్రతి శిశువు నందనందనుని కిరణ లేశమే. సృష్టి ఆకాశ-అంతరిక్ష-భూమి జగద్రూపం. వ్యక్తిదశలో మనః-ప్రాణ-శరీరత్రయమే. ఇదే శ్రీకృష్ణుడన్న మూడు జన్మలు. మహాశక్తి నామరూపం లేని - దిశా ప్రమాణబద్ధం కాని అమేయవస్తువు నామరూప శరీరం ప్రమాణబద్ధం కావటం పేరే సృష్టి. ఇందుకే దంపతీ సంయోగం యజ్ఞంగా సంకీర్తితమైనది.

# శ్రీ కృష్ణ తత్త్వం

[1]అపశ్యం గోపామనిపద్యమాన మాచ పరాచ పథిభిశ్చరంతం
స సధ్రీచీః సవిషూచేర్వసాన ఆవరీవర్తి భువనేష్వంతః
(ఋగ్వే. 1.164.31)

"అవిరామంగా నిశ్చిత మార్గంలో నిత్యమూ ఇటు వస్తూ - అటు దూరంగా పోతూవున్న గోపతిని నేను దర్శించాను.

అతడు నిత్యం ఈ విశ్వాంతర్భాగంలో సంచరిస్తూనే ఉన్నాడు."

వేదంలో గోవిద్య. గోప(తి) విద్యలని రెండు సుప్రధితములై ఉన్నాయి. గోపతి రవి, అగ్ని, ఇంద్రుడు. ప్రాణం - ఈ నల్గురూ గోపాలకులట.

గౌ శబ్దం గత్యర్థకం, జగత్తన్నా కదిలేవనే అర్థం. కాబట్టి గోవంటే జగత్తే. ఈ చలన రూపమైన విశ్వాన్ని నియమిత కక్ష్యలో నడిపే ఇరుసు పేరు గోపతి. ఆ చక్రకేంద్ర బిందువు. అది నిశ్చలం-చలింపజేస్తుంది. అదే అమృతస్య నాభిః.

విశ్వమంతా రేఖాగణిత భాషలో ఒక మహావృత్తం. చక్రం నియమిత కక్ష్యలో పరిభ్రమించేదని అర్థం. కనుక గోవంటే ఇది. ఇరుసు గోపతి. దావి చలనకారణమైన నిశ్చల తత్త్వం. కనుక అమృతం. సత్యమూ నిత్యమూ. దాని ప్రతిరూపాలే పై నాల్గు పదార్థాలూ సూర్యాదులు. తదుదయంతో లోకం జాగృతమై కర్మ ప్రవర్తితమౌతున్నది. పదార్థంలో ప్రాణశక్తి అవతరించి స్పందిస్తే తప్ప చలనం లేదు. (ఇదెప్పుడు ఎలా జరిగిందో మనకు తెలియదంటాడు సర్ జేమ్సు జీమ్సు పదార్థ జగత్తులోకి ప్రాణ ప్రవేశ విషయం నేటికీ శాస్త్రవేత్తలకందని దూరానవున్న సత్యమనటానికదొక ఉదాహరణ.)

---

(1) నీల రుద్రోపనిషత్తు వంటి చోట్లకూడా సత్యరూపుడైన దైవాన్ని నిత్యమూ వస్తూ పోతున్నట్లు నీళ్ళు తెచ్చుకునే ఆడవారు - ఆబాలగోపాలం చూస్తున్నట్లు చెప్పబడటం చేత ఆనాటి మానవచైతన్యం బహుశా వరమ చైతన్యానికి సన్నిహితంగా వుండేదనుకోవాలి.

అగ్ని అగ్రపురందున్నవాడు. సృష్టివికాసంలో మొదటి మెట్టు, గో=శబ్దం. అది ప్రాణశక్తి రూపం. రూపరహిత భావం నుండి రూపసహిత భావమేర్పడుతున్నది. ఇది చెక్కే శిల్పి ఇంద్రుడు. (అతడు మధ్యమ ప్రాణమని వేదం) విశ్వం పదార్థ ప్రాణపిండం మొదటిది. పరిణామ శీలం. రెండవది కాదు. స్థితి గతులివే. రేయిం బవళ్ళవే. సృష్టి - ప్రళయాలివే. శుక్ల, కృష్ణ తత్త్వాలు. మార్గాలివే. బలరాముడు శుక్ల తత్త్వం (పగలు) శ్రీకృష్ణుడు కృష్ణతత్త్వం (చీకటి). ఇందుకే ఆస్వామి దేవీమూర్తిగా స్తుత్యుడౌతున్నాడు. (దేవికి కాలరాత్రి - ప్రళయరాత్రి అన్న నామాలున్నాయి. ఋగ్వేదంలో రాత్రి సూక్తముంది) కనుకనే భారత కథలో ఆతడు ప్రధానంగా ప్రళయ శక్తిగా చెప్పబడ్డాడు. (సృష్టి శక్తిగా పరీక్షిత్తుకు జన్మనను గ్రహించిన చోట మాత్రమే వచ్చింది)

As the Couherd (గోపతి) moves out with his Cows in the morning and he returns with them in the evening so does the trancendant prana incarnate in matter to create the way and then withdraws itself to create the night. Light and darkness corespond to the principle of Amrta and Mritya, both of which Agni and Indra—Aditya and prana havs accepted as the law of their energised and latest form

(Vision in Long Darkness—p. 114)

ఈ రాకపోకలు సమగతి కలవి తప్ప విషమ గతి కలవికావు. బలరామ కృష్ణ తత్త్వమిదే. (స్థితి-గతి; ప్రాణపదార్థ; దివానిశా; సృష్టి-లయ ప్రతీకలు) వీరి రాకపోకలే భాగవతంలోని వారి క్రీడా ప్రపంచ తాత్పర్యం. ఆ రాకపోకలు సృష్టి ఉన్మేష నిమేషాలు. అవి ఛందస్సుందరములు. కనుక సృష్టి నాట్యమని వేదమన్నది. ఛందముస్పందము. ఇవే రెంటి రెక్కలు. కలవాడు గరుత్మంతుడు. నారాయణుడన్న పరమశక్తికి వాహనం.

కృషి=వ్యక్త దశ. పగలు. 'ణచ్' స్థితి. అమృతం (తత్త్వం) రెంటినీ కలిపి కృష్ణ శబ్దం నిర్మాణమైనదని ఉద్యోగపర్వంలో వ్యాసుడన్నమాట. గతి+స్థితి=కృష్ణుడు. కనుక రాసక్రీడ అంటే విశ్వనాట్యం. ఛందోబద్ధమైన లయాన్విత

వృత్తభ్రమణం. కేంద్రబిందువు శ్రీకృష్ణుడు.[1] వృత్తాకారంలో గోపికలు - చక్రంలోనేమి. అతడు నాభి. పురుషోత్తముడు. (ప్రతి పురుషునిలోను సగం స్త్రీత్వం, ప్రతి స్త్రీలో సగం పుంసత్వముంది కనుక, అతడొక్కడే పురుషుడు కనుక.) బృహదారణ్యకంలో సృష్ట్యనంతరం దేవతలు ప్రజాపతి చుట్టు చేరి మా విభాగాలు మా కివ్వమన్నారట. (ఈ అన్న రూపసృష్టిని విభాగించి మాది మా కివ్వు) అంటే ఆయన అలాగే చేసాడట. దేవతలు చక్రనేమిగా - ప్రజాపతి కేంద్రంగా కూర్చుండి. ఇదే భాగవత పద్యంగా వచ్చింది.

"జలజాంతస్స్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న ప
త్రుల చందంబున కృష్ణునిందిరిగిరా - కూర్చుండి - వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ లతల్ తృణములున్ చిక్కంబులన్ బువ్వులా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా"

1. శాక్తేయ రహస్యోపాసన చక్రాకార మండలంలో యోగినీశక్తుల ప్రతిరూపాలు కన్యలు - స్త్రీలు - 64 మంది కూర్చొని వుండగా - మధ్యలో యోగ గురువుండి వారికి, దీక్షనివ్వటం - పంచ్చవోపాసనాదులు - రహస్యవిద్యగా ఉండేవి. ఈ సిద్ధాంత పృష్ఠాన్ని ఆలయాలు నిర్మించుకున్నారు. చుట్టు 64 యోగినీ శక్తులు సుందరమూర్తులు సర్వాలంకార శోభితలై నాట్యభంగిమా మూర్తులై ఉండగా - మధ్యలో మహాభైరవమూర్తి శిల్పించబడినది. ఇదంతా యోగవిద్యా (సంకేతం) శిల్పం.

అలాగే ఈ వైష్ణవ తత్త్వంలోని రాసమండలమున్నూ. రాజస్థాన్ చిత్రకళలో శ్రీ ఆనందకుమారస్వామి గారొక అద్భుతమైన మాట అన్నారు.

"Certain of the Krishna mysteries such as the Rasa Mandala may have a very remote ancestry; perhaps esoteric Vaishnava tradition remained more or less secret until in the Bhagavata Purana and the subsequent medival sanskrit and Hindu Literature of devotion it became the leading theme of the religious art. On the other hand there are also many elements of spring Festival character and perhaps Sexual magic. p. 29.

ఈ స్థితి గతి రూప క్రియాన్విత విశ్వభ్రమణం రాసనాట్యం. క్రీడ అంటే ప్రయోజనా కాంక్షలేని కర్మవిన్యాసం. ఆటలో దెబ్బదెబ్బ కాదన్నట్లు ఆ కర్మ వ్యక్తిగతం కాదు. ఆ గీతాకారుడన్నాడే

"ఏవం ప్రవర్తితం చక్రం య నాను వర్తయతీహ - యః అఘాయుః" ఈ విశ్వ చక్ర గతి ననుసరించనివాడు పాపి. మోఘాయువు. అనుసరించిన వాని దృష్టి రాసక్రీడ. కాని వానికి సుఖదుఃఖ మయం.

హల ధారి అంటే విశ్వకృషిని చేసినవాడు. సృష్టి కర్త. ఊషర క్షేత్రాన్ని దున్ని - నీరు పెట్టి పదును చేసి - విత్తులు చల్లి పెరిగేదాకా కాపాడే రైతు= గోపతి. కృషిసృష్టి విద్యాసంకేతం. (ఇందుకే కామక్రీడ కూడా కృషి సంకేతమే, క్షేత్ర బీజ శబ్దాలు రెండిట్లో వకటే,

విష్ణుచక్రమంటే కాలచక్రమే. దానికి 90° కోణాలు నాల్గున్నాయట, 360° దినాలే. ఇందుకే 'చతుర్భిః సాకం నవతించ నామభిశ్చక్రం న వృత్తం' కాల చక్రం దేశచక్ర భ్రమణ కారణం. ప్రతిదీ పక్వమౌతుంది కనుక పరిణామం పొందుతుంది. దీని హేతువు చక్రం. ఈ భ్రమణమే వృత్తాకార నాట్యం. ఛందం, వేణునాదం నాట్యగతిలో అంతర్లయంగా విన్పించే దివ్య గాంధర్వం. కనుక సృష్టి క్రీడను 'నర్తన' మన్నది వేదం. విశ్వాంతరాళంలోని గోళాల నియతచలనం— అణుగర్భంలో నియమితచలనం—బాహ్యాంభ్యంతరోదాహరణలు. భక్తి యోగ దృష్ట్యా వేణువంటే నిరహంకార[1] చిత్తస్థితి. కుండలినీ యోగదృష్ట్యా వెన్నుపాము. కుండలినీ ప్రసరణంతో మధుర సంగీతం జనిస్తుందని ఆ శాస్త్రం.

---

1. ఒక ఆచార్యుడు జపాను జన్ యోగిని దర్శించి ప్రశ్నల వర్షం కురిపించాడట. అంతా మౌనంగా విని ఆ మహాత్ముడన్నాడట. 'నాయనా ప్రశ్నలతో అలసి నా కోసం దూరం నుండి వచ్చావు. నేను టీ చేసిస్తానుండమని కప్పు-సాసరిచ్చి అతడు పట్టుకోగా—పోస్తున్నాడట. కప్పు నిండింది. సాసరు నిండింది, పొర్లి పోతుండగా ఆచార్యు డన్నాడట 'స్వామీ—నిండిపోయింది, కన్పించటం లేదా' అని. యోగి నవ్వి 'కన్పిస్తున్నది' నీకు బోధించటం కోసం చేసానీపని. నిండిన కప్పులో టీ పట్టనట్లు అంతగా ప్రశ్నమయ దురహంకారచిత్తంలో నేనేమీ పోయలేను. నా దగ్గరకు వస్తే దాన్ని ఖాళీచేసుకుని రమ్మన్నాడట. అశూన్య మనస్కత వేణువు=నిరహంకారభూమనస్కత=అభూమనస్కస్థితిల్లో విన్పించే నాదం,

కాళింది మడుగు[1] మూలాధారం. సహస్రారమే పాలసంద్రం. విష్ణుని శయన స్థానం. ఆదిశేషుడంటే కుండలినే. నెమలి పింఛమంటే సప్తవర్ణమయ సుందర జగత్తు సృష్టిని. సవర్ణమనీ—తత్త్వాన్ని అవర్ణమనీ వేదం చెప్పిన మాటే.

1. వేణునాదం.

Krishna's flute...... is the voice of eternity heard by the dwellers in time. ఒక చిత్రాన్ని వ్యాఖ్యానిస్తూ ఆనంద కుమార స్వామి గో గీతాన్ని ఉదాహరించాడు.

"సునతి హో కహా భజి జావూం ఘరేం
(చెలీ! నీవు ఇంటికెందుకు పోతున్నావు?)
ఫస్ జాయెగీ మైన కే వానన భీం
(నీవు కామబాణ భిన్నవై పోతావు)

కబీరన్నాడట (అదే పుస్తకం పేజి. 32 అధోజ్ఞాపిక) అతని గీతంతో విదారితమైన హృదయమే జాగృతమౌతున్నదని.

# 12. గోవు

సూయవసాచ్ భగవతీ హి భూయా
అధోవయం భగవంత స్స్యామ
అద్ధి తృణం అఘ్నెన విశ్వదానం
పిబ శుద్ధం ఉదకం ఆచరంతీ (ఋగ్వేదం)

"పచ్చిక బైలులోని ఈ గోవు ఆరాధింపదగినది,
అమెవల్ల మేము ఐశ్వర్యవంతులమౌతాము,
ఓ అమృతమూర్తీ! గోమాతా! ఈ తృణమాస్వాదించు,
శాశ్వతకాలంలో పరిశుద్ధ జలాస్వాదనం చేయి"

The Doctrine of Cow (గో విద్య) scintallates with many meanings in Rig-Veda. The Cow-Calf-milk, Butter, her movement, her fodder, postures for grazing the Cow Pen (గోస్థానం = వ్రజం) all these are frequently mentioned as elements of an elaborate symbolism, having a definite place and significance in building up the cosmogonical thought.

(Vision in Long Darkness)—p. 95)

(అఘ్న్య = చావులేని ఆవు. విశ్వదానీం = నిత్య దేశకాలాలు) కనుక గోవిద్య ప్రతీక తప్ప వాచకం కాదు.

జగన్మాత–జగత్తు–స్త్రీ గత మాతృత్వం – వ్యక్తావ్యక్త ప్రకృతి తత్త్వం– వీటన్నిటికీ గోవు ప్రతీక. ఆమె మూడ ప్రాణసూత్రం. దీనికి మూర్తి సూర్యుడు నారాయణుడు, నామరూపాత్మక జగద్బీజం. వ్యక్తి జన్మకు బీజం. ఈ రెండు వెన్నకర్థాలు. భక్తి మత సృష్ట్యా ప్రేమమయ చిత్తవృత్తి. వ్యక్త మవ్యక్త ప్రకృతి జన్యం కాబట్టి అది పాలు. ఇది తల్లి. ఇందుకే గోవును అదితి, విశ్వరూప–విశ్వధాయ. విరాజ–వసుపత్ని–మాయా–ఋత ప్రథమజా–జనిత్రీ అనేక నామాలతో నోరార పిలుస్తుంది–వర్ణిస్తుంది–కీర్తిస్తుంది వేదం. ఇవన్నీ సార్థకాలే. ఆమె పొదుగులోని నాల్గు చన్నులనుండీ కార్తేపాలు నల్గురి శాఘాంశవట. ఋషులకు

(మనస్తత్వ సూత్రం) ఒక చన్ను. రెండవది దేవతలకట (ప్రాణసూత్రం) మరొకటి పితృదేవతలకు (వ్యక్త పదార్థ సృష్టి సూత్రం-పృథ్వీ సూత్రం) నాల్గవది ఆ ముగ్గురూ కలిసి తయారైన జీవునికట. ఈ నాల్గు పాదాల్లోనూ గోవే తల్లి. ఇందుకే ఆమె సుదుఘ: పాలు పిండుకోవటం బహు తేలిక. తన్నకుండా పాలిచ్చేది. కనుక జీవుని మనః ప్రాణ శరీర పోషణకు ఆమె పాలే ఆహారం. పృథు చక్రవర్తి కథలో భూదేవి గోవై పాలు పితికించిన్న కథా సూత్రమిదే. పాలంటే విశ్వంలో ప్రతి పదార్థము. భాగవతంలో గోపాలుని గోవు కథ ఇదే.

మనః ప్రాణాలు పదార్థాను ప్రవేశం పొందటతోనే కదలిక మొదలైనది. ఇదే అనుప్రవేశ విద్య. స్థితినుండి గతికీ - దీనినుండి దానికి పోతున్న నిత్య చలనమే బలరామకృష్ణులు గోవులను తోలుకొని ఉదయకాలాన అడవికి పోవటం - సాయం సంధ్యలో తిరిగి రావటం-కథ జగదున్మేష నిమేషాల ప్రతీక. గోస్థానం= అంటే జీవాశ్రయమైన లోకము=ఆనంద సమావృతమైన హృదయము.

సాచిత్త భిః నిహా చకార మర్త్యం విద్యుత్
భవంతీ ప్రతివ అపౌహత్ (ఋగ్వేదం)

"ఆ గోవు మనశ్శక్తితో మరణశీలుడైన జీవుని సృజించింది. విద్యుత్తుగా మెరసి ఆమె తెర తీసింది."

మెరుపు వెలుగు, సృష్టికీ-వ్యష్టి ప్రతీక. బృందావనంలో గోవర్ధన కథ కిదే బీజం. వేదంలో గుహ అంటే అద్వైతం ప్రకారం హృదయం. సృష్టి విద్య ప్రకారం అవ్యక్తం గోవులు పర్వతం క్రింద దాగటం (గోవర్ధనం) బహిర్గమించటం సృష్టి. పర్వతం స్థితికి ప్రతీక (పూర్వోక్తమే). రెంటికీ కర్తగోపతి

పచ్చిక బయలంటే దేశం (Space) నీరంటే ప్రాణం. కేనోపనిషత్తులో తృణం విశ్వసంకేతంగా చెప్పబడింది. (కఠంలో వృక్షం. గీతలో రావి) కఠంలో జీవుని రాకపోకలు సస్యంలాగా పండటం - ఎండటం లాగా సంకేతించబడ్డాయి. మొక్క-గింజలను రాల్చి ఎండిపోవటం-మరలా బీజం మొలకెత్తటం-అంతమైన దృశ్యం. ఇదే విశ్వం. కనుక చరాచర జగత్తు గోవు. దృశ్యమానమైనదంతా గోమయమే.

పరా-పశ్యంతీ-మధ్యమా-వైఖరీ వాక్చాతుష్టయం. గోవు చనులు-పాదాలు-చతుర్విధ పురుషార్థాలకు సంకేతమే. ఇందుకే ధర్మం నాలుగు పాదాల నడిచింది కృతమనీ-మూడు కలది త్రేత. ద్వాపరం - ఏకం కలిగా చెప్పబడినదీ సర్వ విదితమే. కనుక గోపథమంటే సమగతి, వ్యక్తావ్యక్త సమన్వయమే సమగతి. నాల్గు పురుషార్థాల సమగతి. నాల్గువాక్కుల సమష్టిగతి.

ఇదంతా గోవిద్య. కనుకనే ఆ గోపతి కథ రాలలో-రంగుల్లో-పాటలో-ఆటలో-పద్యంలో-విద్యల్లో (శాస్త్రం) మతంలో-యోగంలో సర్వకళా శాస్త్ర ప్రక్రియల్లో తాండవించిన మహామధుర సౌందర్యం-సత్యం.

ఉదాహరణకు గోధూళివేళ మనకు చాలా పవిత్రం. దీనిని కవులెంతగా కీర్తించారని! చిత్రకారులెంత అద్భుతంగా చిత్రించారని! రాజస్థాన్ చిత్రకళలో ఈ బొమ్మ అద్భుతంగా చిత్రించబడింది. దాన్ని వ్యాఖ్యానిస్తూ జగద్విఖ్యాత సహృదయ చక్రవర్తి ఆనందకుమారస్వామి.

"The group of Cows reminds us of a description in the Prema Sagara[1], when it is related that the herds men called to the Cows, 'black, white gray, purple, brown and blue', and then ran up lowring and snoring; at that time there was such beauty as it clowds of many hues had been gathered together Gopies who have been to the Ghat, to fill their water jars and others crowding the balcony windows; fix their eyes on Krishna who walks behind the Cows in yellow dhoti and Peacock Crown, playing his flute. He is sorrounbed by other lads; some playing the instruments of music. The cows are streaming through the inner garth, in the upper part of which we see Nandaji seated with othe elders in a bārādari, engaged in talk .

In this way cowdust represents an idea rather then event; the idea is that of Krishna's daily life in the

1. హిందీ భాగవతానువాదం.

little town of Gokula. He is the Devine herds man, an unknown. though beloved. God in the midst of men''.

—Rajput Paintings—p. 30.

గోధూళి ధూసరిత కోమల గోపవేషం
గోపాల బాలక శతైరను గమ్యమానం
సాయంతనే ప్రతి గృహం పశుబంధ నార్థం
గచ్ఛంత మచ్యుత శిశుం ప్రణతోస్మి నిత్యం

# 13. జానపద కవిత - ప్రతీకాత్మకత

"ప్రజాపతిశ్చరతి గర్భే అంతః అజాయామానో బహుధా విజాయతే
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్" (పురుషసూక్తం)

(గర్భాంతంలో ప్రజాపతి స్పందిస్తున్నాడు. జన్మించని వాడయ్యూ అనేక రీతుల్లో చక్కగా జన్మిస్తున్నాడు. అతని జన్మరహస్యం పండితులకే తెలుస్తుంది.)

ఇక్కడ ప్రజాపతి సర్వజీవ సమూహాల మూర్తి. ప్రథమచ్ఛందం (Arche type). అదొక ప్రతీక. అదొక అవిజ్ఞేయ భావసంకేతం ఆ ప్రతీక మూల ద్రవ్యం. దానినుండి అనేక కళాభేదాలుత్పన్నమౌతున్నాయి. అందులో మూల భేదాలు రెండు. 1. మార్గ, 2. దేశి, ఇవి అన్ని కళల్లోనూ వున్నవే.

నిజానికివి రీతి-శైలీ-భేదాలు తప్ప జాతి స్వభావ భేదాలు కావు. జాతి అంటే విశేషం (particular, individual; కాక సామాన్యం (general) ఇది విశ్వజనీనం (Universal). విశ్వజనీనాంశ కళలో ప్రతీక.

మార్గ—మృగ ధాతుజన్యం. అన్వేషణ దాని పరమార్థం. దేన్ని అన్వేషించటం అంటే, పరమార్థాన్నే.

"In the Rgveda it is familiar that one hunts and traps by its spoor is always the duty, the hidden light the occulted Sun or Agni, who must be found and is sometimes referred to as lurking in his law—In the Rgveda (8-2-6) men are said to Pursue (మృగయంతే) Indra as one Pursue a wild beast with offerings of milk and kine In Rg 10-4-62 the Bhrugus eager, supers after Agni, tracking him by his spoor (Padaih) Marga is then the creatures 'run away' the track to be followed."

The Cristian & Oriental philosophy of Art, p. 1:3.

దేశి-దేశావారాదులు: ఇది లేకుండా కళే లేదు. కాబట్టి మార్గ-దేశిభేదం జాతితః లేదు.

ఎక్కడ భావం ప్రజ్ఞామార్గంలో వ్యక్తమౌతుందో అది మార్గం. ఎక్కడ భావం అంటే ప్రతీక - ప్రజ్ఞావిరహితంగా దానంతటది వ్యక్తమవుతుందో ఆ సహజ జానపద కవిత. ఇది జాతీయ సంపద తప్ప వైయక్తిక సృష్టి కాదు. జాతి ఏకవ్యక్తిగా జీవించిన నాటి సాహిత్య కళా సంపదంతా జానపదమే. అది ప్రతీకాత్మకం. ఈ దృష్టితో భేదం లేదు. ఇందుకే భాగవత-హరివంశంలో బృందావనం. కృష్ణుడు-గోపి-గోపకుల కథ జానపదమే. రెంటి వ్యక్తీకరణలో భేదం అంటే-రామాయణ మహాభారత కథల్లోని మూలద్రవ్యం ఇలియట్ "వేస్టు ల్యాండు" లోని ఆధార కథ, ప్రతీకాత్మక జానపద పౌరాణికాంశమే దీనిమీద కావ్యధర్మారోపణ జరిగింది. కాబట్టి రెంటికీ అభేదమే.[1] జనపదమంటే[2] వైయక్తిక భేదం లేకుండా జనులంతా ఏకవ్యక్తిగా వ్యవహరించే సంఘం. దాని స్థానం. చారిత్రకంగా ఇది బహు ప్రాచీనం. మానసికంగా సర్వమానవులతో కవి, వ్యక్తి అభేదాన్ని పొందటం. ఈ మనస్తత్త్వసృష్ట్యా మార్గదేశి భేదం లేదు. అది శైలీ భేదమే.

నటరాజ విగ్రహం, మార్గదేశీ భేదాల్లో కొలవలేం. ఎందుకని? ఇదొక జాతి గత భావనామూర్తి. జానపద కవిత్వమూ జాతీయమే తప్ప వైయక్తికం కాదు. ఈ సంఘం సంప్రదాయ ఆస్తిక సంఘం. నాస్తిక వైయక్తిక సంఘంలో కళ వైయక్తిక ప్రజ్ఞాజన్యం. ఇది ఆధునిక కళ. ఇందుకే ఇక్కడి ప్రతీకలు సార్వజనీనం కాలేకపోగా నటరాజ శివలింగాది ప్రతీకలు సర్వ హృదయావేదనాహ్లాద కారకాలౌతున్నాయి. ఇక్కడ పండిత పామర భేదం లేదు. కృష్ణునందరకూ

---

1. In its origin Greek Art of the classical period is essentially the same as paleolithic and Brahman Art (ఇది క్రీ.పూ. 20,000 నాటిది) It deffers from its primitive relations only in the degree of its organisation.
(The meaning of Art. p. 59.)

2. The condition of society in which a truely national and popular poetry appears—(is one) in which the people are not divided by political organisations and book culture into market distinct classes —Prof. Child.
(ఆనందకుమారస్వామిగారు పై గ్రంథంలో ఉదహరించింది)

సుందరుడే. సంప్రదాయాత్మక ప్రాచీన సంఘంలో వ్యక్తి భావనకు ప్రాధాన్యం లేదుకా బట్టి ఆ సంఘంలో పుట్టిన కళ ఒకటే ఇందుకే

The attempt to distinguish aristocratic from popular motits in traditional literature is fellacious, all traditional art in folk art in the sense that is the art of a unanimous people (Jana) అని ఆనంద కుమారస్వామిగారు, అలాగే "In Gothic and oriental art — represent a fusion of the Geometrical and Organic Principles అని రీడ్ మహాశయుడు (Meaning of Art లో) అన్నారు. (ఇక్కడ Organic folk, Geometrical = మార్గభేదాలు.

కాబట్టి ఇవి రీతి భేదాలు. జాతి భేదాలు కావు. ఈ జాతికి దేశకాలబద్ధమైనది కాదు. ఆర్యద్రావిడ జాతికాదు. జాతి అంటే ప్రతీక; భావం. Motiff లేక Pattern,

కాబట్టి రెంటికీ మూలం ప్రతీక. ఇది ప్రాచీనం: '(primitive) కోల దృష్ట్యా. మనో దృష్ట్యా సుషుప్తచేతన (unconcious) అక్కడ ప్రజాపతి సర్వ ప్రతీకలకూ ప్రతీక. అలాగే కవితా ప్రతీకలు కూడా అనేక రకాలుగా బహిర్గతాలౌతాయి.

"The very conception of 'folk-lore' as commonly understood rests on a fundamentally false hypothesis, the supposition viz that there really are such things as popular creations or spontanious inventions of the masses and the connection of their point of view with the democratic prejudice is obvios. The folk has thus preserved without understanding the remains of old traditions that go back some times to an indeterminably distant part, of which we can only refer as prehistoric"

M Rani Guenon మాటలుగా ఆనందకుమారస్వామి పై గ్రంథంలో ఉదాహరించారు. దీన్ని బట్టి ప్రతీక అతి ప్రాచీనం. భౌతిక వ్యక్తి-కర్త-కర్తృకం కానిది: మొహంజాదాలో నాణాల మీదున్న ఎద్దు, ఈజిప్టు రాజుల రాజచిహ్నమైన

ఎద్దు, 20,000 సంవత్సరం క్రిందటి గుహాచిత్రాల్లో (The la Greze Bison) ఎద్దు విశ్వజన ప్రతీక—సంకేతం.

ఒక్క సింద్రెల్లా కథ 345 రకాలులు భిన్నదేశాల్లో వ్యక్తమైనదని ఆండ్రూ లాంగ్ నిరూపించాడు, (చూ. కుమారస్వామిపై-గ్రంథం పు. 143) దీనిక్కారణం దేశ సంస్కృతీ వినిమయమం భౌతిక-చారిత్రక దృష్ట్యా కావటంకాదు. అది అంతర తత్త్వ సామాన్యత. అదే అన్ని దేశాల్లోనూ అన్ని భాషాపరిధుల్లోనూ ఆ ఏకైక తత్త్వమే భిన్నంగా శైలీ భేదాలతో అభివ్యక్తమౌతున్నదనటం పున స్తత్త్వ శాస్త్రం-అజాయమానో బహుధా విజాయతే

అంటే కవి మనస్సు ప్రధానంగా ప్రతీకాత్మకం. వాడు నాటికీ, నేటికీ ఇంతే.

ప్రతీక-చిహ్నం వేర్వేరు.

Symbolic expression is the best possible formula by which allusious may be made to a relatively unknown thing-which is nevertheless recognised or postulated as existing.

A sign is an analogous or abbrevated expression for a definitely knownthing—అని Jung నిర్వచనంగా కుమార స్వామిగారు Transformation of Nature in Art లో ఉదాహరించారు.

కృష్ణుని శ్యామలవర్ణం - అనంతత్త్వ అవిజ్ఞేయకా ప్రతీక. అది ఆటవిక జనుల రంగుగా గ్రహించి ఆయన వాళ్ళ దేవుడనటం. ప్రతీకను చిహ్నంగా గ్రహించిన భౌతిక హేతువాద విలసనం తప్ప, సత్యం కాదు. ప్రతీక సత్య సంకేతం తప్ప అసత్య కాల్పనిక సౌందర్యం కాదు.

If we take the sign for a symbol[1] we shall be sentimentalising our notions-and if we take the symbol for a sign we are led 'thought' to recognition''
అని కుమారస్వామిగారి నిర్ధారణ.

---

1. Symbol అర్థం.

Sinn = meaning. Sense attributed to conciousness.
Build = image. Picture attributed to unconciousness or = irrational realm.

ఈ భ్రమ వ్రడటానికి చోటుంది. దీనికొక వుదాహరణ. రత్నభల్లాణు డన్న రాజు కొడుకు వీరభద్రుడు. (చూ. మాతపురాణం) యోనిజుడు కావటానికిష్టం లేక గుమ్మడిపండులో నుండి పుట్టినట్లుంది. ఈ గుమ్మడిపండు ఒక దృష్ట్యా ప్రతీక, మరొక దృష్ట్యా చిహ్నం.

గుమ్మడి తోట, జెల్లు తోట ఒకటే. ఇది కుమారస్వామి కథలోనిది. జెల్లు తోటకు సంస్కృతనామం కాశవనం. కాశమూ ఆకాశము వొకటే. అనంతత్వానికి అది ప్రతీక. ఇందుకే ఉపనిషత్తుల్లో ఆకాశంనుండి జీవసృష్టి జరిగిందని చెప్పబడగా బ్రహ్మసూత్రకారుడు ఆకాశమంటే "పరబ్రహ్మ పదార్థ"మని స్పష్టం చేశాడు.

సువర్ణకాశవనానికి బంగారు రంగులోవున్న గుమ్మడిపండ్ల తోట తన అనుభవంలో ఉన్నదాన్ని తెలుగు జానపద కవి తీసుకున్నాడు. ఇక్కడ గుమ్మడి తోట చిహ్నం కానీ దాన్ని కుమారస్వామి కథ దాకా, వేదం దాకా తీసుకొనిపోతే కాశవనమౌతుంది.

అలాగే గుమ్మడిపండు సువర్ణాండమే. ఇది వేదంలో సృష్టి విద్యలో విషయం. అక్కడ బంగారుగ్రుడ్డు సృష్టి జన్మస్థానం. ఇక్కడ గుమ్మడిపండు, ఇది తాను చూచిన వస్తువు. దీన్ని ఆ సువర్ణాండానికి చిహ్నంగా ప్రతిగా జానపద కవి భావించాడు. ఆ సువర్ణాండం సృష్టి విలీనావస్థకు ప్రతీక. సృష్టి గర్భానికది సంకేతం. ఆ గుమ్మడి పండే మళ్ళా శిశువు కుపమానం. ఇది మరీ అలంకారికం.

కాబట్టి ప్రతీక-చిహ్నం-అలంకారం-ఇలా నడుస వుంది. అలంకారం వర్ణ నాత్మకం. చిహ్నం సూచనాత్మకం. ప్రతీక భావసంకేతాత్మకం. ఆ భావం మానవ మేధాపరిధి కతీతం. చిహ్నం-అలంకారం-మనోభావ జన్యాలు.

ప్రతీకల్లో కొన్ని జాతులు (Patterns or motiffs ఉంటాయి. రెండు మూడు జాతులు వివరింపబడుతున్నాయి. కొన్ని కథల్లో ప్రతీకలు ప్రతీకలుగా కనిపించనంతదూరం వచ్చినందువల్ల దేశకాలాల కవి మామూలు విషయాలని పించేవిగా భ్రమింపజేసాయి.

---

2. ఈ వ్యాసోదాహృతి జానపద కథలు శ్రీమతి నాయని కృష్ణకుమారిగారి జానపద గేయ గాథలు అన్న గ్రంథం నుండి గ్రహింపబడ్డవి.

బాలనాగమ్మ కథ-తత్తుల్యమైన కన్నడ కథ నాగరగన్నె కథలో ఏడుగురు రాజులున్నారు. ఆ ఏడుచేపల కథలోనూ ఏడుగురు రాజకుమారులు లేకపోతే ఆర్గురు అక్కలు తరువాత ఒకే తమ్ముడు ఇలా సప్త సంఖ్య ఉంది.

అస్య అత్ర అపశ్యం విశ్పతిం సప్త పుత్రమ్ ఋగ్వే 1-164-1. ఇది అగ్ని దేవతాక మంత్రం. విశ్పతి అంటే సర్వ మనుష్యులకూ పతి. అతడగ్ని. Agni is called **Sapta Putra** 'Father of seven suns' working through the agency of numbers, the vedic thinkers chattered the vide world of symbolism into triads, tetrads, pentads and heptads. The diversification of one in to seven is essential for creation.

ఇదే సప్తర్షులు - లోకాలూ - ప్రాణాలూ. ఇలా చెప్పబడింది. కాబట్టి 'సప్త' ఏకైక బీజం. సృష్టిగా మారటానికి ప్రతీక. ఇదే ప్రాణశక్తి - మూల పదార్థం. ప్రకృతి. పంచభూతాలు—ఇదే సప్త సముద్రాలూ - మరుత్తులూ - స్కంధాలూ - సప్త సింధువులు - గోవులనబడ్డవి.

ఇదొక జాతి. అంటే Pattern లేక నమూనా లేక motif. మరొక కథ-ఏకైక బీజం విస్తరించిన సృష్టి కథ. ఇది గోండుల కథ. 'మేరు పర్వతంమీద దేవతలంతా సమావేశమైనారు. 'వాపి నిరంజన్ పెన్' అన్న పురుషదేవత నేనే సర్వాధికుడనుకున్నాడు. 'వాసి నిరంజన్ పెన్' అన్న స్త్రీ దేవత నేనే నన్నది. వారి దృష్టులు కలిస్తే ఆమె గర్భవతి అయినది. ఆమెకొక కూతురు జన్మించింది, 9 ఘడియల్లో. దానిపేరు 'కాలికంకలి'. అది నీరు తేవటానికేటికి వెళ్ళి 'ఋషి శరత్' అన్నవాడు దంతధావనం చేసుకొని పారవేసిన ఆకు, నీటిలో కొట్టుకొని వచ్చిన దాన్ని నమలి తిన్నందువల్ల గర్భం ధరించింది. ఆమె 12 కళ్ళాల గోండు దేవతల్ని, 32 కళ్ళాల మరాటా దేవతల్ని కన్నదట!

ఈ గోండు జాతి వంశపురుషుడు, "పెహంది లింగాల్" మొహామి అన్న పురాతన గరుడపక్షి గ్రుడ్డు పెడితే అందులోనుండి పీడూ - పాండురాజూ పుట్టాడట.

ఇలాగే సవరల కథలో వారి దేవతలు ఏమ్మ-భిమ్మలకొక కోడి ఉంటుంది. అది గ్రుడ్డు పెడితే, అది పగిలి దాని సొన భూమిగా మారింది. ఒక సొరకాయ నీటిలో తేలుతూ వచ్చి పగిలితే ఆ రెండు చెక్కలూ ఒకటి భూమీ ఒకటి ఆకాశమూ

ఐనదట. ఆ ఋర్రలోనుండి స్త్రీ పురుషులు వచ్చారు. ఫ్వారాద్ది దంపతులు. వీటిల్లో సంకేతాలు.

1. పక్షి - గరుత్మంతుడు. కోడి - రెండూ వకటే.

2. సొరకాయ - దాని డిప్పలు. భూమ్యాకాశాలు సొరకాయ లోపలినుండి (పదార్థం నుండి) స్త్రీ పురుషులు రావటం. గుడ్డు దాని సొన భూమి కావటం.

3. 9 ఘడియల్లో 77 మంది దేవతల్ని కనటం. దానికి హేతువు శరదృషి వదలిన ఆశ. దీనికి ముందు పాపి - నిరాయన్న దేవతలు చూచుకోవటం. ఆ చూపునుండి 'కాలి-కంకలి' పుట్టటం. వీని విషయం వేదంలో విస్తృతంగా ఉంది.

గరుత్మంతుడు - సుపర్ణుడు - ప్రాణసకలజీవ సమాహారభూత ప్రజాప్రతి, సూర్యులకు ప్రతీక.

> ద్వాసుపర్ణా సయుజా సఖాయా - సమానవృక్షం పరిష స్వజాతే
> తయోరన్యః పిప్పలం స్వాదత్తి అనశ్నన్న న్యోరభి చాకశీతి
>
> ఋగ్వే. 1-164-20

అన్న సుపర్ణ విద్యకాకరం.

ఇక్కడ రెండు పక్షులు పరమాత్మ - జీవాత్మ పరంగా వ్యాఖ్యానించటం ప్రసిద్ధమే. ఇందులో చెట్టు విశ్వం - అశ్వత్థం.

కొన్ని జానపద కథల్లో (బాలనాగమ్మ వంటివి) ప్రాణ స్థాన వర్ణనముంది. మరాటీ ప్రాణం చిలుకలో ఉండటం, అదొక చెట్టు తొర్రలో - ఆ చెట్టు సప్త సముద్రాలవతల ఉన్నట్టు - చెప్పిన విషయం. ఈ సుపర్ణ విద్యా విషయమే అక్కడ చెట్టే ఇక్కడి అశ్వత్థం. చిలక ఎగిరిపోయిందన్న నానుడిలో చిలక = ప్రాణం. అది స్థానం తెలియరానిది కాబట్టి, పక్షి అనటం. దాని నడక ఎగరటం తప్ప నడక కాదు కాబట్టి, పక్షి - నడచిన జాడ తెలియరానిది. అది అందమైనది కాబట్టి సుపర్ణాలు, సువర్ణవర్ణమూ - రంగుల చిలకా. "వామస్యవేః" = అందమైన పక్షి (ఋగ్వే).

సప్త సముద్రాలంటే — "The inferior, the physical, the vital and mental four superior the devine truth, the devine bliss and devine will and consciousness and the devine being (Aurodindo)

సౌరకాయ కోడిగ్రుడ్డు – హిరణ్మయాండం. హిరణ్మమంటే రేతస్సు. అప కుమారుడు కాగా, వాడిపేరు హిరణ్యగర్భుడు. వీడి జన్మస్థానం అండం. అదీ నీళ్ళలో తేలినట్లు చెప్పబడింది. ఆ నీరు మూల ప్రకృతి జలాలు. అది మాతృదేవత. అదే మహా మానిగా మూల ప్రకృతిగా చెప్పబడింది. ప్రజాపతి-తండ్రి. జలము-ప్రకృతి, తల్లి. ఇదే విషయం పైకథల్లో పాపి-నిరాలు చెప్పబడింది. ఆ అండం డిప్పలు భూమ్యాకాశాలు కావటం సృష్టి ఏర్పడటానికి సంకేతం. పంచభూత సృష్టి ఏర్పడటం – అది దిశావిభాగంచేత జనించింది. ఆ దిశలు రెండు 1. భూమి-క్రింద; 2. ఆకాశం-పైన.

'ద్యౌః మే పితా – జనితా నాభిరత్ర – బంధుర్మే మాతా పృథివీ మహీయం' అన్న ఋగ్వేద మంత్రంలో ఆకాశం తండ్రి, పృథివి తల్లిగా చెప్పబడింది. ఆకాశం పరమాత్మ సంకేతం. 'సర్వాణి హవా ఇమాని భూతాని ఆకాశదేవ సముద్పద్యంతే' అని ఛాందోగ్యం (సర్వభూతాలూ ఆకాశంనుండి జన్మించినవి. ఇదే విషయం బ్రహ్మసూత్రాల్లో ఆకాశాధికరణంలో చర్చించబడ్డది.

3. పాపి నిరాల దృష్టి సంయోగంనుండి 'కాలి కంకలి' (కంకాళ కాళి) పుట్టినదన్న విషయం చాలా విచిత్రం, [1]దృష్టినుండి జన్మించటమెలాగా? సృష్టి విద్యలో వేదం రెండురకాల ప్రస్తావించింది. 1. మానస సృష్టి, 2. మైథునసృష్టి' మొదటిది సంకల్పసృష్టి ఏకమనేకం కావాలని సంకల్పమే మానససృష్టి. 'తదైక్షత బహుస్యాం', తత్తేజ ఐక్షత – తా ఆప ఐక్షంత-అన్న శ్రుతి వాక్యాలు చూడాలి. ఈ క్షత్యధి కరణంలో ఉంది. ఈక్షణం అంటే సంకల్పమని భాష్యసారం. ఇది మానసీ సృష్టితప్ప. మైధున సృష్టి కాదు. ఇది పంచభూతాలూ-జీవులూ ఏర్పడిన తర్వాతి విషయంఅలాగే 'కాలి' ఆకు తినడం అన్నది పంచభూత సృష్టికి హేతువులైన దేవతల జన్మకు హేతువు. ఇక్కడ శరదృషి ఉన్నాడు, ఆకున్నది. ఇది వటపత్రమే, పంచభూత విలీనావస్థ పర్ణం. బీజావస్థ. లేక విశ్వం-అశ్వత్థంగా భావింప

---

1. దృష్టి భావవ్యంజక సాధనాల్లో ప్రథమం. ఒక పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రనేత్త. భావ వ్యక్తీకరణానికి కంటి కంటే ముఖ్యాంగం లేదన్నాడు. (చూ. కృష్ణచైతన్య (indian Aestheties) ఇందుకే నాట్యశాస్త్రంలో దృష్టి భేదాలు రసానుగుణంగా అనంతంగా చర్చింపబడ్డాయి. ఇది నాట్యసౌందర్యం, అంటే శాశ్వతిక కామం కానిది.

బడింది. కాబట్టి దాని బీజరూపం అకు. శరదృషి ఏమిటి? ఋషి అంటే ప్రాణశక్తి. బీజప్రదః పితః-అని గీత. కాలి కంకలి పృథివీస్థానంలో ఉంది. అవి భూతాలను కన్న ప్రకృతిమాత. అది ప్రాణశక్తిని ధరించటమే ఆకు తినటం. ఇంకొకటి కూడా భావిత రమణీయం.

మాతా పితు రమృత ఆ బభాజ
ధీత్యగ్రే మనసా సంహి జగ్మే
సా బీభత్సుః గర్భరసా నివిద్ధా
నమస్వంత ఇదుపవాకమీయుః ఋగ్వే. 1-164-8

In the region of the Universal Rita, the mother separated from the Father, and in the primeaval ages wedded him in spirit and mind.

She in her periods (బీభత్సు) with the fluid potencled to corcieve fecundated Then the whole world approaches her full adoration

ఋతస్థానం మన కథలోనది. (ఋతువంటే వరుణస్థానమనీ, అప్పులనీ చెప్పబడుతున్నది. అంటే సముద్రం) అది సృష్టిపూర్వ కథ. అక్కడ స్త్రీ పురుషులు వేర్వేరుగా ఉన్నారు. అదే ఋషి కాళిగా మన కథలో ఉంది. పై మంత్రంలో మూడవ వాక్యాన్ని (సా బీభత్సుః-ఇత్యాది) వ్యాఖ్యానిస్తూ, వేద దార్శనికుడు శ్రీ వాసుదేవశరణ అగ్రవాలా గారు,

"As soon as the woman has her period she becomes abhourent (బీభత్సు), is not worthy being touched or seen—waters are spoken as the mother and unless those secretions become turbid is imbused with the principle of matter—she can neither concieve or bring forth. The abhourent waters are the mother prirciple in its turbid form permitted by matter—and unfit procreations etc" Vision in Long Darkness p. 43

రజస్వలాస్థితి బీజధారణ పూర్వావస్థ. సామాన్యంగా కథల్లో స్త్రీ నదీ స్నానార్థం పోవటం రజస్వలానంతర స్నానమే. ఇదే పై కథలో 'కరాలి' నదికి

పోవటం. శుద్ధజలం తేరుకోవటం శరల్లక్షణం. [1]ఆ ఋషి బీజప్రదాత, వాడు శరద్రూపుడు రజస్వలానంతర బీజనిక్షేపకుడే ఋషి శరత్—

ఇదే విషయం గూర్చి పైసందర్భంలోనే అగ్రవాలాగారు చెప్పారు.

"The mother principle - become purified (శుద్ధజలం తేరుకోవటం) ready like a mirror to recieve the reflections of the Sun is - the life principle Prana or 'Chidansa'. As such the woman is called Atriyi is under the influence of Atri Atri is the name of a Rishi. But also a kind of Prana which is called Dhamachchted which intercepts light — ఇదే పై కథా సారాంశం.

కుమారస్వామి కథలో తెల్లు వసమ్తుంది, అది శరత్తులోనే వికసిస్తుంది, కాబట్టి శరత్తు గర్భధారణకు ప్రతీక.

ఇలా వేదంలో సృష్టి విద్యే పైకథల్లో ఉంది. ఇవంతా కుమార విద్య. కుమారస్వామి జనన కథే. కుమారుడంటే సృష్టి. ఇవన్నీ ఈ జాతి కథలే. (motif)

కన్నమవారి పణతి కథలో పణతి నాయకురాలు నాగమ్మ వీరభద్ర కథలో రుద్రుడు. (రుద్రుడంటె కుమారస్వామి మహద్దశలో Cosmic level. వ్యక్తి దశలో జీవుడు) వీళ్ళంతా అయోనిజులు. సీతా ద్రౌపదులవలె. ఇది మానసీ సృష్టి విషయం. మైథున సృష్టి కాదు. పంచభూతాలు ఏర్పడేంతవరకు జరిగిన సృష్టి కథ. 77 మంది దేవతలకు కాళి కంకలి కన్నవిషయంలో 77 సంఖ్య శతపథంలో ప్రధాన దేవతలు 33 అన్న విషయమే.

---

1. జానపద కథల్లో స్త్రీ స్నానం చేస్తుండగా రేతస్సు గర్భప్రవేశం పొందటం ఆమె కొడుకును కనటం, వాడు పుట్టి తండ్రిని వెతకటం లాంటి అంశాలన్నీ ఇదే జాతి. తండ్రిని వెతకడమంటే జన్మరహస్యాన్ని తెలుసుకోవటం. తండ్రి బీజం-తెలియనిది. ఆ విజ్ఞేయతా ప్రతీక నిజంగా మానవజన్మ రహస్యాన్ని తెలిసినవాడు. ఋగ్వేదంలో కొన్ని మంత్రాలు ఈ ప్రశ్నలు వేస్తున్నవి. సర్ జేమ్స్ జీన్స్ అన్నాడు - పదార్థంలోకి ప్రాణం ఎలా ఎప్పుడు ఎక్కడ ప్రవేశించిందో తెలియదని. ఇదే పితృన్వేషణ.

పర్యాం రామాయణంలో రావణుని ప్రాణం పెట్టెలో పెట్టి, అగ్నినేత్రు డన్న మునివద్గర దాచి, రాముడితో యుద్ధం చేసాడన్న విషయం గాని, ఈజిప్టు క్రీ. పూ. 1300 నాటిదైన ఒక కథలో ఒకడి ఆత్మ తుమ్మచెట్టులో వుందనటం కాని, (డా. కృష్ణకుమారి గారి గ్రంథం. పు. 87) అరేబియన్ కథల్లో ఒకడి ప్రాణం పిచ్చుకలో దాచి దాన్ని పెట్టెలో పెట్టి, దాన్ని మరొక పెట్టెలో ఇలా ఏడు పెట్టెలు చేసి, దాన్ని సముద్రమధ్యంలో చలువరాతి మందిరంలో దాచిన కథ కానీ ఇలాటి వాటి కొకటే అర్థం. ప్రాణస్వరూపం అవిజ్ఞేయమనటం. అదే ఆత్మ స్వరూపం. ఇందుకే ప్రాణోస్మి ప్రజాత్మా తం మా మాయురమృత ముపాస్వ - (కౌషతకీ ఉపనిషత్తు) - ప్రాణస్వరూపుడను - చిదాత్ముడను - ఆయుస్స్వరూపుడను - అమృతుడను - నన్నుపాసింపుము - ఈ ప్రాణము వ్యక్తి - ఆయుస్సు లేక పర బ్రహ్మస్వరూపంగా పేర్కొనబడినది. అది అవ్యక్త స్థానంనుండి - అమూర్తసృష్టి సప్తస్వరూప జీవసృష్టిగా మారుతున్నది. (ఆ సప్త విషయం ముందే చెప్పబడింది) ఈ సృష్టి జలం నుంచి వచ్చిందన్నదీ ఉక్తపూర్వమే. ఇదే ఈజిప్టు కథారహస్యం. (ఈజిప్టు నాగరకత అంతా వైదిక నాగరకతేనని ఆధునిక భూగర్భ శాస్త్రవేత్తలు నిరూపించారు. చూ, మనుధర్మశాస్త్రం - ఒక పరిశీలన - కేవల్ మోత్వాని)

కాబట్టి, ఆ ప్రాణముపాస్య దైవరూపం. ఇందుకే,
కతమా - సాదేవతా? ఏ దేవతను ధ్యానించవలెను?
ప్రాణ ఇతిహోవాచ? ప్రాణమని సమాధానము,

ఈ విషయం బ్రహ్మసూత్రాల్లో ప్రాణాధికరణంలో ఉంది.

మరొక జాతి :—మండపేట పేరంటాలి కథ వంటి వాటిల్లో (చూ. డా॥ కృష్ణకుమారి గారి గ్రంథం. పు-81.) చనిపోయినవారు పాముగా - ఎర్రకలువగా పుట్టుకలగా మారిన అంశమంతా ఆత్మ సర్వవ్యాపకమన్న విషయాన్ని చెప్పేదే.

భారతీయార్ష భావనలో సర్వపదార్థాలు ఆత్మ పరివేష్టితాలే. 'ఈశావాస్య మిదం సర్వం' అన్న ఈశావాస్య ప్రథమ మంత్రం దార్శనిక విషయం తప్ప, వట్టి ఊహ కాదు. అలాగే,

మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణి గణానివ (గీత 7-7).
సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్యత్స్వ వినశ్యంతం యః పశ్యతి స పశ్యతి (13-28)

ఆత్మ పదార్థం గుణ స్థానమందుండగా జగత్తులన్నీ - జీవులందరూ ముత్యాలూ, రత్నాలుగా కూర్చబడ్డారు. ఇదొక మనోహరమైన హారం. ఆ రత్నాల్లో పాములూ-పక్షులూ-చెట్టు-జంతువూ-మానవుడూ అందరూ ఈ ఏకైక తత్త్వరూప సమన్వయమే పై కథల్లో సారాంశం. భారతీయ శిల్పాల్లో జంతు-మానవ సమన్వయాత్మక శిల్పజాతి ఒకటి. వృక్షమానవ సమన్వయాత్మక శాఖ మరొకటి వుంది. దానికి గజానన, నరసింహాది తారాలుదాహరణ. దీనికి సాల భంజిక. ఇందులో ఒక లతకానుకుని ఒక సుందరి నిలబడటం చెక్కబడుతుంది. ఇది మానవుడు - తన చుట్టూవున్న ప్రకృతితో - జీవులతో - తదతీత తత్త్వంతో తనను తాను సమన్వయించుకోవటమన్న సూత్రాధారంగా వచ్చిన శిల్పకళ. వృక్షం, సృష్టికి, సృష్టికతీత తత్త్వానికి సంకేతం. అదే సాలం. భంజిక అంటే స్త్రీ. అంటే ప్రకృతి పదార్థ జగత్తు జీవులు. ఈ సమన్వయ సూత్రమే పై జానపద కథా రహస్యం.

కాబట్టి, మార్గ-జానపద కథలు మూల బీజావస్థలో జాతితః స్వభావతః ఒకటే. రెండూ ప్రతీకా మార్గాన్నే నడుస్తాయి. రెంటిల్లోనూ అర్థం అన్వేషణీయమే. ఈ అన్వేషణమే మార్గమని ప్రారంభంలోనే చెప్పబడింది. వాటి మధ్య రీతి (శైలి) భేదమే తప్ప జాతి (motif or pattern) భేదం లేదు.

ఇతి శుశ్రుమ ధీరాణాం యేనః తత్ విచచక్షిరే "What I have saught is to understand what has been said"

# 14. అదృష్ట వాదము (అహేతువాదం)

ఇ - చింగ్ అన్న చీనా గ్రంథం ఆంగ్లానువాదానికి రాసిన పీఠికలోను, Synchronicity - An Acasual Connecting Principle — అనే వ్యాసంలోను ఇతరత్రా అనేక గ్రంథాల్లో యూంగ్ ఈ విచిత్ర సిద్ధాంతాన్ని స్థాపించాడు. ఇతర శాస్త్రకారులు కూడా దీన్ని అంగీకరిస్తూ వ్యాఖ్యానించారు.

ఒక కార్యం జరగాలంటే ఒక కారణముండాలి. ఒక పండు క్రిందకు రాల్తోందంటే భూమికి ఆకర్షణ శక్తి ఉండి వుండాలి. ఈ కార్యకారణ వాదం శాస్త్రీయ విజ్ఞానంగా 19వ శతాబ్దిదాకా అంగీకరింపబడినది. ఈ శతాబ్ది ప్రారంభంలో జరిగిన అంతశ్చైతన్య పరిశోధనవల్ల మన కార్యకారణ వాదానికి అందని కొన్ని సంఘటనలు, సందర్భాలు తటస్థపడుతూ విభ్రాంతుల్ని చేస్తున్నాయి. కార్యకారణ వాదం మనిషిలోని జాగ్రచ్చేతనా దశకు సంబంధించింది తప్ప అజాగ్రచ్చేతన పరిధిలోనిది కాదు. మానవ చైతన్యం నాలుగు విధాలుగా ఆధునిక శాస్త్రకారు లెప్పుడు విభజించి వ్యాఖ్యానించాడో జాగ్రచ్చేతనకు సంబంధించని మరొక కారణ సంపుటి బాహ్య సంఘటనలకు ముడిపెట్టి చెప్పుకోవలసిన అవసరమేర్పడింది. అందుచేత ఏ కార్యానికి మనం కారణాన్ని భౌతిక బుద్ధ్యా అంటే తార్కికంగా నిర్ధారించలేమో ఆ సందర్భానికి లేదా కార్యానికి ఒక సూక్ష్మకారణముండి ఉండాలి. అది మనో విషయం కాదు కనుక, దాన్ని వ్యాఖ్యానించుకోలేక అర్థరహితమైనదిగా కొట్టివేస్తున్నాం. కనుక కన్పిస్తున్న కార్యానికి సూక్ష్మ మనోలోకంలోని కారణం అదృష్టంగా ఉంది. కనుక ఈ వాదం అదృష్ట కారణాన్ని అన్వేషించి ఈ సందర్భానికి ముడిపెట్టి వ్యాఖ్యానించడంవల్ల దీన్ని అదృష్ట (కారణ) వాదంగా ఈ వ్యాసంలో వ్యపదేశింపబడుతున్నది.

ఉదాహరణకు ఒక మలేరియా జ్వరార్తుడు ఒక యోగిని సందర్శించాడు. వాడితో ఈయనన్నాడు. 'మీ వాకిట్లోకి వచ్చిన [1]నల్లకుక్కకు పెరుగన్నం పెట్టు నీ జబ్బు పోతుంది' అని. అది అలాగే జరిగింది. ఇక్కడ కారణ కార్యవాదం విధ్వంసమైనది. అంటే మన బుద్ధికందిన కారణమిక్కడ కన్పించ్లేదు.

---

1. చూ. శ్రీ షిరిడీ సాయిబాబా సచ్చరిత్ర.

పెరుగన్నానికి, రోగానికి ఏమిటి సంబంధం? పెరుగన్నం కుక్కకి పెట్టడానికి - రోగం పోవటానికి మధ్య ఏదైనా అదృష్టం - కనిపించని - సంబంధమున్నదా? లేదా? ఉన్నట్టు పై సంఘటన అనుభవంలో కన్పిస్తున్నది కదా?

'హోన్ ఫ్రాంజ్' అన్న శాస్త్రకారుడు ఇలాంటిదే మరో ఉదాహరణ యిచ్చి అదృష్టవాదాన్ని గూర్చి చర్చించాడు. అతడు రాస్తున్నాడు. 'నేను బజారుకు వెళ్ళి ఒక నీలం చొక్కా కొనుక్కొచ్చాను. అంగడివాడు పొరపాటున నల్ల చొక్కాను కాగితంలో చుట్టి యిచ్చాడని ఇంటికి వచ్చాక తెలిసింది. ఆ తెల్లవారి మా బంధువు ఒకడు చనిపోయాడు. ఇక్కడ ఈ ఉదాహరణంలో నల్లచొక్కాకి మృత్యువుకి సంబంధం ఏమిటి? అని తర్కించవచ్చు కాని నల్లరంగుకు మనం చెప్పుకునే అర్థంవల్ల ఈ జరగబోయే మృత్యువుకు అది సూచన అనిపిస్తున్నది. బహుశా ఆ చొక్కా కొనుక్కున్న వాడికి ఆ రాత్రి కలలో మృత్యుసంబంధమైన విషయమేదో వచ్చివుండి ఉండవచ్చు. ఇలాంటి సందర్భాలనేకం పరిశీలించిన పిమ్మట యూంగ్ పై సిద్ధాంతాన్ని చేశాడు.

మనకు యిలాంటివెన్నో తటస్థ పడుతూనే వుంటాయి. వాటిని చదువుకునే శక్తి లేనందువల్ల మనం తాత్కాలికంగా పట్టించుకున్నా ఒక సిద్ధాంతం చేసుకో లేము. యూంగ్ ఒక ఉదాహరణం చెబుతాడు. 'ఫ్రెడరిక్ ది గ్రేట్' చనిపోయే రోజున అతని గదిలోని బహు ప్రాచీనమైన గోడ గడియారం క్రిందపడి పగిలి పోతుంది. ఈ రెంటికేమిటి సంబంధం? ఆ సంబంధాన్ని స్థాపించేది యీ వాదం.

మనం జీవితంలో కూడా యిలాంటివెన్నో చూస్తున్నాము. ఒక వ్యక్తి మరణించబోతున్నాడు. వాడి ప్రేమపాత్రుడు చాలా దూరాన వున్నాడు. వీడు పోయి వాడి కలలో చెప్పాడు. నీవు రేపు ప్రొద్దునే రాకపోతే నన్ను చూడలేవు. ఆ వ్యక్తి కల నమ్మని[1] కొట్టి పారేశాడు. తీరా రెండురోజుల తర్వాత వస్తే నిజం గానే ఆ వ్యక్తి శవం కూడా కనిపించలేదు. ఇలాంటి ఉదాహరణల్లో మనకు భౌతికమైన కార్యాకారణవాదం కనిపించదు.

ఇ చింగ్ పీఠికలో యూంగ్ అంటాడు. 'చైనావారికి పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రంతో సంబంధం లేదు. ఇది కార్యకారణ వాదం. దీన్ని ఆధారంగా పెట్టుకొని

---

1. ఇది మా బంధువుల్లో జరిగింది (గ్రంథకర్త) 144.

మన శాస్త్రాభివృద్ధి జరిగింది. కాని నేటి శాస్త్రవేత్తల నూత్న పరిశోధనల ద్వారా కాంట్ 'Critique of Pure Reason' తల్లక్రిందులై పోతున్నది. మనము ఏవి ప్రకృతి స్వాభావిక సూత్రాలంటున్నామో అవి వట్టి గణాంక వాస్తవాలు. (Statiscal truths) తప్ప 'కేవల' సత్యాలు కావు. ప్రకృతిని మనం వ్యాఖ్యానించకుండా విషయాన్ని దానికే వదలివేస్తే మనకు వొచ్చే సమాధానం మన కార్య కారణ వాదానికి భిన్నంగా వుంటుంది. ప్రతి ప్రక్రియా విధానంలో సందర్భం 'చాన్స్' మన హేతువాదానికి అందకుండానే ప్రవేశిస్తున్నది. కనుక ప్రకృతిలో ఏ సంఘటననైనా కొన్ని ప్రత్యేక సూత్రాలకనుగుణంగా కలగటం లేదు. మన లెక్కలనన్నింటిని అతిక్రమించి మరొక సూత్రం యిక్కడ పనిచేస్తోంది. చీనా ఈ అదృష్టవాదాన్ని అంగీకరిస్తున్నది. పాశ్చాత్య బుద్ధి ఆరాధించే తర్కానికిక్కడ తావులేదు. అదృష్టవాదంలో కార్యాలకు మూలకారణాలు అదృష్ట స్వభావ శక్తులు తప్ప దృష్టశక్తులుకావు. ఉదాహరణానికి ఒక స్ఫటికాన్ని తీసుకుంటే అది షట్కోణాత్మకమన్నది సిద్ధాంతము. కాని ప్రకృతిలో ఏ రెండు స్ఫటికాలమధ్య సాదృశ్యం కనిపించదు. కాని అన్నీ షట్కోణాత్మకాలే. కమక అనుభవానికందుతున్న అసాదృశ్యం సత్యమా? సిద్ధాంతం సత్యమా? అదృష్టవాదము మేధాకల్పిత వాదాన్ని అంగీకరించకుండా ప్రకృతి సహజమైన అహేతుకతను సిద్ధాంతం చేస్తున్నది. ద్రష్ట దృశ్యాన్ని చూసిన వేళావిశేషం మీద ఎక్కువ ఊనికినుంచి సిద్ధాంతం చేయడంచేత కాలప్రభావాన్ని ఈ వాదం బలవత్తరమైనదిగా అంగీకరిస్తున్నది. ద్రష్ట. దృశ్యము. కాలము వీటి పరస్పర సమ్మేళనం (కో-ఇన్సిడెన్స్) మీద ఈ సిద్ధాంతం ఆధారపడి వున్నది. కనుక ఇ-చింగ్ గ్రంథం ప్రకారం ప్రతి సంఘటన ఒక ప్రకృతిగత అదృష్టదేవతా శక్తి చేష్టావిశేషం ఎలాగంటే మూడు నాణేలను ఎగురవేశాం. అవి రకరకాలుగా క్రింద పడ్డాయి. బొమ్మ - బొరుసులు పైకి క్రిందికీ కావటమన్న భేదంచేత. ఇది ఎగురవేసిన వాడి ఆలోచనలో లేని విషయము. అలాగే పసి పిల్లలో పూలో[1] ఎగురవేస్తే అవి ఒక ఆకారం క్రింద

---

1. శ్రీ పుట్టపర్తి సాయిబాబా చిన్నతనంలో తాను షిరిడీ బాబానని చెప్పడం కోసం నిదర్శనంగా పూలు వెదజల్లితే అవి షిరిడీ బాబా అనే అక్షరాలుగా సంఘటిత మయినాయని వ్రాయబడింది. ఈ విషయాన్ని యూంగ్ చెప్పిన విషయానికి అన్వయించుకోవచ్చు.

పడ్డాయి. ఈ ఆకృతిని ఎవడు కన్పించాడు? తర్కబుద్ధి కిది నచ్చపోయినంత మాత్రాన అసత్యం కాదు. మన పుట్టుపూర్వోత్తరాలేవీ తెలియకుండానే మనలను చూచినంతమాత్రంచేత జ్యోతిష్కులు మన విషయాలన్నీ చెబుతున్నారు. కొందరు రసికులున్నారు. వారు ద్రాక్షపానీయాన్ని రుచి చూడగానే రుచిని బట్టి ఆ ద్రాక్ష పండిన ప్రాంతాన్ని పానీయం తయారైన సంవత్సరాన్ని కూడా చెప్పగలరు. ఇలాంటి వాటినిబట్టి-It must be admitted that momendets can live long lasting traces.

(ఇ - చింగ్ పీఠిక). యుూంగ్ చెప్పిన ఈ విషయాన్ని 'వోన్-ఫ్రాంజ్' అన్న మరొక శాస్త్రవేత్త పదార్ధ విజ్ఞాన శాస్త్రాన్ని ఉదాహరించి దీన్ని సమర్థిస్తున్నాడు. 'పదార్థ విజ్ఞాన పరిశోధనలో ద్రష్టకు ప్రమేయం లేదు. వాస్తవికసత్యాన్ని స్థాపించడమే శాస్త్ర పరిశోధన. కాని ద్రష్ట లేదా ప్రయోక్తయొక్క చైతన్యం అనుప్రవేశించకుండానే వాస్తవిక సత్యం వ్యాఖ్యాతమవుతుందా? ఇది సూక్ష్మపదార్థ విజ్ఞానశాస్త్ర దృష్ట్యా అసంభవం.

Most modern physicists have accepted the fact that the role played by the concious ideas of an observer in every micro physical experiment cannot be eliminated but they have not conserned themselves with the posibility that the total psychological condition (both concious and unconcious) of the observer might played a role as well. (చూ. Man anb His Symbols p. 382.)

అతడే అంటాడు, విజ్ఞానశాస్త్రం పరిశోధకుడు ఒకేసారి ఒక వస్తువుయొక్క భిన్నార్థాలను పరిశోధించలేడు. అతడు అమర్చుకొన్న ప్రయోగ పరికరాలు, పద్ధతులనుబట్టి ఒక ప్రయోగంతో ఒక నిష్పాక్షిక సత్యమే బయట పడుతున్నదే తప్ప సంపూర్ణ సత్యం వెల్లడికావడంలేదు. ఉదాహరణకు కాంతి గమనము కణరూపంలోను తరంగ రూపంలోను రెండు విరుద్ధ సత్యాలుగా బయటపడింది. ఈ రెండు సత్యాలను ఒకేసారి శాస్త్రవేత్త ఒకే ప్రయోగంలో దర్శించింది కాదు. కనుక ఒక సూక్ష్మ అణుకణముయొక్క స్థితినీ వేగాన్ని ఒకేసారి శాస్త్రకర్త అంచనా వెయ్యలేడు. ఇందుచేత ప్రయోగ విజ్ఞానం ఒకేసారి ఒక సత్యాన్ని మరొకసారి దానికి విరుద్ధమైన సత్యాన్ని కనిపెడుతున్నది. ఏవో కొన్ని ప్రాకృతిక సూత్రాలు

చెప్పి వాటి ప్రకారం సర్వావస్థల్లో ఈ కార్యమిలాగే సంభవిస్తుంది. అని అనడానికి వీల్లేదు.

No Natural Laws can be formulated saying such and such will happen in every case. All the micro-physicists can say such and such is according to statistical probability likely to happen

అని ఈ విధంగా యూంగ్ అదృష్టవాదాన్ని సూక్ష్మపదార్థ విజ్ఞానశాస్త్రదృష్ట్యా సమర్థిస్తాడు.

ఈ వాదాన్ని వివరిస్తూ యూంగ్ అంటున్నాడు.

It is a concept that formulate point of view diametically opposed to that of causality. Since the latter is merely statistical truth and not obsolute. It is a sort of working hypothesis of how events eolve one out of anothor, where as synchronicity takes the coincidence of events in space and time as meaning something more than more chance, nemely a peculiar inter dependance of objective events among themselves as well as with the subjective (psychic) states of the observer or observers. (Iching పీఠిక)

అందులోనే యూంగ్ చైనా అదృష్టవాదాన్ని వివరిస్తూ అంటున్నాడు.

'ప్రాచీన చైనా బుద్ధికి విశ్వమంతా ఆధునిక పదార్థ విజ్ఞానశాస్త్రవేత్తలకు లాగా 'సైకో ఫిజికల్ స్ట్రక్చర్' (చైతన్య+పదార్థ, నిర్మాణము) సూక్ష్మ భౌతిక సంఘటన ద్రష్టను కూడా తనలో ఇముడించుకుంటుంది. ఆ క్షణిక సందర్భం దేశకాల ద్రష్ట సమ్మేళనం తప్ప ద్రష్ట యొక్క చైత్యపురుషుడు (Psychic being కూడా ఆ సందర్భంలో ఉన్నాడు.

Just as causality describs the sence of events so synchronicity to the chainers mind deals with the coincidents of events.

అంటే కారణ కార్యవాదం ప్రకారం ఇ, ఈ లు రావాలంటే ముందు అ, ఆ ఉండాలి. అ నుండి ఆ దీని నుండి ఇ, దీని నుండి ఈ రావాలి. పూర్వాక్షరం

పరాక్షరానికి హేతువు. ఇది తర్కం. కాని అదృష్టవాదానుసారం యివన్నీ ఒకేసారి ఒకేచోట ఎలా కన్పించాయి? కనుక అ, ఆ లు ఎంత భౌతిక సంఘటనో ఇ ఈ లు అంత మానసిక సంఘటన. రెంటి మధ్య భేదం లేదు కనుక అన్నీ ఒకేసారి సంభవించాయి. ఈ విషయాన్ని వివరిస్తూ వోన్-ఫ్రాంజ్ అంటాడు.

No bocy for instence candeny that 2 is the only existing even primary number, even if he has never thought about it concicusly before. In other words numbers are not concepts conciously invented by men for purposes of calculation. They are spontaneous and autonomous products of the unconcious as are other Archetypal symbols

(Men & His Symbols—386)

ఈ సిద్ధాంతం ప్రకారం ద్రష్టయొక్క చైతన్యానికి దేశకాల (గత) చైతన్యానికి సంబంధమున్నది కనుక రెండూ ఏకైక పదార్థం ధరించిన భిన్నరూపాలు కనుక ఒక బాహ్య సంఘటనకు అంతఃచ్చైతన్యంలో సూక్ష్మకారణం వున్నదని స్పష్టం.

ఈ దీనికొక ఉదాహరణం ధర్మచక్రం నవల్లో కనిపిస్తుంది. సందర్భం— రాజొక బ్రాహ్మణున్ని అన్యాయంగా చంపాడు. "ఆ గాలిలో నేముండెనో. **అంత** వరకు పూవులు వికసింపగా క్రమ్మిన యొక అనిర్వచనీయమైన సుకుమార పరిమళ భరిత మధురశాంతి వ్యాపించియుండెడు నాకాశమున నంతలో ఒక ఝంఝ పెళ్ళ రేగి ధూళిగ్రస్తమై శాంతియంతయు విఱిగిపోయినట్లే, నిముసములో మాఱిపోయిన గతి—ఒక లిప్తలో భద్రకాళీ నాట్యరంగమువలె, నొక కసాయి దుకాణమువలె — వైతరణీనదీ తీరమువలె భయంకరమైన మనస్సుచేత నావరించబడెను. చంపబడిన దొక్కడే బ్రాహ్మణుడు. ఆ చావులో నెన్ని చావు లిమిడియుండును? ఒక్క మరణము జరిగినచోట నొక్కవధ జరిగినచోట నందున్న పంచభూతములనేదో వినాశాభిముఖముగ నున్నట్లు కన్పించుట ఏమి తత్త్వతత్త్వులగు సర్వేతరులకు మనసుచేత సూహింప రాని యేదో యాపద తమ్ము నావరించుటకు వచ్చునట్లు గలిగెడి మనోవికార మేది? మనస్సుకు గల సార్వత్రికవ్యాప్తిచేత నదైక్యత దేశగత వధమో—మరణమో, సర్వాకాశగత సర్వాణువ్యాప్తిమైనట్లు కన్పించునా? (12 అధ్యాయం)

ఈ అద్భుత వర్ణనలో పై యూంగ్ సిద్ధాంతం అన్వయిస్తుంది. ఒక సంఘటనను ప్రాచ్యబుద్ధి ఎలా వ్యాఖ్యానిస్తుందో—చూస్తుందో—వివరిస్తుంది.

మానవచైతన్యం దేశకాల చైతన్యం అంతా కలిసి ఒక ముద్దగా ఏర్పడ్డచోటు పేరు సంఘటన. ఇందులోని అంగాలు మనిషి, ప్రకృతి-కాలము-అంగి సంవర్భం. అంగాల్లో బలం కాలచైతన్యానిది. ఆ సంఘటన కర్తృత్వశక్తి ప్రధానంగా కాలానిది ఆ సందర్భం ప్రతీకాత్మకమైన ఒక నమూనా (Archetyp situation) కనుక బాహ్యాభ్యంతర చైతన్య సంబంధాన్ని స్థాపించే సిద్ధాంతమిది ఇందుకే సింక్రోనసిటీ అంటే—A meaningful concidence of out and inner events that are not themselves causally connected అని వోన్ ఫ్రాంజ్ వివరణ. ఆ రెంటి మధ్య ఒక అతర్కిత అదృష్టం కారణంగా వుంది. అని ముందు చెప్పిన నల్లచొక్కా ఉదాహరణమిచ్చి అంటాడు. 'అంతర్గత ప్రాగ్రూపం' (ఆర్కి-టైపును వేదం ప్రథమచ్ఛదం అంటుంది) బాహ్యాభ్యంతర భూమికల్లో ఒకేసారి పనిచేసివుండాలన్న మాట. చీనీయుల వైద్య వాస్తుతత్త్వ సిద్ధాంతాలన్నీ దీనిమీదే ఆధారపడివున్నాయి.

The classical Chinese Text did not ask what causes what. One can see much the same underlying theme in astrology and in the way various civilizations have depended on consulting oracles and paying attention to omens. All of these are attempts to provide an exclenation ef considance is different from one that depends on straight forword cause and effect.

(చూ. పై గ్రంథం p. 277)

మరొక మనస్తత్త్వ శాస్త్రవేత్త జకోబ్ అదే పుస్తకంలో Symbols in an individual analysis అన్న వ్యాసంలో అంటాడు 'ఐ-చింగ్' జోస్యం చెప్పే గ్రంథం. ఇవన్నీ ఎవడు నమ్ముతాడని మనం అనుకోవడం సహజం. కాని యూంగ్ ప్రకారం అది చాలా అర్థవంతమైనది. అతని వాదమైన సార్థక సంబంధం 'మీనింగ్‌ఫుల్ కో-ఇన్సిడెన్స్' సిద్ధాంతం.

based on the assumption of an inner unconcious knowledge thet links a physical event with a psychic condition. So that a certain event that appears as accidental or coincidental can in effect can in fact be physically meaningful and its meaning is often symbolically indicated through dreams that coincide with the event—

అని చెప్పి ఇతడు యూంగ్ చెప్పిన ఇ-చింగ్ గ్రంథాన్ని బట్టి ఒక వ్యక్తి కలలను గురించి చర్చించి యూంగ్ సిద్ధాంతాన్ని బలపరచాడు ఇ-చింగ్.

Book of changes. The book is based on the hypothesis of the oneness of man and the surrounding cosmos—

అని యూంగ్ చెప్పిన సిద్ధాంతం దీనికి సంబంధించినదే అంటాడు. యూంగ్ సిద్ధాంతం గూడ యిదేనని పై వాక్యా లుదాహరిస్తాడు. (—based on the — the events)

ఈ వాదాన్ని వివరిస్తూ ఫ్రాంజ్ ఇలా వ్రాశాడు. 'ఈ శతాబ్దిలో శాస్త్రవేత్తలు ఒకరికి తెలియకుండా మరొకరు ఒకే శాస్త్రీయ సిద్ధాంతాన్ని చేయడం దీనికి సంబంధించిందే. డార్విన్ తన పరిణామవాదాన్ని గ్రంథంగా 1844లో వ్రాస్తూ వుండగా అతనికి తెలియని ఒక అజ్ఞాత శాస్త్రవేత్త. ఏ. ఆర్. వాలీస్ అన్నవాడు ఒక వ్రాత ప్రతి తెచ్చి డార్విన్ కిచ్చాడట. అందులో తానూహించిన సిద్ధాంతమే వున్నదట. కనుక సుప్తచైతన్యం ఒకేసారి అనేకుల్లో మెఱుపులాగా స్ఫురించడం జరిగాక తరువాత దాన్ని తర్కబద్ధం చేస్తూ వచ్చారు. ఇదంతా ఆర్కిటైపుయొక్క సృజన కార్యంగా పేర్కొన్నాడు. ఈ ఉదాహరణ త్యాగరాజస్వామి జీవితంలో తాను సంగీత శాస్త్రం వ్రాద్దామనుకుంటుండగా నారదుడు (జ్ఞానానికి ప్రాగ్రూపం) విప్ర రూపంలో వచ్చి సంగీత శాస్త్రగ్రంథాన్ని యిచ్చినట్లు చెప్పబడిన వృత్తాంతంలో డార్విన్ విషయం సంవదిస్తున్నది కదా.

ఈ విధంగా ఈ అదృష్టవాదం భౌతిక సంఘటనలోని అంతశ్చైతన్య ప్రేరణను సూచిస్తూ రెండూ ఏకపదార్థ వికారాలేనని స్థాపిస్తున్నది. అంటే ప్రపంచమంతా (ఈశ్వర) చైతన్యంచేత అభివ్యాప్తమై వున్నదన్న ఈశావాస్య సిద్ధాంతాన్ని భంగ్యంతరంగా వ్యాఖ్యానిస్తున్నది. వ్యక్తిలోనూ పదార్థంలోనూ ఏకైకచైతన్యమే స్పందిస్తూన్నందువల్ల రెండూ ఒకటేనని, విశ్వమంతా Psyeho Physical Structureగా నిరూపిస్తున్నది. (ఇంకా దీనికి తాత్త్వికనిరూపణం కావాలనుకొన్నవారు శ్రీ అరవిందుల The Life Divineలో రెండో భాగంలో 21వ అధ్యాయం The order of the worlds and The rebrith and other worlds 22వ అధ్యాయం సంప్రదించుకోవచ్చు)

ప్రతి విషయాన్ని తార్కికంగా - కారణ కార్యవాదానుసారంగా వ్యాఖ్యానించడం ఒక పద్ధతి. పై పద్ధతిలో సృష్టిలోని ప్రతి పదార్థము ప్రతి సంఘటన వాచ్యార్థంతోపాటు ప్రతీకార్థాన్ని నిష్పన్నం చేస్తున్నదని ఈ వాద సారాంశం. ఇందుచేతనే ఈ శతాబ్దిలో ప్రతీకా వాదానికంత ప్రచారం వచ్చింది. ఇది సుప్త చైతన్య విషయం కాగా అది (తర్కవాదం) జాగ్రచ్చైతన్య విషయం.

ఈ వ్యాసం ఫ్రాంక్ మాటలతో ముగించబడుతున్నది.

The concept of a uniterial idea of reality which has been followed up by Pauli and Eric newmans was called by Jung the UNUS-MUNDUS (The one world within which matter anb psyche are not get discriminated or separately actuvalised) (పై గ్రంథం పుట, 38·)

# 15. పులి మ్రుగ్గా - కవిపుంగవుడా

శ్రీ త్రిశేషుల విశ్వనాథ కవిసమ్రాట్టు పులిమ్రుగ్గు అన్న నవల రాసిన విషయం ప్రసిద్ధం... దీని విషయం వ్యాసాంతంలో వివరింపబడుతుంది. జానపద దృశ్య కళల్లో పులివేషం కట్టడముంది. జంతువుల నామాలు శ్రేష్ఠ వాచకాలుగా ఉపమానాలుగా గ్రహించడముంది. ఉదాహరణకు రాజసింహుడు. కవిపుంగవుడు మొదలైనవి. వినాయకుని వంటి విగ్రహాలు మానవ-జంతు సమన్వయ రూపంలో శిల్పించడం, ఆరాధించబడటం చూస్తున్నాం. మత్స్యకన్యా వృత్తాంతాలు ప్రసిద్ధంగానే నేటికీ వినివస్తున్న అంశం ఇక్కడ సింహాది జంతువుల ప్రసక్తి ఎందుకు వస్తున్నదన్న ప్రశ్న విచారణీయమవుతున్నది.

క్రీస్తుకు పూర్వం పదివేల నుండి అరవై వేల సంవత్సరాల దాకా వ్యాపించి వున్న మంచుయుగం నాటికే ప్రపంచంలో కొండగుహల్లో జంతు చిత్రాలు చిత్రించబడటం ఆధునిక కళాచరిత్రవేత్తలకు అందిన విషయం. ఆ తరువాత వచ్చిన కొత్త పాత రాతియుగాలనాడు కొండ గుహల్లో జంతువును వేటాడటం లాంటి చిత్రాలు వచ్చాయి. అలాగే జంతువు ఎదకావడం ఆ సమయంలో జంతువులు సంగమించడం లాంటి చిత్రాలు వచ్చాయి. ఈ చిత్రీకరణ అతి సహజంగా ప్రకృత్యనుకరణంగా కనిపించినా, శాస్త్రవేత్తలు వీటికి చెప్పే అర్థాలు చాలా చిత్రంగా వున్నాయి. ఉదాహరణకు జర్మన్ కళా చరిత్రకారుడు హెస్బర్ట్‌కున్ వాదాన్నిబట్టి ప్రాచీన మానవుడు చేసే ప్రతికార్యము క్రతురూపమే. అక్కడ కర్మ వుంటుంది తప్ప ఆలోచన వుండదు. ఆలోచన మానసికమైనది. కర్మ అతిమానసికము. మనసన్నది మానవ పరిణామంలో ఇటీవల పుట్టిన విషయము. ఒకసారి యూంగ్ ఆఫ్రికా అడవుల్లో తిరుగుతున్నపుడు, ఆటవికులు లేవగానే దోసిట్లో 'ఉఫ్' అని ఊదుకొని లేదా వుమ్ముకుని ఆ దోసిలిని సూర్యునకు అర్ఘ్యంలాగా అర్పించడం చూచి యిదేమిటన్న ప్రశ్న వేసాడట. వాళ్లు తెల్లబోయారట. ఇలాంటి అనుభవాలు చూచి యూంగ్ పై రీతిగా 'ప్రాచీన మానవుడికి కర్మ తెలుసు. అది అనాలోచితం తప్ప ఆలోచితం కాదు. ఈ కర్మలో మూడు లక్షణాలుంటాయి. ఒకటి ప్రతీకాత్మకము. ఇది క్రతురూపం. రెండు కళాత్మకము. మూడు వాస్తవికము. ప్రాచీనకర్మ వాస్తవికం కాదు. ఇందుకే జానపదాంశాలు, పౌరాణికాంశాలు క్రతురూపాలుగా అతి మానస విషయాలుగా వ్యాఖ్యానింపబడ్డాయి.

కనుక వేటాడబడే జంతువును ముందు బొమ్మగా గీసి దానిని ఈటెలు, బాణాలు గుచ్చుకున్నదానిగా చిత్రించి ఈ బొమ్మ వాస్తవిక జంతువునకు ఆత్మీయమైన ప్రతిరూపంగా, ఆత్మగా (soul భావించి చిత్రించాక అసలు జంతువును వేటాడతారట నేటికీ కొన్ని ఆటవిక జాతులు. ఒకసారి ఒక తెల్లదొర ఆఫ్రికా అడవుల్లో జంతువును తుపాకీతో కాల్చబోగా, వెనకనున్న ఆటవికుడు కాల్చవద్దని అడ్డు నిల్చాడట. ఈ కాల్చడం వాస్తవిక కర్మ. దీన్ని మనస్తత్వ శాస్త్రవేత్తలు 'సింపథిటిక్ మాజిక్'గా చెబుతున్నారు.

ఎద అయిన జంతువుల సంగమ చిత్రకరణంతా ఫెరిటిలిటి రైట్స్‌గా చెబుతున్నారు. బహుశా అశ్వమేధ యాగంలో అశ్వం చంపబడడం - ఇక్కడ అశ్వభావన ఈ యజ్ఞకర్మంతా ఈ దృష్టితో చూడవచ్చుననుకుంటాను.

మరికొన్ని గుహచిత్రాల్లో మనిషి జంతువుగా తన నాచ్ఛాదించుకొని, జంతువుల గుంపులో విహరిస్తూ వుండడం—అలాగే మనిషి వేరువేరు జంతువుల అవయవాలను తగిలించుకుని నృత్యం చేయడం వంటి బొమ్మలు ఫ్రాన్సు గుహల్లో కనిపించాయట. ఈ బొమ్మను గురించి వ్యాఖ్యానిస్తూ అతడు జంతు చక్రవర్తిగా చెప్పారు (హరప్పా బొమ్మల్లో ఎద్దు కొమ్ములను పెట్టుకుని పద్మాసనంలో వున్న వ్యక్తిని పశుపతిగా భావించినట్లు). ఇలాంటి బొమ్మల కర్థాలేమిటీ అని? ప్రాచీన సంఘంలో దీక్షావిధుల్లో (Rituals) దీక్షితుడైన వ్యక్తిని జంతుత్వ ఆచ్ఛాదనం చేయడం వుందట. బహుశా ఇది ప్రతిశీర్షక (మాస్క్) సంప్రదాయానికి మూల రూపం కావాలి. జంతువుల్లో ఏ విధంగా సింహాదులు రాజులో ఆటవిక తెగలకు రాజైనవాడు కూడా సింహరూపుడే. అన్న భావనతో వారు దీక్షావిధులు ఆయా జంతురూప ధారణతో జరుపుకొనేవారట. కనుక తెగకు నాయకత్వం అభిషేకించుకునే నాయకుడు పూర్తిగా జంతువేషాన్ని ధరించేవాడట. అప్పుడతడు కేవలం జంతువే. జంతురూపంతోపాటు జంతు ఆత్మను కూడా (స్పిరిట్) పొందేవాడట. అప్పుడతడు తెగకు మూలపురుషుడుగా దైవముగా ప్రాతినిధ్యం వహించేవాడట. దీన్నే 'ఎనిమల్ టోటమ్'గా చెబుతున్నారు. కనుక జంతురూపధారియైన మనిషి నృత్యం చేస్తున్నట్లుగా చిత్రించబడ్డ గుహ చిత్రణకర్థం, ఒక తెగనాయకుడు ఆ రూపంలో తనను తాను జంతు రూపంగా పరిణమింప చేసుకోవడమన్నమాట. ఇందుకే ప్రతిశీర్షక సంప్రదాయం నాటకంలో నేటికీ మిగిలివుంది. ప్రతిశీర్షక ధారణం చేసిన వ్యక్తి జంతు రాక్షసులుగా పరిణమించడమన్న ఒక స్థితితదావేశం

పొందడమన్నది ప్రాచీనకాలంలో వుండేది. (వేయిపడగల్లో విశ్వనాథవారు కూచిపూడి నాట్యాన్ని వివరిస్తూ అన్నాడు - "ఒకప్పుడు నరసింహస్వామి వేష ధారణ చేసిన వ్యక్తి ఉపవాస జపాలతో నృసింహస్వామి తాదాత్మ్యం పొంది నిజం గానే హిరణ్యకశిపు వేషధారిని గోళ్ళతో చీల్చి చంపాడట. ఇలాంటి విషయమే ఆటవికుల్లో జరిగినట్లు యూంగ్ చెబుతాడు) కనుక ప్రతి శీర్షక సంప్రదాయం సంప్రదాయం వెనుక కథ చాలా వుంది.

ఈ జంతు రూపధారణ చేసిన వ్యక్తి ఒక ఆటవిక నృత్యం చేస్తున్నాడు. ఈ నృత్యములో ఆ జంతుత్వ అనుకరణ సంబంధమైన విషయము. ఇది దీక్షకు, క్రతువుకు మరొక రూపం. ఇందుకే ఒక గుహలో జంతువుల గుంపు చుట్టూ మానవుల వృషభాల గుర్తు చిత్రింపబడి, దీన్ని గూర్చి రాస్తూ 'కూన్'

"మనిషి జంతువేషధారియై - వాటిలో తాదాత్మ్యం పొంది వాటితో పాటుగా కలిసిపోయాడు" అని.

అంటే వ్యక్తికి ఆ తెగకు సంబంధించిన 'టోటమ్' జంతువుకి (లేక బుష్-సోల్) ఒక అవినాభావ సంబంధాన్ని తాదాత్మ్యాన్ని స్థాపించే దీక్షలు, క్రతువులు వున్నాయి. దీనికి ప్రతిరూపం నృత్యం. అంటే వ్యక్తి తన జంతు ఆత్మను పొందటం. తనలోని జంతువును పైకి తెచ్చుకోవడం. తరువాత దాన్ని సంహరించి అప్పుడు నిజమైన మనిషిగా పరిణామాన్ని పొందే ఒకానొక సంప్ర దాయం వుండేది. ఉన్నది. (దీనికి మహద్రూపమే-కాస్మిక్ ఫారమ్' మహిషాసుర మర్ధన పౌరాణికాంశం). మహిషాసురుడు ప్రతి మనిషిలో అంతర్గతంగా ఉన్న జంతురూపం. వాణ్ణి బహిర్గతం చేసుకునే దీక్ష నృత్యం మహిషాసుర ప్రతి శీర్షక ధారణ చేసి జరుపుకునే తంతు-తంత్రం, మహిషాసుర నృత్యం. ఆ విధంగా మహిషాసురుడు మన లోపలనున్న జంతు ధర్మ స్వరూపుడు. వాడిని బహిర్గతం చేసి పట్టుకొని సంహరించి మనిషి తన ఉన్నతాత్మలబ్ధి పొందుతున్నాడు. దీనికి నాట్యం-దీక్ష, క్రతువు వంటిది. ఈ లక్షణం, ప్రాచీన ఆటవిక జాతుల్లో జంతు రూపధారణలో నృత్యంలో గర్భితమైన అంశంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఈ జంతువు మనిషి లోపలి పైశాచికం. అధర్మ శక్తి. యజ్ఞ విధానంలో జానపదుల పండుగల్లో జంతుబలి విధానమంతా ఈ సూత్రానికి సంబంధించిందేనట. బలి చేయబడుతున్న జంతువు తనలోని పశుత్వానికి ప్రతీక. దాన్ని చంపి మనిషి దేవతగా పరిణామం పొందటం క్రతు విధాన రహస్యం. ప్రాచీన నాగరికతల్లో వీటి విషయాలు చాలా

వున్నాయి. దేవతలకు జంతు రూపాలు, జంతువులు, వాహనాలూ
ఇదంతా దీనికి సంబంధించిన విషయమే. కనుక యిక్కడ జంతువు అ
అనాత్మ భౌతిక శక్తికి ప్రతీక. దాన్ని చంపటం ఆత్మ శక్తిని సము
సాధన క్రతువు. మనలోని ప్రాచీన జంతు రూపాన్ని గుర్తించడం ఉన్న
సోపానం. ప్రాచీన మానవుడు జంతువుని మచ్చిక చేసుకుని దాన్ని తన
వినియోగించుకున్నట్లుగా ఆధునిక మానవుడు కూడా తనలో గుప్తంగావు
జంతువును పసిగట్టి బలివ్వాలి. ఆత్మ వేదికలపై బలివ్వకపోతే అది
రూపంలో బైటపడి రాజకీయ విలయతాండవం చేసి మానవజాతిని సంహ
ఇందుచేత రాజు కవి మానవజాతి నాయకులు కనుక జాతిని ముందుకు తీసు
నేతల్లు కనుక వారిద్దరు సింహాలు ఏనుగులు కాక తప్పదు. ఇందుకని
వాచకాలు ఉపమానాలుగా స్థిరపడ్డాయి.

నేటికీ జానపద కళల్లో పులివేషాల వంటివి అతి ప్రాచీన ఆటవిక స
సంబంధించిన క్రతురూపమే. ఇందుకే మనిషిని పులిగా మార్చే ఒకానొ
కూడా వున్నది. ఆ తంతు ముగ్గురూపంలో జరుగుతున్నది. (ముగ్గులని
కళా విశేషాలే. ఈ ముగ్గులు అనేక రూపాలు. అశుభాన్ని పోగొట్టేవిగా
యిచ్చేవిగా పరిశీలిస్తే గోచరిస్తాయి. అవన్నీ అవ్యక్త తత్వసంకేతాలైన
కళామూర్తులు.) అబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్ ఫారమ్స్‌లో గోచరిస్తాయి. (
శాస్త్రంలో కూడా స్వప్నాల ద్వారా బహిర్గతమైన అజాగృత చైతన్యరు
మెండర్స్, మేజేస్‌గా వ్యాఖ్యానించడం వుంది. అజాగృత చైతన్యం
వ్యూహం లాంటివని చెప్పడమే తాత్పర్యం. దాన్లో ఒక మార్గాన్ని కనిపె
మనిషి ముక్తుడవుతాడట. అంటే సైకిక్ గ్రోత్ ఏర్పడుతుందట. వ్యక్తి స
సంపుటి వాటి అవ్యక్త స్థితికి ముగ్గు సంకేతం. ఆ ముగ్గులో మనిషి
మారతాడు. తిరిగి మనిషిగా మారతాడు. ఈ సంప్రదాయ విధానం అ
నేటికి వున్నట్లు 'పాకలపాటి గురువుగారు' అన్న పుస్తకంలో కీ
'భరద్వాజ' (గ్రంథకర్తకు విశాఖపట్టణం అడవుల్లో నివసించిన ఆ గు
చెప్పినట్టుగా వ్రాయబడి వున్నది.

కనుక ప్రతి ముగ్గు-పులివేషము వీటి వెనుక అతి ప్రాచీన ఆట
మున్నట్లు చెప్పబడుతున్నది.